

*Patronizer :*

H. VENKATARAO PANTULU GARU

శ్రీ హయగ్రీవాయ నమః

# ఉత్తర రామ చరితమ్

( ప్రతిపదార్థ తాత్పర్యసహితమ్ )

## ప్రస్తావనా

శ్లో॥ ఇదం కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే
వింధేమ దేవతాం వాచ మమృతా మాత్మనః కలాం ॥ ౧

అర్థః- పూర్వేభ్యః = ప్రాచీనులైన, కవిభ్యః = ( వాల్మీకి మొదలగు ) కవులకొఱకు, నమః = 'నమః' అనెడి + వాకం=ఉచ్చారణ కల్గినట్లుగా ( నమస్కారపురస్సరముగా ) ఆత్మనః=బ్రహ్మయొక్క, అమృతాం=అమృతరూపమగు, కలాం=షోడశభాగాత్మకమగు, దేవతాం=దేవతాస్వరూపిణియగు, వాచం=వాక్కును, విందేమ=పొందుదుముగాక; ఇదం=దీనిని, ప్రశాస్మహే=ప్రార్థించుచున్నాము.

తా॥ ఆదికవియగు ప్రాచేతసునకును, దదితరకవులకును గురుభక్తియుతులమై కేల్మోడ్చి, అనపాయినియు, షోడశభాగాత్మికయునగు బ్రహ్మయొక్క వాగ్దేవి మాకుఁ బ్రత్యక్షమై వర్తిలుఁగాక యని ప్రార్థించుచున్నాము.

( నాన్ద్యన్తే. )

సూత్రధారః:- అల మతివిస్తరేణ; అద్య ఖలు భగవతః కాలప్రియనాథస్య యాత్రాయాం ఆర్యమిశ్రాన్ విజ్ఞాప

యామి. ఏవ మత్రభవన్తో విదాంకుర్వన్తు. అస్తి తత్రభవాన్ కాశ్యపః శ్రీకంఠపదలాంఛనః పదవాక్యప్రమాణతత్వజ్ఞో భవభూతిర్నామ జాతుకర్ణీపుత్రః.

( నాన్దీ=మంగళక్రియకు, అంతే=అవసానమందు. )

సూత్రధారుఁడు:— అతి—విస్తరేణ=మిక్కిలి-విస్తరించుటచే, అలం=చాలును, అద్య + ఖలు = నేఁడే, భగవతః = పూజ్యుఁడగు, కాలప్రియనాథస్య = కాలప్రియనాథుఁడను శివలింగముయొక్క, యాత్రాయాం = యాత్రయందు, ( సమవేతాన్=కూడిన ) ఆర్యమిశ్రాన్=పూజ్యులరగు మిమ్ముఁగూర్చి, విజ్ఞాపయామి=మనవిచేయుచున్నాను. అత్రభవన్తః=తమరు, ఏవం=ఇట్లు, విదాంకుర్వంతు=అవధరింతురుగాక. తత్రభవాన్=పూజ్యుఁడైనట్టియు, కాశ్యపః = కశ్యపగోత్రమునఁ బుట్టినట్టియు, శ్రీకంఠ = శ్రీకంఠ ' యను + పద=పదము + లాంఛనః=గుర్తుగాఁగలట్టియు, పద=ఉపోచితములగు పలుకులయొక్కయు + వాక్య = ( అర్థగాంభీర్యాదికయుక్తములగు ) వాక్యములయొక్కయు + ప్రమాణ = అనుశాసనముల యొక్క + తత్వ = మర్మములను + జ్ఞః=గుర్తెఱిఁగినట్టి, భవభూతిః + నామ = భవభూతియని ప్రసిద్ధిచెందిన, జాతుకర్ణీ=జాతూకర్ణ్యగోత్రమున జన్మించిన యొక బ్రాహ్మణికి + పుత్రః=కుమారుఁడు, అస్తి=కలఁడు.

శ్లో॥ యం బ్రహ్మాణ మియం దేవీ వాగ్వశ్యే వానువర్తతే
ఉత్తరం రామచరితం తత్ప్రణీతం ప్రయుజ్యతే ॥ ౨

అర్థః— యం + బ్రహ్మాణం = ( బ్రహ్మదేవుని ) ఏబ్రాహ్మణోత్తముఁడగు భవభూతిని, ఇయం = ఈ, దేవీ + వాక్ = సరస్వతీదేవి, వశ్యా + ఏవ=వశ్యురాలగుచునే, అనువర్తతే=సేవించుచున్నదో; తత్ = ఆభవభూతిచే + ప్రణీతం=రచింపఁబడిన, ఉత్తరం = ( రావణసంహారానం

తర మయోధ్యాప్రవేశ మొనర్చిన ) తరువాతి, రామ—చరితం = శ్రీరామ చరిత్ర, ప్రయుజ్యతే = అభినయింపఁబడఁబోవుచున్నది.

తా॥ సరస్వతీదేవి వశ్యురాలై బ్రహ్మదేవుని ననువర్తించినటుల, బ్రాహ్మణోత్తముండగు నే భవభూతినిగూడ ననువర్తించెడినో; అట్టి మహాకవిచే రచింపఁబడిన ఉత్తరరామచరిత్ర యభినయింపఁ బడఁబోవుచున్నది.

సూత్రధారః:— ఏషోఽస్మి, కార్యవశా దాయోధ్యక స్తదానీంతనశ్చ సంవృత్తః. ( సమంతా దవలోక్య ) భో భోః యదా తావత్ తత్రభవతః పౌలస్త్యకులధూమకేతోః మహారాజరామస్య అయ మభిషేకసమయః రాత్రిందివ మసంహృతానందనాందీకః, త త్కిమితి విశ్రాంతచారణాని చత్వరస్థానాని ?

సూత్రధారుఁడు:—ఏషః = ( ఇదుగో ) ఈ నేను, కార్య—వశాత్ = ఒకపనిమీఁద, ఆయోధ్యకః = అయోధ్యాపట్టణమునకు సంబంధించిన వాఁడను, తదానీంతనః + చ=ఆశ్రీరాముని కాలమునకు సంబంధించిన వాఁడను, సంవృత్తః+అస్మి = ఐతిని. ( సమంతాత్ =నలువంకలను, అవలోక్య=చూచి ) భోః + భోః=ఓపురుషులారా ! యదా+ తావత్ =ఎపుడైతే, పౌలస్త్య = రావణాసురునియొక్క + కుల = వంశమునకు, ధూమకేతోః=తోకచుక్కయై ప్రవర్తించినట్టియు, తత్రభవతః = పూజ్యుఁడైనట్టియు, మహారాజస్య=మహారాజైనట్టి, రామస్య=రామచంద్రమూర్తికి, అయం = ఇది, అభిషేక+సమయః=అభిషేకసమయమై, రాత్రిందివం= రేయింబవళ్ళు, అసంహృత=అవిచ్ఛిన్నమైన+నాందీకః = ఉత్సవతూర్యఘోషముకలదగుచు, ( వర్తతే=ప్రవర్తించుచున్నదో ) తత్ = అపుడు, కిం+ఇతి=ఎందువలన, చత్వర—స్థానాని = ముంగిళ్ళు, విశ్రాంత = శాంతిఁ జెందిన+చారణాని=నటులుగలవిగా, లక్ష్యంతే=కనఁబడుచున్నవి ?

( ప్రవిశ్య ) నటః:— భావ ! ప్రేషితా హి స్వగృహాన్ మహారాజేన లంకాసమరసుహృదః మహాత్మానః ప్లవంగ రాక్షసాః, సభాజనోపస్థాయినశ్చ నానాదిగంతపావనా బ్రహ్మర్షయో రాజర్షయశ్చ యదారాధనాయ ఇయతో దివసాన్ ఉత్సవ ఆసీత్.

( ప్రవిశ్య = ప్రవేశించి ) నటుఁడు:— భావ = విద్వాంసుఁడా ! లంకా=లంకాపట్టణమందు, ( జరిగిన ) సమర=యుద్ధమందు+సుహృదః= ఉపకారకులైనట్టియు, మహాత్మానః = మహాత్ములైనట్టియు, ప్లవంగ = ( సుగ్రీవాది ) వానరులును + రాక్షసాః = ( విభీషణాది ) రాక్షసులును, తథా=అట్లే, సభాజన = ( అభిషేకకర్మయందు ) అభినందించుటకై + ఉపస్థాయినః + చ = వచ్చినట్టియు, నానా=సమస్తమైన + దిక్=దిక్కుల యొక్క + అంత=కొనలను + పావనాః=పవిత్రముచేయునట్టియు, బ్రహ్మ—ఋషయః = బ్రహ్మఋషులును, రాజ—ఋషయః + చ = రాజర్షులును, మహత్—రాజేన=మహారాజగు రామునిచే, స్వ=తమయొక్క + గృహాన్= ఇండ్లనుగూర్చి, ప్రేషితాః + హి = పంపఁబడినారు గదా. యత్ =ఏపైఁ జెప్పఁబడినవారియొక్క + ఆరాధనాయ=సత్కారముకొఱకు, ఇయతః + దివసాన్ =ఇన్ని + రోజులను, ( వ్యాప్య=వ్యాపించి ) ఉత్సవః = ఉత్సవము, ఆసీత్ =ఆయెనో.

సూత్రధారః:— ఆ, అస్త్యేతస్మిన్నిమిత్తం.

సూత్రధారుఁడు:— ఆ = ఆ, (జ్ఞాపకమువచ్చినది,) ఏతత్ = దీనికి + నిమిత్తం=కారణము, అస్తి=కలదు.

నటః:— సంప్రతి హి.

శ్లో॥ వశిష్ఠాధిష్ఠితా దేవ్యో గతా రామస్య మాతరః
అరుంధతీం పురస్కృత్య యజ్ఞే జామాతు రాశ్రమం॥ 3

నటుఁడు:— సంప్రతి + హి = ఇదిగో యిప్పుడు.

అర్థః:— రామస్య=రామునియొక్క, మాతరః = తల్లులైన, దేవ్యః= కౌసల్యాది దశరథపత్నులు, వశిష్ఠ = (కులగురువగు) వశిష్ఠునిచే + అధిష్ఠితాః=తీసికొనిపోఁబడినవారై, అరుంధతీం = (గురుపత్నియగు) అరుంధతీదేవిని, పురస్కృత్య=ముందుంచుకొని, యజ్ఞే=యాగసందర్భమున, జామాతుః=అల్లుఁడగు ఋష్యశృంగునియొక్క, ఆశ్రమం = ఆశ్రమమునుగూర్చి గతాః=వెళ్ళిరి.

తా॥ వశిష్ఠ యాజమాన్యంబున నరుంధతీదేవిని బురస్కరించుకొని, రామచంద్రుని తల్లులు, తమయల్లుఁడగు ఋష్యశృంగుఁడు యజ్ఞమొనర్పఁదలపెట్టియుంటచే నాతని యాశ్రమంబునకుఁ జనిరి.

సూ:-వైదేశికోఽస్మీతి పృచ్ఛామి; కః పునః స జామాతా.

సూ:— వైదేశికః + అస్మి + ఇతి = పరదేశమువాఁడను, ఐయున్నాను గనుక, పృచ్ఛామి = అడుగుచున్నాను, కః + పునః + సః + జామాతా=అల్లుఁడనుచున్నావే, ఆయన యెవరు ?

న:-శ్లో॥ కన్యాం దశరథో రాజా శాంతాం నామ వ్యజీజనత్
అపత్యకృతికాం రాజ్ఞే లోమపాదాయ యాం దదౌ॥ ४

న:— అర్థ:—రాజా=ప్రభువగు, దశరథః=దశరథుఁడు, శాంతాం + నామ=శాంతయను, కన్యాం=కన్యను, వ్యజీజనత్=కనెను; యాం=ఆశాంతను, లోమపాదాయ= రోమపాదుఁడను, రాజ్ఞే=రాజునకొఱకు, అపత్యకృతికాం=పెంపుడుకూతురుగా, దదౌ=ఇచ్చెను.

తా॥ దశరథమహారాజు శాంత యనునొక చిన్నదానిని గని, యామెను బెంచుకొనుటకు రోమపాదమహారాజున కొసంగెను.

న:— విభండకసుత స్తాం మృష్యశృంగ ఉపయేమే. తేన ద్వాదశ వార్షికం సత్ర మారబ్ధం. తదనురోధాత్కఠోరగర్భా మపి జానకీం విముచ్య గురుజన స్తత్ర యాతః.

న:— తాం = ఆశాంతాదేవిని, విభండక = విభండకునియొక్క + సుతః=కుమారుఁడగు ఋష్యశృంగుఁడు, ఉపయేమే = వివాహమాడెను. తేన + చ=ఆఋష్యశృంగునిచేత, ద్వాదశ—వార్షికం=పండ్రెండు-సంవత్సరములకుఁబూర్తియయ్యెడి, సత్రం = యాగము, ఆరబ్ధం = ప్రారంభింపఁబడినది; తత్ = ఆఋష్యశృంగునియొక్క, అనురోధాత్ = బలవంతము వలన, కఠోర—గర్భాం+అపి = నిండుచూలాలైనను, వధూం = కోడలగు జానకిని, విముచ్య=విడిచి, గురు-జనః=గురుజనము ( ముప్పురత్తలు ) తత్ర= అచ్చటికి, గతః=చనినది.

సూ:— తత్కిమనేన. ఏహి. రాజద్వారమేవ స్వజాతిసమయే నోపతిష్ఠావః.

సూ:— అనేన= దీనిచే ( ఈయుత్సవ మాగిపోవుటకుఁగల కారణ చింతచే ) కిం=ఏమిప్రయోజనము; స్వ=స్వీయమైన+ జాతి=జాతియొక్క + సమయేన = ఆచారముచేతనే ( మనచారణజాతి ధర్మముచేతనే ) రాజ—ద్వారం + ఏవ=రాజద్వారమునే, ఉపతిష్ఠావః=సేవింతము; తత్ =కాన, ఏహి=రమ్ము.

న:— తేన హి నిరూపయతు రాజ్ఞః సుపరిశుద్ధా ముపస్థానస్తోత్రపద్ధతిం భావః.

న:— తేన+హి=అటులైనచో, భావః=పూజ్యుఁడవగు నీవు, రాజ్ఞః= రాజుగారియొక్క, సుపరిశుద్ధాం=మిక్కిలిపరిశుభ్రమగు, ఉపస్థాన=సేవయొక్క + స్తోత్ర=స్తుతియొక్క + పద్ధతిం=విధానమును, నిరూపయతు= నిరూపింపుమా.

సూ:— మారిష !

శ్లో॥ సర్వథా వ్యవహర్తవ్యం కుతో హ్యావచనీయతా
యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః॥౫॥

సూ:— మారిష = మారిషా !

అర్థః— సర్వథా=అన్నివిధములచేతను, వ్యవహర్తవ్యం=వ్యవహరింపఁ జెల్లియున్నది; అవచనీయతా=నింద, కుతః=ఎందులకు ? హి=అదియుక్త మేగదా, జనః = జనము, యథా=యెట్లు, స్త్రీణాం = స్త్రీలయొక్క, సాధుత్వే=యోగ్యతయందు, దుర్జనః=దుర్జనముగ (వర్తతే=ప్రవర్తించు చున్నదో) తథా=అలాగుననే, వాచాం=వాక్కులయొక్క, సాధుత్వే= మంచియందును, దుర్జనః=దుర్జనమై (వర్తించుచున్నది.)

తా॥ ఓ మారిషా ! ఇచ్చట మన ముఖ్యకర్తవ్యమెద్దియన రాజవంశం బును స్తోత్రమొనర్చుటయే గాని యందలిదోషంబుల నుగ్గడించుటకాదు. అందలి దోషంబులఁగూర్చి మనకేల; ఇంతకును స్త్రీలఁగూర్చియు, వాక్సా ధుత్వమును గూర్చియు జనులు ప్రసంగించువేళ సాధారణముగ దోషముల నారోపించుటకే చూచుచుందురుగాని, గుణంబుల నెన్నఁజూడరు గదా.

న:— అతిదుర్జన ఇతి వక్తవ్యం.

శ్లో॥ దేవ్యామపి హి వైదేహ్యాం సాపవాదో యతో జనః
రక్షోగృహస్థితి ర్మూల మగ్నిశుద్ధౌ త్వనిశ్చయః ॥ ౬

న:— అతి=మిక్కిలి+దుర్జనః=చెడ్డది, ఇతి = అని, వక్తవ్యం = చెప్పవలెను.

అర్థ:—యతః=ఏలయన, జనః = జనము, దేవ్యాం = దేవియగు, వైదేహ్యాం+అపి=విదేహరాజపుత్రి (సీత) యందుఁగూడ, సాపవాదః + హి = అపవాదతోఁగూడియున్నది గదా; మూలం=(దీనికి) ప్రధాన కారణము, రక్షః—గృహ = రాక్షస—గృహమునందు+స్థితిః = ఉనికియే; అగ్ని = అగ్నిహోత్రమునందు + శుద్ధౌ + తు = శుద్ధియందైతే, అని శ్చయః=నిశ్చయములేనిది.

తా॥ భూసుతయందుననే జనము నిందమోపుచుండఁ దక్కినవారి విషయమున లోటులెన్నుననన్న, నిం దాశ్చర్యమేమున్నది ? ఇంతకు జను

లాసీతాదేవి రక్షోగృహావాసంబున నపవిత్రమైనదని తప్పులెన్న సంకల్పించు చున్నవారు గాని, అతల్లి అగ్నిశుద్ధమైన సంగతినిగూర్చి యెందొక్కడైనను బ్రశంసించుచున్నవాఁడేమో చూడుము.

సూ:—యది పున రియం కింవదంతీ మహారాజం స్పృశేత్ తతః కష్టం స్యాత్.

సూ:—పునః=అదిగాక, ఇయం=ఈ, కింవదంతీ = లోకాపవాద, మహారాజం = మహారాజగు రాముని, స్పృశేత్ + యది = తాకినట్లైన (చెవిసోకిన) తతః=అపత్తున, కష్టం=కష్టము, స్యాత్=అగును.

న:— సర్వథా ఋషయో దేవతాశ్చ శ్రేయో విధాస్యన్తి. (పరిక్రమ్య) భో భోః క్వేదానీం మహారాజః ? (ఆకర్ణ్య) ఏవం జనాః కథయంతి

న:— సర్వథా=అన్నివిధముల, ఋషయః=ఋషులును, దేవతాః + చ=దేవతలును, శ్రేయః=శ్రేయస్సును, విధాస్యన్తి=కూర్పఁగలరు. (పరి క్రమ్య=ఇటునటు నడచి) భోః + భోః = ఓహోహో, మహారాజః = మహారాజు, ఇదానీం=ఇపుడు, క్వ=ఎక్కడ? (ఆకర్ణ్య=విని,వినుటనటించి.) ఏవం=ఇట్లు, జనాః=జనులు, కథయంతి=చెప్పుచున్నారు.

శ్లో॥ స్నేహా త్సభాజయితు మేత్య దినా న్యమూని
నీత్వోత్సవేన జనకోఽద్య గతో విదేహాన్
దేవ్యా స్తతో విమనసః పరిసాంత్వనాయ
ధర్మాసనా ద్విశతి వాసగృహం నరేంద్రః ॥ ౭

అర్థః—స్నేహాత్=ప్రేమవలన, సభాజయితుం=మన్ననచేయుటకు, ఏత్య=వచ్చి, అమూని=ఇన్ని, దినాని=రోజులు, ఉత్సవేన=ఆనందముతో, నీత్వా=గడపి, అద్య=నేఁడు, జనకః=(జానకితండ్రియగు) జనకమహారాజు, విదేహాన్=విదేహదేశములగూర్చి, గతః=వెళ్లెను; నరేంద్రః =

జనాధిపుఁడగు రాముఁడు, తతః=ఆకారణమువలన, విమనసః=చిత్తవైకల్యము నెందిన, దేవ్యాః=సీతాదేవియొక్క, పరిసాంత్వనాయ=ఓదార్చుటకొఱకు, ధర్మ—ఆసనాత్=రాజపీఠమునుండి, వాస = నివసించెడి + గృహం=ఇంటిని గూర్చి, విశతి=ప్రవేశించుచున్నాఁడు.

తా॥ జనకమహారాజు తనకుమార్తెయందుఁ గల మక్కువచే, నిన్ని దినములు నయోధ్యాపట్టణంబున నే బహువినోదంబులఁ గాలము గడపి, నేఁడే విదేహదేశంబునకరిగినాఁడు. తండ్రిగారు తనను విడిచి స్వదేశంబున కరుగుట వలనఁ జిత్తవైకల్యమున నొప్పుచున్న సీతాదేవి నోదార్చుటకై శ్రీరామచంద్రుఁడు సింహాసనము విడిచి నివాసగృహంబున కరిగె.

( నిష్క్రాంతౌ )

( నిష్క్రాంతౌ = ఇరువురు నిష్క్రమించిరి. )

ఇతి ప్రస్తావనా.

ఇతి=ఈ పైఁజెప్పఁబడినది, ప్రస్తావనా=ప్రస్తావన.



# ప్రథమో౽ంకః

( తతః ప్రవిశ త్యుపవిష్టో రామః సీతా చ. )

( తతః=తరువాత, ఉపవిష్టః=కూరుచున్న, రామః = రాముఁడు, ప్రవిశతి=ప్రవేశించుచున్నాఁడు, సీతా+చ=సీతాదేవియు, ( ప్రవిశతి= ప్రవేశించుచున్నది. )

రామః:— దేవి వైదేహి ! సమాశ్వసిహి. తే హి గురవో న శక్నువంతి విమోక్తు మస్మాన్.

శ్లో॥ కిం త్వనుష్ఠాననిత్యత్వం స్వాతంత్ర్య మపకర్షతి ।
సంకటా హ్యాహితాగ్నీనాం ప్రత్యవాయై ర్గృహస్థతా॥ ౮

రాముఁడు:— దేవి=దేవీ ! వైదేహి = విదేహరాజకుమారీ ! సమాశ్వసిహి=ఊరడిల్లుము. తే=ఆ ( అట్టిస్నేహముతోఁ గూడుకొన్న ) గురవః = గురువులు ( తండ్రి మొదలగువారు ) అస్మాన్=మనలను, విమోక్తుం=విడుచుటకు, న+శక్నువంతి+హి=శక్తులుగాకుందు రనుమాట నిశ్చయమే.

అర్థః:— కింతు=కాని, అనుష్ఠాన=కర్తవ్యవిధులయొక్క + నిత్యత్వం=ఉల్లంఘింపఁదగకుండుట, స్వాతంత్ర్యం=స్వాతంత్ర్యమును, అపకర్షతి=లాగివేయును; ( కుతః = ఎందుచేనన ) ప్రత్యవాయైః = అడ్డుపాట్లచే ( విధివిహితానుష్ఠానవిఘాతజన్యములగు పాతకములచే ) ఆహితాగ్నీనాం = ఆహితాగ్నులయొక్క, గృహస్థతా = గృహస్థధర్మము, సంకటా+హి = ఆపత్తును గూర్చునదియేగదా.

తా॥ నీతండ్రిగారికి మనపై నెంతప్రేమానుబంధ మున్నను నిత్యనైమిత్తికకర్మకలాపానుష్ఠానము వారు యథేచ్ఛముగానుండుట కవకాశము నొసం

గదుగదా; ఇఁక విహితకర్మాచరణలోప మయ్యెనా పాపము సంభవించును గాన నాహితాగ్నులగృహస్థధర్మము మిక్కిలి సంకటమైనదిసుమా!

‡ సీ:— జానామి ఆర్యపుత్ర! జానామి; కింతు సంతాప కారిణో బంధుజనవిప్రయోగా భవన్తి.

సీ:— ఆర్యపుత్ర=స్వామీ; జానామి=ఎఱుఁగుదును, జానామి= ఎఱుఁగుదును; కింతు = కాని, బంధు—జన = బంధు—జనులతోడి+విప్ర యోగాః=ఎడబాట్లు, సంతాప = దుఃఖమును+కారిణః = కల్గించునవి, భవన్తి=అగుచున్నవి.

రామః:— ఏవ మేతత్; ఏతే హి హృదయమర్మచ్ఛిదః సంసారభావాః యేభ్యో బీభత్సమానాః సంత్యజ్య సర్వాన్ కామా నరణ్యే విశ్రామ్యన్తి మనీషిణః.

రా:— ఏతత్ = ఇది (బంధుజన వియోగాదికము) ఏవం = ఇట్లే (సంతాప జనకమేయగు) హృదయ=హృదయమునందలి+మర్మ=మర్మ స్థానములను+ఛిదః=భేదించెడి, సంసార=సంసారసంబంధమగు+భావాః= ధర్మములు, ఏతే+హి = ఇవియే గదా; యేభ్యః = వేనినుండి, బీభత్స మానాః=వెఱగుపడుచున్నవారై, మనీషిణః=బుద్ధిమంతులు, సర్వాన్= సమస్తమైన, కామాన్=కోర్కెలను, పరిత్యజ్య=విడిచి, అరణ్యే = అడవి యందు, విశ్రామ్యన్తి=శ్రమదీర్చికొనుచున్నారో.

(ప్రవిశ్య=ప్రవేశించి)

కంచుకీ:—రామభద్ర!—(ఇత్యర్థోక్తే సాశంకం) మహారాజ!

కంచుకి:— రామభద్ర=రామభద్రుఁడా (ఇతి=అని, అర్ధ—ఉక్తే= సగముచెప్పఁబడఁగానే) మహారాజ=మహారాజా.

---

‡ జాణామి అజ్జ ఉత్త జాణామి. కిందు సందావఆరిణో బంధు జణవిప్పఓఆ హోన్తి.

రామః:– ( సస్మితం ) ఆర్య ! నను రామభద్ర ఇత్యేవ మాం ప్రతి ఉపచారః శోభతే తాతపరిజనస్య. తద్యథాభ్యస్త మభిధీయతాం.

రా:– ( సస్మితం = చిర్నగవుతోఁగూడునట్లు ) ఆర్య = బాబూ, నను=ఎంచిచూచిన, తాత = నాయనగారియొక్క+పరిజనస్య = సేవకాజనంబునకు, మాం+ప్రతి=నన్నుఁగూర్చి, రామ–భద్ర+ఇతి = 'రామభద్రా' యనియే, ఉపచారః = ఆమంత్రణమొనర్చుపదము, శోభతే = ప్రకాశించుచున్నది, తత్ = అందువలన, యథా–అభ్యస్తం = అలవాటుపడియున్న పద్ధతినే, అభిధీయతాం=పిలువఁబడుఁ గాక.

కం:– దేవ ! ఋష్యశృంగాశ్రమా దష్టావక్ర స్సంప్రాప్తః.

కం:– దేవ = ప్రభూ ! ఋష్యశృంగ–ఆశ్రమాత్=ఋష్యశృంగుని యొక్క–ఆశ్రమమునుండి, అష్టావక్రః=అష్టావక్రుఁడు, సంప్రాప్తః = దయచేసినాఁడు.

† సీ:– ఆర్య ! తతః కిం విలంబ్యతే.

సీ:– ఆర్య=పూజ్యుఁడా, తతః=అట్లైన, కిం+విలంబ్యతే=ఆలస్యమెందులకుఁజేయఁబడుచున్నది, ( ప్రవేశపెట్టుట కాలస్యమేల ? )

రామః:– త్వరితం ప్రవేశయ.

• రా:– త్వరితం=త్వరగా, ప్రవేశయ=ప్రవేశపెట్టుము.

( కంచుకీ నిష్క్రాంతః. పునః ప్రవిశ్య. )

( కంచుకీ=కంచుకి, నిష్క్రాంతః=వెళ్ళెను. పునః=తిరిగి, ప్రవిశ్య=ప్రవేశించి. )

అష్టావక్రః:– స్వస్తి వాం.

అష్టా:– వాం=మీయిర్వరకొఱకు, స్వస్తి=సేమమగుఁ గాక.

---

† అజ్జ తదో కిం విలంబీఅది.

రామః:— భగవన్ ! అభివాదయే. ఇత ఆస్యతాం.

రా:— భగవన్=స్వామీ! అభివాదయే=నమస్కరించుచున్నాఁడ; ఇతః=ఈవైపున, ఆస్యతాం=కూర్చుండుదురుగాక.

* సీ:— భగవన్ ! నమస్తే. అపి కుశలం సజామాతృకస్య గురుజనస్య; ఆర్యాయా శ్శాంతాయాశ్చ.

సీ:—భగవన్=స్వామీ, తే=తమకొఱకు, నమః = నమస్కారము; సజామాతృకస్య = అల్లునితోసహా, గురు—జనస్య = గురుజనంబునకును, ఆర్యాయాః=పూజ్యురాలగు, శాంతాయాః+చ=శాంతాదేవికిని, అపి+కుశలం=క్షేమమేనా.

రామః:— నిర్విఘ్నః సోమపీథీ భావుకో మే భగవాన్ ఋష్యశృంగః ఆర్యా చ శాంతా.

రా:— మే=నాయొక్క, భావుకః = బావగారైనట్టియు, సోమ—పీథీ=సోమరసపానమొనర్చినట్టియు, (సోమయాజిగారైనట్టియు) భగవాన్=పూజ్యుఁడగు, ఋష్యశృంగః=ఋష్యశృంగుఁడు, నిర్విఘ్నః = (సతి యాగమున) ఆటంకములు లేకున్నాఁడా? ఆర్యా=ఆర్యురాలగు, శాంతా+చ=శాంతాదేవియు, (నిర్విఘ్నా?)

♦ సీ:— అస్మానపి స్మరతి ?

సీ:— అస్మాన్=మమ్ములను, అపి+స్మరతి=తలఁచునా ?

అష్టావక్రః:— ( ఉపవిశ్య ) అథ కిం, దేవి భగవాన్ వశిష్ఠస్త్వా మాహ.

శ్లో॥ విశ్వంభరా భగవతీ భవతీ మసూత
రాజా ప్రజాపతిసమో జనకః పితా తే

---

* భఅవం ణమో దే అవి కుసలం సజామాతుఅస్స గురుఅణస్స అజ్జాఏ సన్తాఏఅ. ♦ అంహే వి సుమరేది.

తేషాం వధూ స్త్వ మసి నందిని ! పార్థివానాం
యేషాం కులేషు సవితా చ గురు ర్వయం చ ॥

తత్ కి మన్య దాశాస్మహే కేవలం వీరప్రసవా భూయాః.

అ:— ( ఉపవిశ్య = కూర్చుండి ) అథ + కిం = అవును; దేవి=దేవీ! భగవాన్=పూజ్యుఁడగు, వశిష్ఠః=వశిష్ఠమహర్షి, త్వాం=నిన్నుఁగూర్చి, ఆహ=పల్కెను.

అర్థ:— నందిని=బిడ్డా ! భగవతీ = పూజ్యురాలగు, విశ్వంభరా=భూదేవి, భవతీం=నిన్ను, అసూత=కనినది; ప్రజాపతి=బ్రహ్మదేవునితో+సమః=సమానుఁడగు, జనకః+రాజా=జనక+చక్రవర్తి, తే=నీకు, పితా=తండ్రి; యేషాం=ఏ, పార్థివానాం = ( సూర్యవంశమునఁబుట్టిన ) రాజుల యొక్క, కులేషు=వంశములయందు, సవితా=సూర్యుఁడు, గురుః=గురువో, వయం+చ=మేమును—(గురవః=గురువులమో,) తేషాం = వారియొక్క, వధూః=కోడలివి, త్వం=నీవు, అసి=అగుచున్నావు.

తా॥ బిడ్డా ! నిన్నుఁగడుపారఁగనిన తల్లియన్నవో, షాడ్గుణ్యపరిపూర్ణయగు విశ్వంభరాదేవి; నీతండ్రిగారన్నవో, స్వాధ్యాయమాహాత్మ్యములచే బ్రహ్మదేవునితోఁ దులతూఁగునట్టి జనకచక్రవర్తి; నీవు మెట్టినశ్వశురగృహ సంపత్తియన్నవో, సూర్యభగవానులును మేమును గురువులుగాఁ గల్గి విరాజిల్లుచున్నది. ( పితృమాతృశ్వశురకులమాహాత్మ్యముచే విరాజిల్లునీకితరము పునరుక్తభూతము. )

తత్=అందువలన, అన్యత్=వేఱు, కిం+ఆశాస్మహే=ఏమియాశీర్వదింతుము ? వీర=వీరుల+ప్రసవా+కేవలం=కనుదానవే, భూయాః=కావలసినది, ( ఇతి=అని, ఆశాస్మహే=ఆశీర్వదింతుము. )

రామః:—అనుగృహీతాః స్మః.

శ్లో॥ లౌకికానాం హి సాధూనా మర్థం వా గనువర్తతే
ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి॥ ౧౦

రా:— అనుగృహీతాః = అనుగ్రహింపఁబడినవారము, స్మః = అగుచున్నాము.

అ:— లౌకికానాం=లోకవిదితులైన, సాధూనాం = సత్పురుషుల యొక్క, (ప్రాకృతులగు మనుజులయొక్క) వాక్ + హి=వాక్యమైతే, అర్థం=వస్తువును, అనువర్తతే=వెంబడించును, పునః=వెండియు, (పక్షాంతరమున) ఆద్యానాం=మొదటివారగు (పురాతనులగు) ఋషీణాం = (వశిష్ఠాది) ఋషులయొక్క, వాచం=మాటను, అర్థః=వస్తువు, అనుధావతి=అనుసరించును.

తా॥ లోకమందలి పెద్దలు, కార్యసిద్ధినిగూర్చి మున్ముందుగ గమనించి దానుసారమగు భాషణం బొనర్చెదరు, గాని, సనాతనులగు ఋషీశ్వరులన్నో యట్లుగాక యదృచ్ఛగా నెట్టి భాషితములాడినను వానిని గార్యసిద్ధియే యనువర్తించుచుండును.

అష్టావక్రః—ఇదం చ భగవత్యారుంధత్యా దేవీభిః శాంతయా చ భూయో భూయః సందిష్టం. యఃకశ్చి ద్గర్భదోహదో భవ త్యస్యాఃసోఽవశ్య మచిరా న్మానయితవ్య ఇతి.

అ:— ఇదం + చ =(క్రిందఁజెప్పఁబడఁబోవు) ఈసంగతియు, భగవత్యా=పూజ్యురాలగు, అరుంధత్యా=అరుంధతీదేవిచేతను, దేవీభిః=(కౌసల్యాది) రాణులచేతను, శాంతయా + చ = శాంతాదేవిచేతను, భూయః + భూయః = తిరిగి తిరిగి, సందిష్టం = బాగుగ నుడువఁబడినది; యదా=ఎప్పుడైతే, యః + కః + చిత్=ఏదైననొక, గర్భ-దోహ్యద + ఉదయః=గర్భహేతుకవాంఛయొక్కయుత్పత్తి, అస్యాః=ఈసీతాదేవికి, భవతి=కలుగుచో, సః=ఆవాంఛోదయము, అవశ్యం=తప్పక, అచిరాత్=క్షణమే, మానయితవ్యః=ఆమోదింపఁబడఁదగినది; ఇతి=అని.

రామః:— క్రియతే య ద్యేషా కథయతి.

రా:— ఏషా = ఈమె, కథయతి + యది = (మనోవాంఛ) చెప్పు నెడల, క్రియతే=పొనరింపఁబడును.

అష్టావక్రః:— ననాంధుః పత్యా చ దేవ్యాః సందిష్ట మృష్యశృంగేణ. 'వత్సే! కఠోరగర్భేతి నానీతాసి. వత్సోఽపి రామభద్ర స్త్వద్వినోదార్థమేవ స్థాపితః. తత్ పుత్రపూర్ణో త్సంగా మాయుష్మతీం ద్రక్ష్యామః' ఇతి.

అ:— ననాంధుః = వదినెగారియొక్క, పత్యా = పెనిమిటియగు, ఋష్యశృంగేణ + చ=ఋష్యశృంగునిచేతను, వత్సే=బిడ్డా! కఠోరగర్భా + ఇతి=నిండుచూలాలవని, న + ఆనీతా + అసి=తీసికొనిరాఁబడలేదు. వత్సః= కుఱ్ఱవాఁడగు, రామః + అపి=రాముఁడుగూడ, త్వత్ = నీయొక్క + వినో దార్థం + ఏవ=వినోదముకొఱకే, స్థాపితః = (అయోధ్యయందే) ఉంచఁ బడినాఁడు. తత్=అందువలన, పుత్ర = కుమారునిచే + పూర్ణ=ఆక్రమింపఁ బడిన + ఉత్సంగాం = ఒడిగల, ఆయుష్మతీం = దీర్ఘాయుష్మంతురాలవగు నిన్ను, ద్రక్ష్యామః=చూడఁగలము, ఇతి=అని.

రామః:— (సహర్ష స్మితం) తథాస్తు. భగవతా వశిష్ఠేన న కించి దాదిష్టోఽస్మి?

రా:— (సహర్ష—స్మితం=ఆనందమువలనఁ గల్గిన—చిఱునగవుగల్గి నట్లుగా) తథా = అట్లు, అస్తు = అగుఁగాక. భగవతా = పూజ్యుఁడైన, వశిష్ఠేన = వశిష్ఠమహర్షిచే, న + కించిత్ + ఆదిష్టః + అస్మి = ఏమియును ఆజ్ఞాపింపఁబడినవాఁడఁగానా?

అష్టావక్రః:— శ్రూయతాం.

శ్లో॥ జామాతృయజ్ఞేన వయం నిరుద్ధా
స్త్వం బాల ఏవాసి నవం చ రాజ్యం

యుక్తః ప్రజానా మనురంజనే స్యా
స్తస్మా ద్యశో య త్పరమం ధనం వః ౧౧

అః— శ్రూయతాం=వినఁబడుఁగాక. (వినవలసినది)

అర్థ:— వయం=మేము, (వశిష్ఠుఁడు) జామాతృ = అల్లునియొక్క, (ఋష్యశృంగునియొక్క) + యజ్ఞేన=యాగముచే, నిరుద్ధాః = ఆపఁబడితిమి; త్వం=నీవు, బాలః + ఏవ=అర్భకుఁడ వేనై, అసి=ఉన్నావు, రాజ్యం+చ=రాజ్యమున్ను, నవం=క్రొత్తది; ప్రజానాం=ప్రజలయొక్క, అనురంజనే=ఆనందింపఁజేయుటయందు, యుక్తః=నిరతుఁడవు, స్యాః=కావలసినది; తస్మాత్=దానివలన (ప్రజారంజనవలన) యశః=కీర్తి, భవతి=కలుగును; యత్ = ఏకీర్తి, వః = మీకు (ఇక్ష్వాకువంశస్థులకు) పరమం = శ్రేష్ఠమైన, ధనం=ధనమో.

తా॥ నాయనా! రామా! అల్లుని (ఋష్యశృంగుని) యజ్ఞపరిసమాప్తి కానందున మేమిటు నింకను నిలచియుండక తప్పినదికాదు; నీవా, పసివాఁడవు; రాజ్యాధికారమా, క్రొత్తది; కాన మిగుల జాగరూకత గలిగి సర్వస్వమునకంటెను యశోధనమే మీవంశమునకు ముఖ్యధనంబుగా గ్రహించి సర్వదా ప్రజానురంజనపరుఁడవై యుండవలసినది.

రామః:—యథా సమాదిశతి భగవాన్ మైత్రావరుణిః.

శ్లో॥ స్నేహం దయాం చ సౌఖ్యం చ యది వా జానకీమపి
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా ॥

రా:— భగవాన్ = పూజ్యుఁడగు, మైత్రావరుణిః = వశిష్ఠుఁడు, (మిత్రావరుణుల అపత్యము) యథా + సమాదిశతి=ఆజ్ఞాపించి నటులే (చేసెద.)

అర్థ:— లోకస్య = లోకముయొక్క, ఆరాధనాయ = సేవకొఱకు, స్నేహం=స్నేహమునుగాని, దయాం + చ=దయనుగాని, యది + వా=అంతి

యేకాక వలయునేని, జానకీం + అపి=సీతనైనఁగాని, ముంచతః=విడిచెడి, మే=నాకు, వ్యథా=బాధ, న + అస్తి=కానరాదు.

తా॥ లోకారాధనానుష్ఠానమునకు నే నెన్నడు వెనుదీయువాఁడఁగాను. దానికొఱకై సర్వస్వము వినియోగించెద; దయనుగాని, సౌఖ్యమునుగాని, వేయేల, తుదకు నా జీవితేశ్వరి యగు సీతను గాని వదలివేసెద.

‡ సీ:— అత ఏవ రాఘవధురంధర ఆర్యపుత్రః.

సీ:— అతః + ఏవ = దానఁజేసియే, ఆర్యపుత్రః=ఆర్యపుత్రుఁడగు రాముఁడు, రాఘవ=రఘువంశజులలో + ధురంధరః=శ్రేష్ఠుఁడు.

రామః:— కః కోఽత్ర భోః ? విశ్రామ్యతాం భగవానష్టావక్రః.

రా:— కః + కః + అత్ర + భోః=ఎవఁడురా అచ్చట ? భగవాన్=పూజ్యుఁడగు, అష్టావక్రః=అష్టావక్రుఁడు, విశ్రామ్యతాం = విశ్రమింపఁజేయఁబడుఁ గాక.

అష్టావక్రః:— ( ఉత్థాయ పరిక్రమ్య చ ) అయే; కుమారలక్ష్మణః ప్రాప్తః ( ఇతి నిష్క్రాన్తః. )

అ:— ( ఉత్థాయ = లేచి, పరిక్రమ్య + చ = ఇటునటు దిరిగి ) అయే = ఓయీ, కుమార—లక్ష్మణః = లక్ష్మణకుమారుఁడు, ప్రాప్తః=వచ్చియున్నవాఁడే. ( ఇతి=అని, నిష్క్రాన్తః=వెడలె. )

( ప్రవిశ్య ) లక్ష్మణః:—జయతి జయత్వార్యః. అర్జునేన చిత్రకరే ణాస్మదుపదిష్ట మార్యస్య చరిత మస్యాం వీథ్యామాలిఖితం; తత్పశ్య త్వార్యః.

‡ అదో జేవ్వ రాహవధురంధరో అజ్జఉత్తో.

( ప్రవిశ్య=ప్రవేశించి ) లక్ష్మణుఁడు:— ఆర్యః=స్వామి, జయతి + జయతి=జయశీలుఁడగుచున్నాఁడు, జయశీలుఁడగుచున్నాఁడు; అర్జునేన= అర్జునుఁడను, చిత్ర—కరేణ=బొమ్మలువేయువానిచే, అస్మత్ = మనచే+ ఉద్దిష్టం=ఉద్దేశింపఁబడినరీతి, ఆర్య = ఆర్యపుత్రునియొక్క + చరితం = చరిత్ర, అస్యాం=ఈ, వీథ్యాం=పలకయందు, ఆలిఖితం=చిత్రింపఁబడినది; తత్=దానిని, ఆర్యః=ఆర్యపుత్రుఁడు, పశ్యతు=దర్శించుఁగాక.

రామః:— జానాసి వత్స ! దుర్మనాయమానాం దేవీం వినోదయితుం. తత్కియా నవధిః ?

రా:— వత్స = నాయనా ! దుర్మనాయమానాం = వికలహృదయు రాలైన, దేవీం=సీతాదేవిని ( మీవదినెను ) వినోదయితుం = వినోదపఱచు టకు, జానాసి=ఎఱుఁగుదువు. తత్ = ఆపలకపైవ్రాయఁబడిన విషయము యొక్క, అవధిః=హద్దు, కియాన్=ఎంతవఱకు ?

లక్ష్మణః:— యావ దార్యాయాః హుతాశనే విశుద్ధిః.

లక్ష్మ:— ఆర్యాయాః = పూజ్యురాలగు సీతాదేవికి, హుతాశనే= అగ్నిహోత్రమునందు, శుద్ధిః + యావత్=శుద్ధియగుటవఱకు. (అవధిః=హద్దు.)

రామః:— శాన్తం పాపం. ( ససాన్త్వవచనం )

రా:— శాన్తం + పాపం=పాపముశాంతించుఁగాక. ( ససాంత్వ వచనం=అనునయమధురభాషణములతోఁ గూడునటుల. )

శ్లో॥ ఉత్పత్తిపరిపూతాయాః కి మస్యాః పావనాంతరైః
తీర్థోదకం చ వహ్నిశ్చ నాన్యతః శుద్ధి మర్హతః ॥

అర్థ:— ఉత్పత్తి = పుట్టుకచేతనే+ పరిపూతాయాః=పవిత్రురాలైన, అస్యాః = ఈసీతాదేవికి, పావనాంతరైః=ఇతరశోధనలచేత, కిం = ఏమి ప్రయోజనము ? తీర్థ+ఉదకం+చ = ( గంగాది ) పుణ్యోదకమున్ను,

వహ్నిః + చ=అగ్నిహోత్రిమున్ను, అన్యతః = మఱొకశోధనచే, శుద్ధిం= శుద్ధిని, న+అర్హతః = ( పొంద ) తగవు.

తా॥ స్మరణమాత్రిముచేతనే జనులఁ బునీతులఁజేయుగంగాది సరిజ్జలంబును, అగ్నిహోత్రింబును నితరవస్తువు లెట్లు శుద్ధిచేయఁజాలవో, అటులనే అయోనిజయై జన్మచేతనే పరమపవిత్రిరాలగు నీసీతాదేవిని గూడ నన్యసాధనములేవియుఁ బవిత్రిరాలుగాఁ జేయఁజాలవు.

దేవి ! దేవయజనసంభవే ! ప్రసీద. ఏష తే జీవితావధిః ప్రవాదః.

దేవి = ఓదేవీ ! దేవ=దేవతలయొక్క+యజన=యజ్ఞభూమియే+సంభవే=ఉత్పత్తిస్థానముగాఁగలదానా, ప్రసీద = ప్రసన్నురాలవుగమ్మ. ఏషః = ఇది, తే = నీకు, జీవిత–అవధిః=జీవితమే హద్దుగాఁగల ( బ్రతికియున్నంతకాలము ) ప్రవాదః=నింద.

శ్లో॥ క్లిష్టో జనః కిల జనై రనురంజనీయ
స్తన్నో య దుక్త మశుభం న హి త త్క్షమం తే
నైసర్గికీ సురభిణః కుసుమస్య సిద్ధా
మూర్ధ్నిస్థితి ర్న చరణై రవతాడనాని ॥ ౧౪

అర్థః— యత్=ఏకారణమువలన, క్లిష్టః=దుఃఖపెట్టఁబడిన, జనః= జనము, జనైః = (స్వ) జనులచే, అనురంజనీయః=లాలింపఁదగినదో, తత్= ఆకారణమువలన, అశుభం=అశుభము, తే=నీవిషయమున, నః = మావలన, యత్=ఏది, ఉక్తం=చెప్పఁబడినదో, తత్=అది, న+క్షమం=క్షమింపఁదగినదికాదు. హి = అదియుక్తమేకదా, సురభిణః = సువాసనగల, కుసుమస్య=పువ్వుమునకు, మూర్ధ్ని=శిరస్సునందు, స్థితిః = ఉనికి, నైసర్గికీ+సిద్ధా=స్వభావసిద్ధమైనది; చరణైః = పాదములచే, అవతాడనాని+చ= త్రొక్కుటలైతే, న (+సిద్ధాని=ప్రసిద్ధములు ) గావు.

తా॥ దుఃఖితులగువారిని బంధుజనులు లాలించి, తద్దుఃఖోపశమనము గావించుట లోకాచారము; అట్టియెడ నిన్నుఁగూర్చిన యమంగళకరమగు నొక దుర్భావనమును మేమే స్మరింపఁజేసి మరల నీకు ఖేదముగల్గించుట సహింపఁదగినది కాదు; గుమగుమ పరిమళించు కుసుమరాజముల శిరస్సున కలంకారముగ ధరింపఁదగుఁగాని నేలఁబెట్టి కాలరాయఁ దగునా.

♦ సీతా:— భవ త్వార్యపుత్ర భవతు. ఏహి ప్రేక్షామహే తావ త్తే చరితం. [ ఇత్యుత్థాయ పరిక్రామతి ]

సీత:— ఆర్యపుత్ర=స్వామీ, భవతు + భవతు=కానిమ్ము కానిమ్ము (నాథా! అటులఁజింతింపకుఁడు. నే నన్యథా భావించుదానఁగాను. మీ హృదయము నేగుర్తెఱుంగుదు) ఏహి=రమ్ము, తే=తమయొక్క, చరితం=చరిత్రను, తావత్=ఇపుడు, ప్రేక్షామహే=చూతము.

(ఇతి=అని, ఉత్థాయ=లేచి, పరిక్రామతి=నడచుచున్నది)

లక్ష్మణః— ఇదం త దాలేఖ్యం.

ల:— తత్=ఆ, ఆలేఖ్యం=చిత్తరువు, ఇదం=ఇదిగో.

‡ సీతా:— (నిర్వర్ణ్య) క ఏతే? ఉపరినిరంతరస్థితా ఉపస్తువన్తీ వార్యపుత్రం.

సీత:— (నిర్వర్ణ్య=పరీక్షించిచూచి) ఏతే=వీరు, కే = ఎవ్వరు? ఉపరి=పైన, నిరంతర=సందులేక + స్థితాః=ఉన్నవారై, ఆర్యపుత్రం=ఆర్యపుత్రుని, ఉపస్తువన్తి + ఇవ=స్తోత్రము చేయుచున్నవారివలె నున్నారు.

ల:— దేవి! ఏతాని తాని సరహస్యాని జృంభకాస్త్రాణి; యాని భగవతః కృశాశ్వా త్కౌశిక ముపసంక్రాన్తాని. తేన

---

♦ హోదు అజ్జఉత్త హోదు. ఏహి పేక్ఖహ్మ దావ దే చరితం.

‡ కే ఏదే ఉవరిణిరంతరట్ఠిదా ఉవత్థువంది విఅ అజ్జఉత్తం.

చ తాటకావధే ప్రసాదీకృతా న్యార్యస్య.

లః— దేవి=ఓదేవీ ! సరహస్యాని=రహస్యముతోఁగూడినట్టి, తాని= ఆ ప్రసిద్ధములైన, జృంభక—అస్త్రాణి=జృంభకాస్త్రములు, ఏతాని=ఇవియే ; యాని=ఏవి (జృంభకాస్త్రములు) భగవతః=పూజ్యుఁడగు, భృశాశ్వాత్= భృశాశ్వునివలన, కౌశికం=కుశికనందనుని, ఉపసంక్రాన్తాని = సంక్రమించి నవో; తేన+చ = వానిచేతనున్ను, తాటకా = తాటకయొక్క + వధే = చంపుటయందు, ఆర్యస్య=పూజ్యుఁడగు మాయన్నగారికి, ప్రసాదీకృతాని= అనుగ్రహింపఁబడినవో

రామః:— వందస్వ దేవి ! దివ్యాస్త్రాణి.

శ్లో॥ బ్రహ్మాదయో బ్రహ్మహితాయ తప్త్వా
పరస్సహస్రాః శరద స్తపాంసి
ఏతా న్యపశ్యన్ గురవః పురాణాః
స్వాన్యేవ తేజాంసి తపోమయాని ॥ ౧౫

రా:— దేవి = ఓ దేవీ ! దివ్య—అస్త్రాణి = దివ్యాస్త్రములఁగూర్చి, వందస్వ=నమస్కరింపుము.

అర్థః— బ్రహ్మ = బ్రహ్మదేవుఁడు + ఆదయః = మొదలగు, పురాణాః=ఆద్యులగు, గురవః = ఆచార్యులు, బ్రహ్మ = వేదముయొక్క + హితాయ= క్షేమముకొఱకు ( వేదాపహారకులగు దుష్టరాక్షస నిగ్రహంబు కొఱకు ) పరఃసహస్రాః = వేలకొలఁది, శరదః = సంవత్సరముల పర్యంతమును, తపాంసి+తప్త్వా = తపములనొనర్చి, స్వాని=తమసంబంధమగు, తపోమయాని=తపోమూర్తులైన, తేజాంసి + ఏవ= తేజస్సులనే, ఏతాని= ఈ యస్త్రములుగా, అపశ్యన్ = చూచిరి.

తా॥ అనాది పరమగురువులగు బ్రహ్మప్రభృతులు, వేదాపహారకు [redacted] రాక్షసులఁ బరిమార్చి లోకహితంబొనర్ప బహుదివ్య సహస్రాబ్ద

ములు తపంబొనరించి మూర్తీభవించిన తమతపస్తేజంబులనదగు నీ దివ్యాస్త్రంబుల సందర్శించిరి.

† సీతా:- నమ ఏతేభ్యః.

సీత:- ఏతేభ్యః = ఈయస్త్రములకొఱకు, నమః=నమస్కారము.

రామః:- సర్వథేదానీం త్వత్ప్రసూతి ముపస్థాస్యన్తి.

రా:- ఇదానీం=ఇపుడు, సర్వథా = అన్నివిధములచేతను, త్వత్ = నీయొక్క, ప్రసూతిం=సంతతిని, ఉపస్థాస్యన్తి=సంక్రమింపఁగలవు.

* సీతా:- అనుగృహీతాస్మి.

సీత:- అనుగృహీతా + అస్మి=అనుగ్రహింపఁబడినదాననైతి.

లక్ష్మణః:- ఏష మిథిలావృత్తాంతః.

ల:- ఏషః = ఇది, మిథిలా-వృత్తాంతః = మిథిలాపట్టణమునకు సంబంధించిన, వృత్తాంతము.

‖ సీతా:- అహో! దళన్నవనీలోత్పలశ్యామలస్నిగ్ధమసృణశోభమానమాంసలేన దేహసౌభాగ్యేన విస్మయస్తిమితతాతదృశ్యమానసౌమ్యసుందరశ్రీః అనాదరఖండితశంకరశరాసనః శిఖండకముగ్ధముఖమండలః ఆర్యపుత్రః ఆలిఖితః.

సీత:- అహో=ఏమి ఆశ్చర్యము! దళత్ = వికసించుచున్న + నవ= నూతనమగు + నీల + ఉత్పల=నల్లకలువవలె + శ్యామల=నల్లనైనట్టియు +

† ణమో ఏదాణం.

* అణుగహీదమ్హి.

‖ అహ్మహే! దలంతణవణీలుప్పలసామలసిణిద్ధమసిణసోహమాణమంసలేన దేహసోహగ్గేణ విహ్మఅత్థిమిదతాదదీసన్తసోమ్మసున్దరసిరీఅణాదరఖుడిదసంకరసరాసణో సిహండఅముద్ధముహమండలో అజ్జఉత్తో ఆలిహిదో.

స్నిగ్ధ=కోమలమును+మసృణ=ఉజ్జ్వలము నగునట్లుగా+శోభమాన=ప్రకాశించుచు+మాంసలేన=బాగుగ బలసిన, దేహ = దేహముయొక్క+సౌభాగ్యేన=ప్రకర్షచే, శిఖండ=కాకపక్షములచే+ముగ్ధ=మనోహరమైన+ముఖ-మండలః=ముఖబింబముగల్గియు, అనాదర=అవలీలగా+త్రుటిత = విరుగఁగొట్టఁబడిన+శంకర-శర—ఆసనః=శివధనుస్సుగలవాఁడుగనుక నే, విస్మయ=ఆశ్చర్యముచే+స్తిమిత = నిశ్చలుఁడైన+తాత = నాయనగారిచే+దృశ్యమాన=చూడఁబడుచున్న+సౌమ్య=సుభగమైనట్టియు+సుందర = సుందరమైనట్టియు+శ్రీః=కాంతిగల, ఆర్యపుత్రః = ఆర్యపుత్రుఁడు, ఆలిఖితః = చిత్రింపఁబడినాఁడు.

ల:- ఆర్యే ! పశ్య పశ్య.

శ్లో॥ సంబంధినో వశిష్ఠాదీ నేష తాత స్తవార్చతి
గౌతమశ్చ శతానందో జనకానాం పురోహితః ॥ ౧౬.

ల:— ఆర్యే=పూజ్యురాలా ! పశ్య+పశ్య=చూడు, చూడు.

అర్థ:— ఏషః=ఇదుగో, తవ=నీయొక్క, తాతః = తండ్రియగుజనకుఁడు, సంబంధినః=వివాహార్థ మరుదెంచిన దశరథాదులను, తథా=అట్లే, జనకానాం=జనకవంశస్థులయొక్క, పురోహితః=పురోహితుఁడైనట్టియు, గౌతమః+చ=గౌతమునిపుత్రుఁడైనట్టియు, శతానందః+చ = శతానందుఁడును, వశిష్ఠాదీన్ = వశిష్ఠుఁడుమున్నగువారిని, అర్చయతి = పూజించుచున్నాఁడు.

తా॥ తల్లీ ! ఇదిగో, ఇటుఁజూడుము; ఒకవైపు మీతండ్రిగారు (జనకుఁడు) వివాహమునకై వచ్చిన దశరథాదిరాజబంధువుల మర్యాద చేయుచున్నారు; మఱొకవైపున, జనకులపురోహితులును, గౌతమపుత్రులు నగు శతానందులవారు వశిష్ఠాది మునీంద్రులఁ బూజించుచున్నారు.

రామః:- దృష్టవ్య మేతత్,—

శ్లో॥ జనకానాం రఘూణాంచ సంబంధః కస్య న ప్రియః
యత్ర దాతా గ్రహీతా చ స్వయం కుశికనందనః ॥

రా:— ఏతత్=ఇది, దృష్టవ్యం=చూడఁదగినది.

అర్థ:— జనకానాం=జనకవంశోద్భవులకు, రఘూణాం+చ = రఘువంశోద్భవులకున్ను, సంబంధః=బాంధవ్యము, కస్య=ఎవనికి, న+ప్రియః=ప్రియమైనదికాకుండు ? యత్ర=ఏసంబంధమున, స్వయం = స్వయముగా, దాతా=ఇచ్చువాఁడు, గ్రహీతా + చ = పుచ్చుకొనువాఁడును, కుశిక—నందనః=కుశికునియొక్క—కుమారుఁడో (విశ్వామిత్రుఁడో.)

తా॥ మనపరిణయమున జనక రఘువంశసంబంధ నిబంధనయందు స్వయముగా విశ్వామిత్రమహర్షి యే దాతయుఁ బ్రతిగ్రహీతయు నగుటచే నది జనులకెల్లరకును ముదావహామే. (దాతృత్వప్రతిగ్రహీతృత్వము లొకని యందుంట.)

1 సీతా :- ఏతే ఖలు తత్కాలకృతగోదానమంగలా శ్చత్వారో భ్రాతరః, వివాహదీక్షితా యూయం. అహో! జానామి తస్మిన్నేవ ప్రదేశే తస్మిన్నేవ కాలే వర్తే.

సీత:— తత్—కాల=ఆసమయమందు+కృత = చేయఁబడిన + గో—దాన=కేశ—ఖండనమే + మంగలాః = శుభకర్మగాఁగలవారై, వివాహ = వివాహముచే + దీక్షితాః=దీక్షగొన్నవారైన, యూయం + చత్వారః + భ్రాతరః=మీరునల్వురుసోదరులు, ఏతే+ఖలు=వీరేకదా. అహో=ఓహో! తస్మిన్ + ప్రదేశే+ఏవ=ఆప్రదేశమునందుననే, తస్మిన్ + కాలే + ఏవ=

1 ఏదే క్ఖు తక్కాలకిదగోదాణమంగలా చత్తారో భాదరో వివాహదిక్ఖిదా తుహ్మే అహ్మేజాణామి తస్సిం జేవ్వ పదేశే తస్సిం జేవ్వ కాలే వత్తామి.

ఆకాలంబుననే, వర్తే = ఉన్నదాన, ( ఇతి = అని ) జానామి = తలంచుచున్నాను.

రామః:— ఏవం.

శ్లో॥ సమయ స్స వర్తత ఇవైష యత్ర మాం
సమనందయ త్సుముఖి ! గౌతమార్పితః
అయ ముద్గృహీతకమనీయకంకణ
స్తవ మూర్తిమానివ మహోత్సవః కరః ॥ ౧౮

అర్థః— సుముఖి = ఓసుముఖురాలా ! యత్ర = ఏసమయమందు, అయం=ఈ, తవ=నీయొక్క, కరః=చెయ్యి, ఉద్గృహీత=ధరింపఁబడిన+కమనీయ=అందమైన+కంకణః=కంకణముగలదగుచు, గౌతమ=గౌతమపుత్రునిచే + =అర్పితః = ( నాచేతియందు) ఉంచఁబడినదై, మూర్తిమాన్=మూర్తీభవించిన, మహాత్—ఉత్సవః+ఇవ = విశేషానందమువలెనే, మాం=నన్ను, సమనందయత్ =సంతోషపెట్టెనో; సః+సమయః=ఆసమయము, ఏషః=ఇదిగో, వర్తతే+ఇవ=(మరల) ప్రవర్తించినటులఁగానఁబడుచున్నది.

తా॥ ఓ సుముఖీ ! కంకణముచేఁ బ్రకాశించెడి నీకరంబును గౌతమపుత్రులగు శతానందులు నాహస్తంబున నిడిననాఁడు, నాకుఁగల్గిన యామూర్తీభవించిన సంతసంబునకు మేర యింతింతయని నుడువ వీలులేకుండె. నే నానందపడిన యానాఁటిసమయము నిం దిప్పుడు ననుభవించుచున్నటుల నున్నది.

లక్ష్మణః:— ఇయ మార్యా. ఇయమ ప్యార్యా మాండవీ; ఇయమపి వధూః శ్రుతకీర్తిః.

ల:— ఇయం = ఈమె, ఆర్యా=ఆర్య ( పూజ్యురాలగు మావదినె ) ఇయం+అపి=ఈమెయు, ఆర్యా=ఆర్యురాలగు, మాండవీ = మాండవి; ఇయం+అపి=ఈమెయు, వధూః=వధువగు, శ్రుతకీర్తిః=శ్రుతకీర్తి.

♦ సీతా:— వత్స ! ఇయమ ప్యపరా కా ?

సీత:— వత్స=ఓయివత్సా (కుఱ్ఱఁడా లేక నాయనా) అపరా = ఇంకొకతె, ఇయం=ఈమె, కా=ఎవరు.

లక్ష్మణః:— (సలజ్జస్మితం) అయే ఊర్మిలాం పృచ్ఛత్యార్యా. భవతు. అన్యతః సంచారయామి. (ప్రకాశం) ఆర్యే దృశ్యతాం ద్రష్టవ్య మేతత్. అయం చ భగవాన్ భార్గవః.

ల:— (సలజ్జస్మితం = సిగ్గు, చిర్నగవులతోఁగూడుకొన్నట్లుగా,) అయే = ఓహో ! ఆర్యా=అర్యురాలు (మావదినెగారు) ఊర్మిలాం = ఊర్మిళను, పృచ్ఛతి = అడుగుచున్నది. భవతు = పోనీక, అన్యతః = మఱొకవైపునకు, సంచారయామి = జరపెదను. (ప్రకాశం = ప్రకాశముగా) ఆర్యే = ఆర్యా ! దృశ్యతాం=చూడఁబడుఁగాక (చూడుమా) ఏతత్=ఇది, ద్రష్టవ్యం=చూడఁదగినది. అయం = ఇతఁడుగో, భగవాన్= పూజ్యుఁడైన, భార్గవః+చ=పరశురాముఁడును.

‡ సీతా:— (ససంభ్రమం) కంపితాస్మి.

సీత:— (ససంభ్రమం=భయముతోఁగూడునట్లు) కంపితా+అస్మి= చకితురాల నగుచున్నాను.

రామః:— ఋషే నమ స్తే.

రా:— ఋషే=ఋషీశ్వరా ! తే=నీకొఱకు, నమః=నమస్కారము.

లక్ష్మణః:— ఆర్యే ! పశ్య. అయ మార్యేణ. (ఇత్యర్థోక్తే)

ల:— ఆర్యే = ఆర్యురాలా ! పశ్య=చూడుము. అయం=ఈతఁడు, ఆర్యేణ=పూజ్యుఁడగునన్నచే (ఇతి=అని, అర్థ—ఉక్తే=సగము నుడువఁబడఁగా.)

---

♦ వచ్ఛ ఇఅం వి అవరా కా ?  ‡ కంపిదహ్మి.

రామః:— ( సాక్షేపం ) అయి ! బహుతరం ద్రష్టవ్యం అన్యతో దర్శయ.

రా:— ( సాక్షేపం=నిరాదరణపూర్వకముగా ) అయి = ఓయీ ! ద్రష్టవ్యం=చూడఁదగినది, బహుతరం=చాలఁగలదు. అన్యతః = మఱొక చోటు, దర్శయ=చూపుము.

† సీతా:—(సస్నేహబహుమానం నిర్వర్ణ్య) సుష్ఠు శోభసే ఆర్యపుత్ర ఏతేన వినయమాహాత్మ్యేన.

సీత:— ( సస్నేహబహుమానం=స్నేహాదరభావంబులు గల్గునటుల, నిర్వర్ణ్య=చూచి ) ఆర్యపుత్ర=ఆర్యపుత్రుఁడా ! ఏతేన=ఈ, వినయ=వినయముయొక్క+మాహాత్మ్యేన=మహిమచే, సుష్ఠు=బాగుగా, శోభసే=ప్రకాశించుచున్నావు.

లక్ష్మణః:— ఏతే వయం అయోధ్యాం ప్రాప్తాః.

ల:— ఏతే=ఇదే, వయం= మనము, అయోధ్యాం = అయోధ్యానగరముఁ గూర్చి, ప్రాప్తాః=చేరినాము.

రామః:— ( సాస్రం ) స్మరామి, హంత ! స్మరామి.

రా:— ( సాస్రం=కన్నీటితోఁగూడునట్లు ) స్మరామి = స్మరించుచున్నాఁడ, హంత=అయ్యో, స్మరామి=స్మరించుచున్నాఁడ.

శ్లో॥ జీవత్సు తాతపాదేషు నూతనే దారసంగ్రహే
మాతృభి శ్చింత్యమానానాం తే హి నో దివసా గతాః॥

అర్థః:— తాతపాదేషు=తండ్రిగారు, జీవత్సు=జీవించియుండ, దారపరిగ్రహే=భార్యాస్వీకారము ( వివాహము ) నవే=క్రొత్తగా సంప్రాప్తింపఁగా, మాతృభిః=తల్లులచే, చింత్యమానానాం=ధ్యానింపఁబడుచున్న,

† సుష్ఠు సోహసి అజ్జఉ_త్త ఏదిణా విణఅమాహప్పేణ.

నః=మనయొక్క, తే=అభ్రూర్వోక్తములైన, దివసాః=రోజులు, గతాః+హి=గడచినవి గదా.

తా॥ పూజ్యులగు తండ్రిగారు జీవించియుండ, నూతనవైవాహిక మహోత్సవమునఁ దేలుచున్న మనలను గని తల్లులు మువ్వురును సంబరపడు చుండిన యట్టి దివసములన్నియు నెన్నఁడో గడచిపోయినవి గదా

రామః:- ఇయమపి తదా జానకీ.

శ్లో॥ ప్రతనువిరలైః ప్రాంతోన్మీల న్మనోహరకుంతలై
ర్దశనకుసుమై ర్ముగ్ధాలోకం శిశు ర్దధతీ ముఖం
లలితలలితై ర్జ్యోత్స్నాప్రాయై రకృత్రిమవిభ్రమై
రకృత మధురై రంగానాం మే కుతూహల మంగకైః॥

రా:-అర్థ:-తదా=అపుడు (పూర్వోక్తమైత్రుచింతాసమకాలమునందే) ప్రతను=సూక్ష్మములున్న+విరలైః=విరళములు నౌటచేతనే, మనోహర=మనోహరములైన+కుంతలైః=కేశములచే, ప్రాంత (గండస్థలములయొక్క) ప్రాంతములయందు+ఉన్మీలత్=ప్రకాశించుచున్నట్టియు, దశన=దంతములయొక్క+ముకులైః=మొగ్గలచే, ముగ్ధ-ఆలోకం = మనోహరమగు దర్శనముగలట్టియు, ముఖం=ముఖమును, దధతీ=ధరించుచు, శిశుః=కుఱ్ఱది యగు, ఇయం=ఈ, జానకీ+అపి = సీతకూడ, లలిత-లలితైః = మిక్కిలి మనోహరములైనట్టియు, జ్యోత్స్నా-ప్రాయైః = వెన్నెలలతో సాటియైనట్టియు, అకృత్రిమ=కృత్రిమములుకాని (సహజములైన) విభ్రమైః = విలాసములతోఁగూడినట్టియు, మధురైః=మధురములైనట్టియు, అంగకైః=సుతిమెత్తనగు నవయవములచే, మే=నాయొక్క, అంగానాం=అవయవములకు, కుతూహలం=ఆనందంబును, అకృత=కలుగఁజేసెను.

తా॥ ఓ ప్రేయసీ! సూక్ష్మములును విరళములు నగుటచే నతిమనోహరములైన కేశంబులు గండభాగంబుల వ్రేలుటచే మిగులఁ బ్రకాశించు

చున్నట్టియు, మొగ్గలవంటి దంతములచే నతిసుందరమై దర్శనీయంబై నట్టియు, నీపసితసమునాటిముఖమున్ను, — అత్యంతలలితములును, బండు వెన్నెలలవలె ననుభోగ్యంబులును, బహుసుందరములును, స్వభావసిద్ధచేష్టా కలితములు నగు నీముద్దులయవయవములున్ను, — నాకు సర్వాంగానందమును గూర్చెను.

లక్ష్మణః:— ఏషా మంథరా !

ల:— ఏషా=ఈమె, మంథరా=మంథర.

రామః:— ( సత్వర మన్యతో దర్శయన్ ) దేవి ! వైదేహి!

శ్లో॥ ఇంగుదీపాదప సోఽయం శృంగిబేరపురే పురా
నిషాదపతినా యత్ర స్నిగ్ధే నాసీ త్సమాగమః ॥

రా:— ( సత్వరం=త్వరగా, అన్యతః=మఱొకస్థలమున, దర్శయన్= చూపుచు ) దేవి=దేవీ, వైదేహి=జానకీ.

అర్థ:— యత్ర = ఏయింగుదీవృక్షమూలమున, పురా = పూర్వము, స్నిగ్ధేన=సౌహార్దముతోఁగూడుకొనిన, నిషాద—పతినా=నిషాద—భర్తతో, సమాగమః=పొందిక, ఆసీత్=అయెనో, సః=అ, శృంగిబేర—పురే=శృంగి బేరపట్టణమందలి, ఇంగుదీపాదపః=ఇంగుదీవృక్షము, అయం=ఇదే.

తా॥ ఓ కాంతా ! తొల్లి శృంగిబేరపురమున స్నేహపాత్రుఁడును, నిషాదాధిపతియునగు గుహుండును మనమును సమావేశమైనది యీయింగు దీపాదప సమీపముననే.

లక్ష్మణః:— ( విహస్య, స్వగతం ) అయే మధ్యమాంబా వృత్తాంత అంతరిత ఆర్యేణ.

ల:— ( విహస్య=నవ్వి, స్వగతం=తనలో ) అయే=ఓహో, ఆర్యేణ= ఆర్యపుత్రునిచే, మధ్యమ—అంబా = మధ్యమాంబయొక్క ( మువ్వురు

తల్లులలో మధ్యనెన్నఁబడిన ) వృత్తాంతః = వార్త, అంతరితః = మరుగు పఱుపఁబడినది.

‡ సీతా:— అహో ఏష జటాసంయమనవృత్తాంతః.

సీత:— అహో=ఓహో! ఏషః=ఇది, జటా—సంయమన=జడలఁ దాల్చుటకు సంబంధించిన + వృత్తాంతః=వార్త.

లక్ష్మణః:— పుత్రసంక్రాంతలక్ష్మీకై ర్యద్వృద్ధేక్ష్వాకుభి ర్ధృతం
ధృతం బాల్యే త దార్యేణ పుణ్య మారణ్యకవ్రతం ॥

ల:—అర్థ:— పుత్ర=కుమారునియందు + సంక్రాంత=సంక్రమించిన + లక్ష్మీకైః=రాజ్యలక్ష్మిగల, వృద్ధ=వృద్ధులౌ + ఇక్ష్వాకుభిః=ఇక్ష్వాకువంశస్థులౌ రాజులచే, యత్=ఏయారణ్యకవ్రతము, ధృతం=ధరింపఁబడినదో, తత్= ఆ, పుణ్యం = పవిత్రమైన, ఆరణ్యక = వనవాసరూపమగు + వ్రతం= వ్రతము, ఆర్యేణ = ఆర్యపుత్రునిచే, బాల్యే = బాల్యమందే, ధృతం = ధరింపఁబడినది.

తా॥ పూర్వీకులగు నిక్ష్వాకు వంశమునఁబుట్టిన నృపాలురు, చిర కాలము రాజ్యపాలన మొనర్చి, వార్ధకదశయందుఁ బుత్రులకు రాజ్యలక్ష్మి నొసంగి, తాపసవృత్తి నూనెడివారు. పూజ్యులగు మాయన్న గారన్నో, బాల్యమునందున నే తదారణ్యకవ్రతము నవలంబించినారు.

* సీతా:— ఏషా ప్రసన్నపుణ్యసలిలా భగవతీ భాగీరథీ.

సీత:— ఏషా=ఇదే! ప్రసన్న=నిర్మలమైనట్టియు + పుణ్య=పవిత్ర మైనట్టియు + సలిలా=నీరుగల, భగవతీ=పూజ్యురాలగు, భాగీరథీ=గంగ.

రామః:— రఘుకులదేవతే నమ స్తే.

---

‡ అహో్మ ఏసో జటాసంజమణవుత్తన్తో.

* ఏసా పసణ్ణపుణ్ణసలిలా భఅవదీ భాఈరహీ.

శ్లో॥ తురగవిచయవ్యగ్రా నుర్వీభిదః సగరాధ్వరే
కపిలమహసా రోషాత్ ప్లుష్టా న్పితుశ్చ పితామహాన్
అగణితతనూతాప స్తప్త్వా తపాంసి భగీరథో
భగవతి ! తవ స్పృష్టా నద్భి శ్చిరా దుదతీతరత్ ॥

రా:- రఘు-కుల=రఘువంశజులకు + దేవతే = దేవతవైనభాగీరథీ, తే=నీకొఱకు, నమః=నమస్కారము.

అర్థ:- భగవతి = ఓమహిమమయురాలా ! భగీరథః = భగీరథుఁడు, అగణిత=లెక్కసేయఁబడని + తనూ-తాపః=దేహతాపము గలుగునట్లుగా, తపాంసి + తప్త్వా=తపంబులొనర్చి, తవ=నీయొక్క, అద్భిః=ఉదకములచే, స్పృష్టాన్=తాకఁబడినట్టియు, సగర = సగరచక్రవర్తియొక్క + అధ్వరే= యాగమందు, తురగ = (యాగ) అశ్వముయొక్క + విచయే = వెదకుట యందు + వ్యగ్రాన్=ఆసక్తులై, ఉర్వీ-భిదః=భూమిని బ్రద్దలొనర్చినట్టియు, రోషాత్ = కోపమువలన, కపిల=కపిలమహర్షియొక్క + మహసా = తేజస్సుచే, ప్లుష్టాన్=భస్మమొనర్పఁబడినట్టియు, పితుః=తండ్రియగుదిలీపునకు, పితామహాన్ = తాతలైనట్టివారిని, చిరాత్ = చాలకాలముతరువాత, ఉదతీతరత్=తరింపఁజేసెను.

తా॥ తల్లీ ! గంగాభవానీ ! తొల్లిసగరచక్రవర్తి యశ్వమేధ యాగ మొనర్ప నిం(దు)డు కుపితుఁడై గోప్యముగ యాగాశ్వమును హరించి పాతాళమున నుంచఁదద న్వేషణావేశపరులై తత్పుత్రులగు మా ముత్తాతలు, భూమిని బగులఁద్రవ్వి పాతాళమునకేగి, అటఁ దపోనిష్ఠనున్న కపిల మహర్షిని గలంప నాతఁడు మండిపడి తన తేజోఽగ్ని వారల భస్మీభూతులఁ గావించి దుర్గతింగూలఁద్రోయఁ జిరకాలమునకు భగీరథుఁ డఘోరతపం బొనర్చి నిన్ను స్వర్గమునుండి గొనివచ్చి నీపావనోదక స్పర్శచే వారల నుత్తరింపఁజేసె.

రామః:— సా త్వ మంబ, స్నుషాయా మరుంధతీవ సీతాయాం శివానుధ్యానా భవ.

రా:— అంబ=ఓజననీ, సా+త్వం=ఆట్టినీవు, స్నుషాయాం=కోడలగు, సీతాయాం=సీతయందు, అరుంధతీ+ఇవ=అరుంధతీదేవి చందమున, శివ = మంగళమునందు + అనుధ్యానా = అనుచింతనముగలదానవు, భవ=కమ్ము.

లక్ష్మణః:— ఏష భరద్వాజవేదిత శ్చిత్రకూటయాయిని వర్త్మని వనస్పతిః కాళిందీతటే వటః శ్యామో నామ.

ల:— ఏషః=ఇది, భరద్వాజ= భారద్వాజమునిచే, వేదితః=నివేదింపఁబడిన, చిత్రకూట=చిత్రకూటపర్వతమునుగూర్చి+యాయిని=కొనిపోయెడి, వర్త్మని=మార్గమందు, కాళిందీ = కాళిందీ నదియొక్క+తటే = ఒడ్డున, శ్యామః+నామ = 'శ్యామ' అని ప్రసిద్ధిచెందిన, వటః+వనస్పతిః = మఱ్ఱిచెట్టు.

( రామః సస్పృహ మవలోకయతి. )

( రామః=రాముఁడు, సస్పృహం = కాంక్షతోఁగూడుకొన్నటుల, అవలోకయతి=చూచుచున్నాఁడు. )

* సీతా:— స్మరతి వా తం ప్రదేశ మార్యపుత్రః.

సీత:— ఆర్యపుత్రః=ఆర్యపుత్రుఁడు, తం+ప్రదేశం=ఆస్థానమును, స్మరతి+వా=జ్ఞప్తిగొనుచున్నాఁడా ?

రామః— అయి ! కథం విస్మర్యతే.

రా:— అయి = అసీ ( ప్రేయసీ ) కథం=ఎట్లు, విస్మర్యతే=మఱపఁబడు ?

---

* సుమరేది వా తం పదేసం అజ్జఉత్తో.

శ్లో॥ అలసలలితముగ్ధా న్యధ్వసంపాతఖేదా
దశిథిలపరిరంభై ర్దత్తసంవాహనాని
పరిమృదితమృణాలీదుర్బలా న్యంగకాని
త్వ ము:రసి మమ కృత్వా యత్ర నిద్రా మవాప్తా॥

అర్థ:— యత్ర=ఏప్రదేశమందు, త్వం=నీవు, అధ్వ = మార్గప్రయాణమువలన + సంపాత=సమకూరిన + ఖేదాత్ = ఆయాసమువలన, అలస = స్తిమితములైనను (కాలుతీసి కాలుపెట్ట వీలుకానట్టియు) + లలిత=మృదువులైనట్టియు + ముగ్ధాని = సుందరములైనట్టియు, పరిమృదిత = నలపఁబడిన + మృణాలీ=తామరతూండ్లవలె + దుర్బలాని=బలహీనములైనట్టియు, అశిథిల=గాఢములైన + పరిరంభైః = ఆలింగనములచేత, దత్త = ఒసఁగఁబడిన + సంవాహనాని=అంగమర్దనములుగల, అంగకాని=హ్రస్వాంగములను మమ=నాయొక్క, ఉరసి + కృత్వా=వక్షఃస్థలమందుంచి, నిద్రాం=నిద్రను, అవాప్తా=పొందితివో.

తా॥ ప్రేయసీ! నీవు మార్గమున మాకంటె వెనుకఁబడకుండఁ గూడి రావలయునని వడివడిగా నడచుటచే మిగులడస్సిపోయి, వాడివత్తలైన తామరతూండ్లవలె దుర్బలములయ్యును సుకుమారములును సుందరములు నగు నీయంగకములను మాటిమాటికి గట్టిగఁ గౌగలించుకొనుటలోనే సంవాహన మొనరింపఁగా నీవు నావక్షముపై నిద్రాసుఖం బనుభవించిన దీప్రదేశమందు ననేకదా! అట్టి యీ ప్రదేశమును మఱపుచెందు టెట్లు?

లక్ష్మణః:— ఏష వింధ్యాటవీముఖే విరాధసంవాదః.

లక్ష్మ:— ఏషః=ఇది, వింధ్యా—అటవీ=వింధ్యారణ్యముయొక్క + ముఖే=ప్రవేశమార్గమున, విరాధ=విరాధుఁడను రాక్షసునిచే + సంవాదః = ఘోరాటము,

¹ సీతా:—అలం తావ దేతేన. పశ్యామి తావ దార్యపుత్రి స్వహస్తధృతతాలవృంతాతపత్ర మాత్మనో ఽ త్యాహితం దక్షిణారణ్యప్రవేశం.

సీత:— అలం + తావత్ + ఏతేన = ఈసంగతియింతటితోఁ జాలును, ఆర్యపుత్ర=ఆర్యపుత్రునియొక్క + స్వ—హస్త = స్వహస్తముచే + ధృత = ధరింపఁబడిన + తాల—వృంత = తాలవృంతమే + ఆతపత్రం=గొడుగుగాఁ గలదై, ఆత్మనః=నాకు, అత్యాహితం=బహుప్రయాసకరమగు, దక్షిణ—అరణ్య=దక్షిణారణ్యమందలి + ప్రవేశం = ప్రవేశించుటను, పశ్యామి = చూచెద.

రా:— శ్లో॥ ఏతాని తాని గిరినిర్ఝరిణీతటేషు
వైఘానసాశ్రితతరూణి తపోవనాని
యే ష్వాతిథేయపరమా యమినో భజంతే
నీవారముష్టిపచనా గృహిణో గృహాణి॥ ౨౫

రా:—అర్థ:— యేషు=ఏతపోవనములయందు, యమినః=నియమముగల వారు కనుకనే, నీవార=నివ్వరిధాన్యముయొక్క + ముష్టి= ( ఒక్క ) పిడికిలి యొక్కయే + పచనాః=పాకముగలట్టియు ( నియతాహారులౌటచే నొక్క పిడికెఁడు నివ్వరిధాన్యముచే మాత్రమే వంటకముచేయువారు ) ఆతిథేయ= అతిథిసత్కారము + పరమాః = ప్రధానముగాఁ గలట్టియు, గృహిణః= గృహస్థులౌమునులు, గృహాణి = కుటీరములను, భజంతే = ఆశ్రయించు చున్నారో, తాని=ఆ, గిరి—నిర్ఝరిణీ=కొండ—వాగులయొక్క + తటేషు = తీరములయందు, వైఘానస=వానప్రస్థులౌయతులచే + ఆశ్రిత=ఆశ్రయింపఁ

---

¹ అలం దావ ఏదిణా. పేక్ఖామి దావ అజ్జఉత్తసహత్థధరిద తాల వుంతాదవత్తం అత్తణో అచ్చహిదం దక్ఖిణారణ్ణపహిఅత్తణం.

బడిన + తరూణి = వృక్షములుగల, తపః — వనాని = తపోవనములు, ఏతాని = ఇవిగో.

తా॥ ఓ ప్రేయసీ, నియమ వ్రతావలంబులై, పిడికెఁడు నివ్వరి ధాన్యము చేతనే జీవయాత్రచేయుచుండియూ నతిథిపూజాతత్పరులగు గృహస్థులౌ మునుల కుటీరంబులతోఁగూడుకొనినట్టియు, సెలయేళ్ళయిరు కెలంకులను దట్టముగఁబెదిగి వైఖానసవాసయోగ్యంబులగు వృక్షములచేఁ గూడుకొనినట్టియుఁ దపోవనంబు లివిగో; కనుగొనుచున్నావా ?

లక్ష్మణః:— అయ మవిరళానోకహానివహా నిరంతరస్నిగ్ధనీల పరిసరారణ్యపరిణద్ధగోదావరీముఖరకందరః సంతత మభిష్యంద మాన మేఘమేదురితనీలిమా జనస్థానమధ్యగో గిరిః ప్రస్ర వణో నామ.

ల:— సంతత = ఎల్లప్పుడు + అభిష్యందమాన = వర్షించుచున్న + మేఘ = మేఘములచే + మేదురిత = దట్టముగాఁ జేయఁబడిన + నీలిమా = నైల్యము గల్గినట్టియు, అవిరళ = దట్టములైన + అనోకహ = వృక్షములయొక్క + నివహా = సమూహముచే + నిరంతర = అవిచ్ఛిన్నములును + స్నిగ్ధ = దట్టములును + నీల = నల్లనివియునైనట్టి + పరిసర = సమీపమండలి + అరణ్య = అడవులచే + పరిణద్ధ = క్రమ్ముకొనఁబడిన + గోదావరీ = గోదావరీప్రవాహముచే + ముఖర = శబ్దాయమానములగు + కందరః = గుహలుగల్గినట్టియు, జన — స్థాన = జనస్థానమను నరణ్యమునకు + మధ్య = మధ్యను + గః = పొందినట్టియు, ప్రస్రవణః + నామ = ప్రస్రవణమను, గిరిః = పర్వతము, అయం = ఇది.

రామః:— శ్లో॥ స్మరసి సుతను ! తస్మి న్పర్వతే లక్ష్మణేన

ప్రతివిహితసపర్యాసుస్థయో స్తా న్యహాని

స్మరసి సరసనీరాం తత్ర గోదావరీం వా
స్మరసి చ తదుపాంతే ష్వావయో ర్వ ర్తనాని॥౨౬

రా:—అర్థ:— సుతను = ఓ మనోహరగాత్రి ! తస్మిన్=ఆ, పర్వతే= పర్వతమందు, లక్ష్మణేన=లక్ష్మణునిచే, ప్రతివిహిత = బాగుగనొనర్పఁ బడిన + సపర్యా = పరిచర్యచే + స్వస్థయోః = సుఖమొందియున్న మన యొక్క, తాని=ఆ, అహాని = రోజులను, స్మరసి + కిం = తలఁచెదవా ? తత్ర=ఆపర్వతమున, సరస=రుచిగల + నీరాం=నీరుగల, గోదావరీం + వా=గోదావరీనదినిగాని, స్మరసి + కిం=తలఁచెదవా ? తత్ = ఆగోదావరీ నదియొక్క + ఉపాంతేషు=సమీపముల, ఆవయోః=మనయిర్వురియొక్క, వర్తనాని=చర్యలను, స్మరసి + కిం=తలఁచెదవా ?

తా॥ ఓ శుభాంగీ ! మా లక్ష్మణుఁడు విహితసపర్యలొనర్చుచుండ, బహుసుఖముగా మన మీప్రస్రవణగిరిందరిమునఁ బెక్కుదినంబులు గడపితిమి. మధురజలాపూర్ణయగు గోదావరీనదియు నచటనే కదా యుండెను; తదుపాంతదేశంబులయందే కదా మనము రహఃక్రీడలఁ బ్రవర్తించితిమి. నీ కలనాటిదినంబులును, ఆనాఁటిచర్యలును జ్ఞప్తియందున్నవా ?

కించ— కిమపి కిమపి మన్దం మన్ద మాసక్తియోగా
దవిరలితకపోలం జల్పతో రక్రమేణ
అశిథిలపరిరంభవ్యాపృతైకైకదోష్ణో
రవిదితగతయామా రాత్రిరేవ వ్యరంసీత్ ॥౨౭॥

అర్థ:— అశిథిల=సడలిపోని ( గాఢమైన ) + పరిరంభ=ఆలింగనములయందు + వ్యాపృత = ప్రవర్తించిన + ఏక = ( నాయొక్క ) ఒకటైనట్టియు + ఏక= ( నీయొక్క ) ఒకటైనట్టియు + దోష్ణోః = బాహువులుగల వారముగనుకనే, ఆసక్తి = ( ఒండొరుల ) సన్నిధానముయొక్క +

యోగాత్=కూడికవలన, అవిరళిత=ఒండొంటితోఁగలసిన+కపోలం=చెక్కిళ్లుగల్గినటుల, మందం+మందం=మెల్లమెల్లగా, కిమ్+అపి+కిమ్+అపి= ఏమేమియో, అక్రమేణ=వరుసలేక ( ఇష్టమువచ్చినట్లు ) ఆవయోః=మన యిద్దరము, జల్పతోః=గుసగుసలాడుచుండఁగా, రాత్రిః+ఏవ=రాత్రియే, వ్యరంసీత్ = గడచెను.

తా॥ ఓ ప్రేయసీ! అత్యాసక్తిచే నామాట ముగియకమున్నె నీవును, నీమాట ముగియకమున్నె నేనును జెక్కిళులు చెక్కిళులఁజేర్చి విధివిరామము లేక, యేమేమో గుసగుసలాడుచు నొండొరుల బాహువులఁ బెనవైచుకొని గాఢాలింగనములతో మసలుచుండ మనకుఁ దెలియకుండఁగనే యిట్టె భళ్లునఁ దెల్లవారిపోయె.

లక్ష్మణః:— ఏషా పంచవట్యాం శూర్పణఖా.

ల:— ఏషా=ఈమె, పంచవట్యాం=పంచవటియందు, శూర్పణఖా= శూర్పణఖ.

◆ సీతా:— హా ఆర్యపుత్ర! ఏతావత్తే దర్శనం

సీత:— హా=అయ్యో, ఆర్యపుత్ర=ఓఆర్యపుత్రుఁడా, తే=నీయొక్క దర్శనం=చూచుట, ఏతావత్ = ఇంతవఱకే ( ఇంతవఱకే మిమ్ము నేఁ జూడఁగల్గితి )

రామః:— అయి! విప్రయోగత్రస్తే! చిత్ర మేతత్

రా:— అయి=ఓసీ, విప్రయోగ = ఎడబాటువలన+త్రస్తే = భయ మొందినదానా, ఏతత్=ఇది, చిత్రం=చిత్తరువు.

† సీతా:—యథా తథా భవతు దుర్జనః అసుఖముత్పాదయతి.

---

◆ హా అజ్జఉత్త ఏత్తిఅం దే దరిసణం.

† జహా తహా హోదు. దుజ్జణో అసుహం ఉప్పాదేఇ.

సీత:— యథా + తథా + భవతు = ఎట్లైననుగానిండు, ( చిత్తరువగుట నిశ్చయమైనను సరియే ) దుర్జనః = దుర్జనుఁడు, అసుఖం = సుఖములేమిని, ఉత్పాదయతి=కలిగించును.

రామః:— హంత ! వర్తమాన ఇవ మే జనస్థానవృత్తాంతః ప్రతిభాతి.

రా:— హంత = ఏమి యాశ్చర్యము, జనస్థాన = జనస్థానమందలి+ వృత్తాంతః=వృత్తాంతము, మే=నాకు, వర్తమానః + ఇవ=ఇపుడు జరుగుచున్నటులే, ప్రతిభాతి=కనఁబడుచున్నది.

లక్ష్మణః:—శ్లో॥ అథేదం రక్షోభిః కనకహరిణచ్ఛద్మవిధినా
తథా వృత్తం పాపైర్వ్యథయతి యథా క్షాలితమపి
జనస్థానే శూన్యే వికలకరణైరార్యచరితై
రపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయం ॥

ల:—అర్థ:— అథ=పిదప, పాపైః=పాపులగు, రక్షోభిః=రాక్షసులచే, కనక=బంగారువికారమైన + హరిణ=లేడియను + ఛద్మ=మిషయొక్క + విధినా = అనుష్ఠానముచే, ఇదం=ఇది ( ఈచిత్తరువునఁగనఁదగు వస్తువు ) తథా=ఆప్రకారముగా, వృత్తం=ప్రవర్తించినదై, యథా + క్షాళితం + అపి=పూర్తిగఁగడుగఁబడినదైనను ( కనకహరిణముయొక్క వృత్తాంతమునకుఁ దగిన ప్రతిక్రియచేయఁబడినను ) వ్యథయతి = బాధించుచునేయున్నది; శూన్యే = ( మానవ సంచారముచే ) శూన్యమైన, జనస్థానే=జనస్థానంబున, వికల=అవశములైన + కరణైః=ఇంద్రియములుగల, ఆర్య = ఆర్యపుత్రునియొక్క + చరితైః=చరితములచే, గ్రావా + అపి=గండశిలయైనను, రోదితి=కన్నీరు విడుచును; వజ్రస్య = ( అన్నింటిలో మిగుల కఠినమైనదని పేర్కొనఁబడు ) వజ్రముయొక్క, హృదయం + అపి = హృదయముగూడ, దళతి=పగులును.

తా॥ పాపాత్ములగు రాక్షసులు తమమాయచే బంగరులేడి నొక దానినిగల్పించి కావించిన దండగము లెట్లోనిశ్శేషముగ నివర్తింపఁబడినను దలఁపునకువచ్చునప్పుడెల్ల నవి వ్యథపెట్టుచునేయున్నవి. ఆదినములలో శూన్యమగు జనస్థానమున మాయన్నగారవయవస్వాస్థ్యములేక పడినబన్న ములకు గండశిలలు సైతము గన్నీరు విడుచుచున్నవి. వజ్రములేనియు బ్రద్దలుగాఁ బగులుచున్నవి.

• సీతా:- ( సాస్ర మాత్మగతం ) అహహో దినకరకులాన న్దన ! ఏవ మపి మమ కారణాత్ క్లాంత ఆసీః.

సీత:- ( సాస్రం = కన్నీటితోఁగూడునట్లు; ఆత్మగతం=తనలో ) అహహో=ఓయీ, దిన-కర-కుల=సూర్యవంశమును + ఆనందన = ఆనందింపఁ జేయువాఁడా ! మమ=నాయొక్క, కారణాత్ = కారణమువలన, ఏవం = ఇట్లు, క్లాంతః=అలసటనొందినవాఁడవు, ఆసీః + అపి=ఐతివిగా.

ల:- ( రామం నిర్వర్ణ్య సాకూతం ) ఆర్య ! కిమేతత్.

శ్లో॥ అయం తావ ద్బాష్ప స్త్రుటిత ఇవ ముక్తామణిసరో
విసర్ప న్ధారాభి ర్లుఠతి ధరణీం జర్జరకణః
నిరుద్ధోఽప్యావేగః స్ఫురదధరనాసాపుటతయా
పరేషా మున్నేయో భవతి చిర మాధ్మాతహృదయః॥

ల:- ( రామం=రాముని, నిర్వర్ణ్య=చూచి, సాకూతం=అభిప్రాయ పూర్వకముగా ) ఆర్య=ఆర్యా, ఏతత్ + కిం=ఇదేమి !

అర్థ:- ధారాభిః=ధారలచే (గా) విసర్పన్=ప్రాకుచు, అయం=ఈ, తే=నీయొక్క, బాష్ప-ఓఘః=కన్నీటి-ప్రవాహము, జర్జర = (కిందఁబడి)

---

• ఆహొమ్మె దిణఅరకులాణందణో ఏవ్వం పి మమ కారణాదో కిలంతో ఆసి.

శిథిలమైన + కణః = బిందువులు గలదగుచు, త్రుటితః = తెగిన, ముక్తా- మణి-సరః + ఇవ = ముత్యాలహారమురీతిగనే, ధరణీం = భూమిని ( భూమి యందు ) లుఠతి = పొరలుచున్నది. చిరం = చాలసేపు, ఆధ్మాత = గద్గదికతోఁ గూడిన + హృదయః = హృదయముగల (కంఠముగల) ఆవేగః = దుఃఖవేగము, నిరుద్ధః + అపి = ఆపుకొనఁబడినదైనను, స్ఫురత్ = అదరుచున్న + అధర- నాసా-పుటతయా = క్రిందిపెదవియు - నాసికాపుటములునుగల్గియుంటచే, పరేషాం = ఇతరులకు, ఉన్నేయః = ఊహింపఁదగినది, భవతి = అగుచున్నది.

తా॥ ముక్తామణిసరము పెటీగిపోయినపుడు జలజలరాలుముత్యము లట్లు బిందువువెంట బిందువుగా నేలపైఁబడు నీకన్నీరు ధారలుకట్టిపోవు చున్నది. ఎంతబిగియఁబట్టినను నాసాపుటంబులు నధరోష్ఠము నదరుటచేతను, గంఠము గద్గదస్వరముతోఁ గూడుటచేతను దుఃఖావేగము బయటఁబడుచునే యున్నది.

రామః:- వత్స !

శ్లో॥ తత్కాల ప్రియజన విప్రయోగజన్మా
తీవ్రోఽపి ప్రతికృతివాంఛయా విసోఢః
దుఃఖాగ్ని ర్మనసి పున ర్విపచ్యమానో
హృన్మర్మవ్రణ ఇవ వేదనాం కరోతి ॥

రా:- వత్స = కుఱ్ఱఁడా ! అర్థ:- తత్-కాల = ఆకాలమున + ప్రియ = ప్రియురాలితోడి + విరహ = ఎడబాటువలని + జన్మా = పుట్టుక కలది గనుకనే, తీవ్రః + అపి = భయంకరమైనదైనను, ప్రతికృతి = ప్రతిక్రియ చేయుటయందలి + వాంఛయా = కోర్కెచే, విసోఢః = ఎక్కువగా సహింపఁబడిన, దుఃఖ-అగ్నిః = శోకాగ్నిహోత్రము, పునః = మరల, మనసి = మనస్సునందు, విపచ్యమానః = పరిపాకము నొందినదై, హృత్ = హృదయ

మందలి + మర్మ = మర్మస్థలమునందలి + వ్రణః + ఇవ = పుండువలెనే, వేదనాం = బాధను, కరోతి = చేయుచున్నది.

తా. నాఁడు ప్రియురాలి వియోగము వలన హృదయమునఁగల్గిన శోకాగ్ని దుర్భరమైనదైనను, శత్రువినాశనోద్రేకముచే నెట్లో భరించితిని గాని, మరల నది యిప్పుడు పరిపాకదశనొందినదై గుండెలమరుగున నెడ గట్టిన వ్రణంబువలె మిక్కిలి బాధపెట్టుచున్నది.

‡ సీతా:— హా ధిక్ హా ధిక్. అహమప్యతిభూమింగతేన రణరణకేన ఆర్యపుత్రశూన్యమివాత్మానం పశ్యామి.

సీత:— హా = అయ్యో! ధిక్ = ఛీ, హా = అయ్యో! ధిక్ = ఛీ. అహం + అపి = నేనుగూడ, అతిభూమిం = హద్దుమీఱిన స్థానమును, గతేన = పొందిన, రణరణకేన = ఉద్వేగముచే (మితిమీఱిన విరహదుఃఖముచే) ఆత్మానం = నన్ను, ఆర్యపుత్ర = ఆర్యపుత్రునిచే + శూన్యం = శూన్యమైన దానినిగా, పశ్యామి = చూచుచున్నాను.

లక్ష్మణః:— ( స్వగతం ) భవతు ఆక్షిపామి. ( చిత్రం విలోక్య ప్రకాశం ) అథైతన్మన్వంతరపురాణస్య తత్రభవతస్తాతజటాయుషశ్చరిత్రవిక్రమోదాహరణం.

ల:— ( స్వగతం = తనలో ) భవతు = కానిమ్ము, ఆక్షిపామి = వీరిదృష్టి తొలఁగఁదీసెద. ( చిత్రం = చిత్తరువును, విలోక్య = చూచి, ప్రకాశం = ప్రకాశముగా ) మన్వంతర = మన్వంతరకాలము + పురాణస్య = ప్రాచీనుఁడైన (అత్యంతవృద్ధుఁడైన,) తత్రభవతః = పూజ్యుఁడగు, తాత— జటాయుషః = ప్రభువౌ జటాయువుయొక్క, చరిత్ర = ( తన ) చరిత్రకు సంబంధించిన + విక్రమ = పరాక్రమమునకు + ఉదాహరణం = ఉదాహరణము.

---

‡ హద్ధీ, హద్ధీ, అహంవి అదిభూమిం గదేణ రణరణఏణ అజ్జఉత్తసుణ్ణ విఅ అత్తాణం పేక్ఖామి.

† సీతా:— హా! తాత! నిర్వ్యూఢ స్తేఽపత్యస్నేహః.

సీత:— హా=అయ్యో, తాత = తండ్రి! తే = నీయొక్క, అపత్య—స్నేహః=పుత్రివాత్సల్యము, నిర్వ్యూఢః=నిర్వహింపఁబడినది.

రామః:— హా తాత కాశ్యప! శకుంతరాజ! క్వను ఖలు పున స్త్వాదృశస్య మహత స్తీర్థభూతస్య సాధో స్సంభవః.

రా:— హా=అయ్యో! తాత=తండ్రి! కాశ్యప = కశ్యపపుత్రా! శకుంత—రాజ! = పక్షిరాజా! మహతః = గొప్పవాఁడవైనట్టియు, తీర్థ—భూతస్య = హితోపదేశకుఁడవైనట్టియు, త్వాదృశస్య=నీవంటి, సాధోః=సాధువుయొక్క, సంభవః = పొందిక, పునః+క్వ+ను+ఖలు=మరల నెచ్చటఁ గల్గును.

లక్ష్మణః:— అయ మసౌ జనస్థానస్య పశ్చిమతః కుంజవా న్నామ పర్వతో దనుకబంధాధిష్ఠితో దండకారణ్యభాగః. తదిద మృష్యమూకపర్వతే మతంగాశ్రిమపదం. తత్రేయం శ్రిమణీనామ సిద్ధా శబరతాపసీ. తదేతత్పంపాభిధానంపద్మసరః.

ల:— అయం=ఇదిగో, అసౌ=ఇది, జనస్థానస్య=జనస్థానమను మహావనమునకు, పశ్చిమతః=పడమటగా, దను=దనువను+కబంధ = తలలేని రక్కసునిచే+అధిష్ఠితః=నివాసముచేయఁబడిన, కుంజవాన్+నామ=కుంజవంతమని ప్రిసిద్ధిఁజెందిన, దండక—అరణ్య—భాగః=దండకారణ్యమందలి ప్రిదేశము. ఇదం = ఇదిగో, తత్=అది, ఋష్యమూక—పర్వతే = ఋష్యమూకపర్వతమందలి, మతంగ=మతంగమునియొక్క+ఆశ్రిమ—పదం = ఆశ్రిమస్థానము; ఇయం=ఇదిగో, తత్రి = అక్కడ, శ్రిమణీ+నామ = శ్రిమణి

---

† హా తాద ణివ్వూఢో దే అపచ్చసిణేహో.

మను, శబర—తాపసీ=శబర—తపస్విని; ఏతత్=ఇదిగో, తత్=అది, పంపా-అభిధానం=పంపయను పేరుగల, పద్మ—సరః=పద్మసరస్సు.

* సీతా:- అత్ర కిల ఆర్యపుత్రేణ విచ్ఛిన్నామర్షధీరత్వం ప్రముక్తకంఠం ప్రరుదిత మాసీత్.

సీత:- అత్ర + కిల = ఇచటనేగదా, విచ్ఛిన్న = విడువఁబడిన + అమర్ష = ( రావణుని విషయమున ) కోపమును + ధీరత్వం = ధైర్యమును గల్గునటులనున్న, ప్రముక్త=విడువఁబడిన (ఉచ్చైస్స్వరమున) కంఠం=కంఠస్వరము గల్గునటులను, ఆర్యపుత్రేణ=ఆర్యపుత్రునిచే, ప్రరుదితం+ఆసీత్=విలపింపఁబడినది.

రామః:- దేవి ! పరం రమణీయ మేత త్సరః.

శ్లో॥ ఏతస్మిన్ మదకలమల్లికాక్షపక్ష
వ్యాధూతస్ఫురదురుదండపుండరీకాః
బాష్పాంభఃపరిపతనోద్గమాంతరాలే
సందృష్టా కువలయినో మయా విభాగాః ॥ 31

రా:- దేవి = ఓ ప్రేయసీ ! ఏతత్=ఈ, సరః=పద్మసరోవరము, పరం=ఎక్కువ, రమణీయం=అందమైనది.

అర్థ:- ఏతస్మిన్ = ఈసరస్సునందు, మద = ఆనందముచే+కల=అవ్యక్తమధురధ్వనికలట్టి + మల్లికాక్ష = హంసలయొక్క + పక్ష = రెక్కలచే+వ్యాధూత = కదల్పఁబడినవి కనుకనే + స్ఫురత్ = చలించునట్టియు + ఉరు=గొప్పవైనట్టియు + దండ=నాళములుగల + పుండరీకాః=తెల్ల దామరలు గలట్టియు; కువలయినః = కలువపూఁదీగలు గలట్టియు,

* అత్థ కిల అజ్జఉత్తేణ విచ్ఛిణ్ణామరిసధీరత్తణం పముక్కకంఠం పరుణ్ణం ఆసి.

విభాగాః=విభాగములు,(పంపా జలప్రదేశములు) బాష్ప—అంభః=కన్నీటి యొక్క+పరిపతన = క్రిందపడుటకును+ఉద్గమ = (మరల నా కన్నీటి యొక్క) ఆవిర్భావమునకును+అంతరాళే = మధ్య, మయా = నాచే, సందృష్టాః=చూడఁబడినవి.

తా॥ ఓ సుందరీ ! ఈ సరోవరము దీర్ఘ నాళవత్కమలములచేతను, గలువలచేతను, సందులేకుండఁ గప్పఁబడియుండినను, అం దీదులాడు మదకల హంసంబులు వానిని దమరెక్కలచేఁ ద్రోసికొని పోవుచున్నపుడు కొన్ని సందు లేర్పడుచుండెను. ఆసుందరములగు జలభాగంబులను గంటినుండి త్వద్వియోగజబాష్పాంబువులు పుడమిపైఁబడి, మరలఁ గంట నావిర్భవించు నీ మధ్యసమయమున నపుడపుడు కనుగొనఁజొచ్చితిని.

లక్ష్మణః:- అయ మార్యో హనూమాన్.

లః— అయం=ఈతఁడు, ఆర్యః=పూజ్యుఁడగు, హనూమాన్ = హనుమంతుఁడు.

[1] సీతా:- ఏష స చిరనిర్వ్యూఢజీవలోకపరిత్యుద్ధరణ గురూపకారీ మహానుభావో మారుతిః.

సీత:— చిర = చాలకాలమునుండి+నిర్వ్యూఢ=దుఃఖించిన+జీవ—లోక= ప్రాణిసమూహముయొక్క+పరిత్యుద్ధరణ = ఉద్ధరించుటయందు+గురు=ఎక్కువగు+ఉపకారీ = ఉపకారకుఁడును, మహాత్—అనుభావః= మహానుభావుఁడును, సః=ఆప్రసిద్ధుఁడునగు, మారుతిః=వాయుపుత్రుఁడు, ఏషః=ఇడుగో.

రామః:- దిష్ట్యా సోఽయం మహాబాహు రంజనానందవర్ధనః
యస్య వీర్యేణ కృతినో వయం చ భువనాని చ॥

---

[1] ఏసో సో చిరణివ్వూఢజీవలోఅపచ్చుద్ధరణ గురుఓవఆరీ మహానుభావో మారుదీ.

రా:—అన్వ:— దిష్ట్యా=ఏమాశ్చర్యము ! యస్య = ఏవాయుపుత్రుని యొక్క, వీర్యేణ=పరాక్రమముచే, వయం+చ=మనమున్ను, భువనాని+చ = చతుర్దశలోకములున్ను, కృతినః = కృతకృత్యములైనవియో, సః = అప్రసిద్ధుఁడును, మహత్-బాహుః = గొప్పబాహువులుగల, అంజన = అంజనాదేవియొక్క + ఆనంద = సంతసమును + వర్ధనః = వృద్ధిపఱచెడి వాఁడు, అయం=ఇతఁడే.

తా॥ సంతోషము ! సంతోషము ! అంజనానందవర్ధనుఁడగు హనుమంతుఁ డితఁడే; ఈ మహానుభావుని పరాక్రమముచేత నేగదా, చతుర్దశ భువనములును మనమును కృతార్థతఁ గంటిమి.

♦ సీతా:— వత్స ! ఏష స కుసుమితకదంబతాండవిత బర్హిణః కిం నామధేయో గిరిః, యత్రానుభావసౌభాగ్య మాత్రపరిశేషధూసరశ్రీ ర్మూర్ఛం స్త్వయా ప్రరుదితే నావ లంబిత స్తరుతల ఆర్యపుత్ర ఆలిఖితః .

సీత:— వత్స=నాయనా ! కుసుమిత=వికసించిన+కదంబ=కడిమి చెట్టుపై+తాండవిత=నాట్యమొనర్చు+బర్హిణః = నెమళ్ళుగల, సః= అప్రసిద్ధమగు, ఏషః+గిరిః=ఈపర్వతము, కిం+నామధేయః = ఏమిపేరు గలది. యత్ర=ఏప్రదేశమునందు ( ఈకదంబవృక్షసమీపమున ) అనుభావ = ప్రభావముయొక్క+సౌభాగ్య – మాత్ర = సౌందర్యమే+పరిశేష = మిగులుటగల + ధూసర = ధూసరవర్ణమగు+శ్రీః = శోభగల్గినట్టియు, మూర్ఛన్=మూర్ఛితుండైనట్టియు, ఆర్యపుత్రః=ఆర్యపుత్రుఁడు, ప్రరుదిత

---

♦ వచ్ఛ ! ఏసో సో కుసుమిదకదంబతాండవిఅబంహిణో కిం ణామహేఓ గిరీ జత్థ అనుభావసోహగ్గమేత్తపరిసేసదూసరసిరీ ముచ్ఛందో తుఏ పరుణ్ణేణ ఓలంబిఓ తరుఅలే అజ్జఉత్తో ఆలిహిదో.

శేన=మిక్కిలివిలపించెడు, త్వయా=నీచే, ఆలంబితః=ధరింపఁబడినవాఁడై, తరు=వృక్షముయొక్క+తలే=మూలప్రదేశమందు, ఆలిఖితః=వ్రాయఁబడి యున్నాఁడు.

లక్ష్మణః:-

శ్లో॥ సోఽయం శైలః కకుభసురభిర్మాల్యవాన్నామ యస్మిన్
నీలః స్నిగ్ధః శ్రయతి శిఖరం నూతన స్తోయవాహః ।
ఆర్యేణాస్మిన్ ... —

ల:-అర్థ:- యస్మిన్ = ఏపర్వతమునందు, నీలః = నల్లనైనట్టియు, స్నిగ్ధః=నేత్రానందంబొసంగునట్టియు, నూతనః=క్రొత్తదియగు, తోయవాహః=జలధరము, శిఖరం=శిఖరమును, శ్రయతి=ఆశ్రయించుచున్నదో, సః=ఆ, కకుభ=సాలపుష్పములయొక్క+సురభిః=సువాసనగల, అయం=ఈ, శైలః=పర్వతము, మాల్యవాన్+నామ=మాల్యవంతమనునది.

ఆర్యేణ=ఆర్యపుత్రునిచే, అస్మిన్=ఇందు ... —

తా॥ మెండుకొన్న సుందరములౌ నల్లని క్రొక్కారు మబ్బులచే నావరింపఁబడిన శిఖరములుగల్గి కకుభసుమములచేఁ బరిమళించు నీపర్వతము మాల్యవంతముసుమా ; ఇచట మాఅన్నగారిచే

రామః:- ... విరమ విరమాతఃపరం న క్షమోఽస్మి
ప్రత్యావృత్తః స పునరివ మే జానకీవిప్రయోగః॥

రా:-అర్థ:- విరమ+విరమ = ఆగుము ఆగుము; అతః+పరం = దీనికిఁదరువాతిసంగతి, న+క్షమః = (వినుటకు) సమర్థుఁడఁగాను, సః=ఆ, జానకీ=సీతాదేవియొక్క+విప్రయోగః=విరహము, మే = నాకు, పునః = మగుడ, ప్రత్యావృత్తః+ఇవ=ప్రాప్తించినటులనున్నది.

తా॥ తమ్ముఁడా ! అంతటితో సాగుము; పైసంగతి నుడువకుము; దాని వినఁజాలకున్నాను; జానకీవియోగావస్థ మరలఁ దటస్థించినంతగా విషాద మేర్పడుచున్నది.

లక్ష్మణః:– అతఃపర మార్యస్య తత్రభవతాం కపీనాం రాక్షసానాం చాపరిసంఖ్యా న్యుత్తరోత్తరాణి కర్మాశ్చర్యాణి. పరిశ్రాంతా చేయమార్యా; త ద్విజ్ఞాపయామి విశ్రామ్యతామితి.

లక్ష్మణుఁడు:– అతః+పరం = పిదప, ఆర్యస్య = ఆర్యపుత్రుని యొక్కయు, తత్రభవతాం=పూజ్యులగు, కపీనాం=వానరులయొక్కయు, రాక్షసానాం+చ = రాక్షసులయొక్కయు, అపరిసంఖ్యాని = లెక్కకు మీరిన, ఉత్తర – ఉత్తరాణి = ఒకదానికన్న నింకొకటి ప్రకృష్టమైనట్టి, కర్మ–ఆశ్చర్యాణి=చిత్రకృత్యములు, (సన్తి=కలవు.) ఇయం+ఆర్యా+చ= ఈయార్యురాలగు సీతయు, పరిశ్రాంతా=అలసియున్నది. తత్ =అందువలన, విశ్రామ్యతాం=విశ్రమింపఁజేయఁబడును గాక; ఇతి=అని, విజ్ఞాపయామి= మనవిచేయుచున్నాఁడ.

‡ సీతా:– ఆర్యపుత్ర ఏతేన చిత్రదర్శనేన ప్రత్యుత్పన్న దోహలాయా మమ విజ్ఞాపనీయ మస్తి.

సీత:– ఆర్యపుత్ర=ఓఆర్యపుత్రా ! ఏతేన=ఈ, చిత్ర=చిత్తరువు యొక్క+దర్శనేన=చూచుటచే, ప్రత్యుత్పన్న = ఉద్భవించిన+దోహలాయాః=మనోరథముకల, మమ=నాకు, విజ్ఞాపనీయం=మనవి సేయఁదగిన సంగతి, అస్తి=కలదు.

రామః:– న న్వాజ్ఞాపయ.

---

‡ అజ్జఉత్త ఏదిణాచిత్తదంసణేణ పచ్చుప్పణ్ణదోహలాఏ మఏ విణ్ణావణిజ్జం అత్థి.

రా:— నను=మంచిది, ఆజ్ఞాపయ=ఆజ్ఞాపింపుము.

† సీతా:— జానే పునరపి ప్రసన్నగంభీరాసు వనరాజిషు విహృత్య పవిత్రనిర్మల శిశిరసలిలాం భగవతీం భాగీరథీం అవగాహిష్యే ఇతి.

సీత:— పునః + అపి=మరల, ప్రసన్న=ప్రశాంతములైనట్టియు + గంభీరాసు = గంభీరములైనట్టియు ( చొరనలవికానట్టియు ) వన—రాజిషు = వనవీథులయందు, విహృత్య=విహరించి, పవిత్ర—నిర్మల—శిశిర=పవిత్రమైనట్టియు—నిర్మలములైనట్టియు—చల్లనైనట్టియు + సలిలాం = ఉదకములుగల, భగవతీం=పూజ్యయగు, భాగీరథీం = గంగానదిని, అవగాహిష్యే = అవగాహనస్నానమొనర్తు, ఇతి=అని, జానే=తెలియుచున్నాను.

రామః:— వత్స లక్ష్మణ !

రాముఁడు:— వత్స=కుఱ్ఱఁడా ! లక్ష్మణ=లక్ష్మణా

లక్ష్మణః:— ఏషోఽస్మి

ల:— ఏషః + అస్మి=ఇదిగో సిద్ధముగానున్నాను.

రామః:— వత్స ! ‘ అచిరాదేవ సంపాదనీయో దౌహృద’ ఇతి సంప్రత్యేవ గురుభి స్సందిష్టం ; త దస్ఖలితసంపాతం రథ ముపస్థాపయ.

రాముఁడు:— వత్స = వత్సా ! దౌహృదః = అభిలాష, ( వేవిళ్ళు ) అచిరాత్ + ఏవ= వెనువెంటనే, సంపాదనీయః=నెఱవేర్పఁదగినది ; ఇతి= అని, సంప్రతి + ఏవ = ఇపుడే, గురుభిః = గురుజనంబుచే, సందిష్టం = సందేశింపఁబడినది. తత్=అందువలన, అస్ఖలిత=తొట్రుపాటులేని + సంపాతం=గమనముగల, రథం=రథమును, ఉపస్థాపయ=కొనిరమ్ము.

---

† జాణే పుణోవి పసణ్ణగంభీరాసు వణరాఈసు విహరిఅ పవిత్తణిమ్మలసిసిరసలిలం భఅవదిం భాఈరహిం ఓగాహిస్సంతి.

• సీతా:— ఆర్యపుత్ర యుష్మాభి ర ప్యాగంతవ్యం.

సీత:— ఆర్యపుత్ర = ఆర్యపుత్రా, యుష్మాభిః + అపి + ఆగంతవ్యం = తాముగూడ రావలయు.

రామః:— అతికఠినహృదయే ఏతదపి వక్తవ్యం.

రాముఁడు:— అతి-కఠిన=మిగులఁగఠినమైన + హృదయే = హృదయముగలదానా, ఏతత్ + అపి=ఇదికూడ, వక్తవ్యం=చెప్పవలయునా ?

⸙ సీతా:— తేన హి ప్రియం మే ప్రియం.

సీత:— తేన + హి=అటులైనచో, ప్రియం=ఇష్టమే, మే = నాకు, పియం=ఇష్టమే.

లక్ష్మణః:— యదాజ్ఞాపయ త్యార్యః ( ఇతి నిష్క్రాంతః)

ల:— ఆర్యః=ఆర్యులగుతమరు, యత్ + ఆజ్ఞాపయతి=ఆజ్ఞాపించినట్లే ( ఇతి=అని, నిష్క్రాంతః=మరలిపోవును )

రామః:— ప్రియే ! వాతాయనోపకంఠే సంవిష్టా భవ.

రా:— ప్రియే=ప్రియురాలా ! వాతాయన = గవాక్షముయొక్క + ఉపకంఠే=సమీపమందు, సంవిష్టా + భవ=శయనించుదానవుకమ్ము.

† సీతా:— ఏవం భవతు అపహృతాస్మి పరిశ్రమనిద్రయా.

సీత:— ఏవం=ఇట్లు, భవతు=కానిమ్ము, పరిశ్రమ=ప్రయాసవలని + నిద్రయా=నిద్రచే, అపహృతా + అస్మి=అపహరింపఁబడుచుంటి.

రామః:— తేన హి నిరంతర మవలంబస్వ మా మనుగమనాయ.

---

• అజ్జఉత్త తుహ్మేహిం వి ఆఅందవ్వం ⸙ తేణ హి పిఅం మే పిఅం. † ఏవ్వం హోదు ఓహారిదహ్మి పరిస్సమణిద్దాఏ.

శ్లో॥ జీవయన్నివ ససాధ్వసశ్రమ
స్వేదబిందు రధికంఠ మర్ప్యతాం
బాహు రైందవమయూఖచుంబిత
స్యందిచంద్రమణిహారవిభ్రమః ॥ 38

( తథా కారయన్ సానందం ) ప్రియే ! కిమేతత్ ?

రా:— తేన+హి = అటులైన, అనుగమనాయ = (నిద్రయొక్క) ప్రాప్తికొఱకై, మాం=నన్ను, నిరంతరం=గాఢముగా, అవలంబస్వ=ఆలింగన మొనర్పుము.

అర్థ:— సాధ్వస= ( శూర్పణఖాది చిత్రప్రతిమాదర్శనముచేఁగల్గిన ) భయమువలని+శ్రమ=శ్రమచే (కలిగిన) + స్వేద—బిందుః=ఘర్మబిందువులు కలదికనుక నే, ఐందవ=చంద్రసంబంధమగు+మయూఖ = కిరణములచే+చుంబిత=స్పృశింపఁబడినదై+స్యంది = స్రవించుచున్న+చంద్ర—మణి=చంద్రకాంతమణులయొక్క+హార=మాలయొక్క+విభ్రమః=శోభవంటిశోభగల, బాహుః = (నీయొక్క) భుజము, జీవయన్+ఇవ=జీవింపఁజేయుచున్నదివలెనున్నది; అధికంఠం = నాకంఠమున, అర్ప్యతాం=ఉంచఁబడుఁగాక.

తా॥ భయముచేతను, బడలికచేతను జెమర్చి, చంద్రకిరణస్పర్శచేఁ జెమ్మగిలిన చంద్రకాంతమణిహారమా యనఁదగియుండు నీబాహువును నా ప్రాణములు లేచివచ్చునట్లు కొంచెము నా మెడపైఁ బడవేయుము.

( తథా=అట్లు, కారయన్ = చేయించుచు, సానందం = ఆనందముతోఁగూడునటుల ) ప్రియే=ప్రేయసీ ! కిం+ఏతత్=ఇదేమి ?

రామః:— శ్లో॥ వినిశ్చేతుం శక్యో న సుఖమితి వా దుఃఖమితి వా
ప్రమోహో నిద్రా వా కిము విషవిసర్పః కిము మదః

తవ స్పర్శే స్పర్శే మమ హి పరిమూఢేంద్రియగణో
వికారశ్చైతన్యం భ్రమయతి చ సంమీలయతి చ॥

రా:—అర్థః— ( ఏతత్ = ఇది = నాచేఁ బ్రస్తుత మనుభవింపఁబడుచున్నది ) సుఖం+ఇతి+వా=సుఖమనిగాని, దుఃఖం+ఇతి+వా = దుఃఖమనిగాని; ప్రమోహః+వా=మైకమనిగాని, నిద్రా+వా=నిద్రయనిగాని; విష=విషముయొక్క+విసర్పః+కిము=ప్రసారమనిగాని, మదః+కిము = (మద్యసంబంధమగు) మత్తుఅనిగాని; వినిశ్చేతుం = నిశ్చయించుటకు, న + శక్యః = శక్యముగాకున్నది; తవ = నీయొక్క; స్పర్శే+స్పర్శే+హి = ప్రతిస్పర్శయందునను, పరిమూఢ=నిశ్చేష్టమగు+ఇంద్రియ—గణః=ఇంద్రియసమూహముగల, వికారః=అంతరావస్థ, మమ = నాయొక్క, చైతన్యం = చిత్తవృత్తిని, భ్రమయతి = ( ప్రతికూలమైనదై ) త్రిప్పివైచుచున్నది, సంమీలయతి+చ = ( అనుకూలమై ) ఉల్లాసముగూర్చుచునున్నది.

తా॥ ఓ ప్రేయసీ ! నీస్పర్శ మెుదవినపుడెల్ల నాకేదియో సర్వేంద్రియసమ్మూర్ఛనొందించు నొకయనిర్వాచ్యవికార ముదయించుచున్నది. అది సుఖమో దుఃఖమో, మోహపారవశ్యమో నిద్రయో, విషప్రసారణమో, మైకమో, యిదమిత్థమని నిర్ణయింపరాక నాయంతరాత్మ నంతలో భ్రమపడుచుచు, నంతలో నుల్లాసపడుచుచు నున్నది.

♦ సీతా:— ధీరప్రసాదా యూయ మత్రేదానీం కి మపరం ?

సీత:— యూయం=మీరు, ధీర=ధీరమగు+ప్రసాదాః=అనుగ్రహముగలవారు, ఇదానీం=ఇపుడు, అత్ర=ఈవిషయమున, కిం+అపరం=వేఱేమియుండు ?

రామః— శ్లో॥ మ్లానస్య జీవకుసుమస్య వికాసనాని
సంతర్పణాని సకలేంద్రియమోహనాని

---

♦ ధీరప్పసాదా తుహ్మే త్తి ఏత్థ దాణిం అచ్చరిఅమ్.

ఏతాని తే సువచనాని సరోరుహాక్షి !
కర్ణామృతాని మనసశ్చ రసాయనాని ॥　　3౮

రా:—అర్థ:— సరోరుహాక్షి = పద్మములవంటి కన్నులుగలదానా ఏతాని=ఈవిధములగు, తే=నీయొక్క, కర్ణ = చెవులకు + అమృతాని = అమృతతుల్యములైన ( శ్రవణసుఖంబులైన ) వచనాని=పల్కులు, సకల-ఇంద్రియ=సమస్తేంద్రియములకు + మోహానాని=మోహముఁగూర్చునట్టివియు, సంతర్పణాని = తృప్తిపఱచునవియు, మనసః = మనస్సునకు, రసాయనాని + చ=రసాయనమైనట్టివియు, గనుకనే, మ్లానస్య = ( సంసారదుఃఖతాపముచే ) వాడఁబారిన, జీవ—కుసుమస్య = జీవితపుష్పముయొక్క, వికాసనాని=వికసింపఁజేయునవియు, ( భవంతి=అగుచున్నవి. )

తా॥ ఓ పద్మాక్షీ ! నీ యీమధురోక్తులు సంసారదుఃఖ తాపంబుచే వాడఁబారినజీవితపుష్పంబును వికసింపఁజేయుచుఁ జెవుల నమృతముఁ జిలుకుచు, మనసునకు రసాయనములై సర్వేంద్రియానందమును గూర్చుచు మిక్కిలి తృప్తిపుట్టించుచున్నవి.

‡ సీతా:-ప్రియంవద ! ఏహి, సంవిశావః ( ఇతి శయనాయ సమంతతో నిరూపయతి. )

సీత:— ప్రియంవద = ప్రియముగుదానిని + వద = పల్కువాఁడా ! ఏహి=రమ్ము, సంవిశావః = విశ్రమింతము ( ఇతి = అని, శయనాయ = పాన్పుకొఱకు, సమంతతః=అంతటు, నిరూపయతి= పరికించుచున్నది. )

రామః:— అయి ! కి మన్వేష్టవ్యం ?

శ్లో॥ ఆవివాహసమయా ద్గృహే వనే
శైశవే తదను యౌవనే పునః

---

‡ పిఅంవద ఏహి సంవిసహ్మ.

స్వాపహేతు రనుపాశ్రితో ఒన్యయా
రామబాహు రుపధాన మేష తే ॥ 38

రా:— అయి = ఓప్రియురాలా ! అన్వేష్టవ్యం = వెదుకఁదగినది, కిం= ఏమియున్నది.

అర్థ:—ఆవివాహ — సమయాత్ = వివాహమైన కాలమునుండియు, శైశవే=బాల్యమున, గృహే=గృహమందునను, తదను=అటుపై, పునః= మరల, యౌవనే=పడుచుఁదనమున, వనే=అడవియందునను, తే = నీకు, స్వాప=నిద్రకు + హేతుః=కారణభూతమైనట్టియు, అన్యయా=పరకాంతచే, అనుపాశ్రితః = సేవింపఁబడనట్టియు, రామ—బాహుః = రాముని యొక్క—బాహువు, ఏషః = ఇదిగో; ఉపధానం = దిండుగా, ( వర్తతే. )

తా॥ ఓ ప్రేయసీ ! పెండ్లియైనది మొదలుకొని, చిన్నతనమున నింటి యందునను, పిదప యౌవనమున నరణ్యమునందునను శయనోపకరణమె అన న్యాశ్రితమైన యీరామబాహువుండఁగా నీకు వేఱొకదిండుకావలయునా ?

♦ సీతా:— ( నిద్రాం నాటయతి ) అస్త్యేతత్ ఆర్యపుత్ర! అస్త్యేతత్ ( ఇతి స్వపితి )

సీత:—( నిద్రాం=నిద్రపోవుటను, నాటయతి=నటనసేయుచున్నది ) ఏతత్=ఈసంగతి, అస్తి=కలదు; ఆర్యపుత్ర=ఆర్యపుత్రుఁడా ! ఏతత్ = ఇది, అస్తి=కలదు ( నాథా ! మీరుచెప్పినమాట వాస్తవమే ) (ఇతి=అని, స్వపితి=నిద్రించుచున్నది )

రామః:— కథం ప్రియవచనైవ మే వక్షసి ప్రసుప్తా
( నిర్వర్ణ్య )

♦ అత్థి ఏదం అజ్జఉత్త అత్థి ఏదం.

రా:– కథం=ఎట్లూ ! ప్రియ=ప్రియమగు+వచనా = పల్కులుగల యీమె, మే = నాయొక్క, వక్షసి = వక్షఃస్థలమున, ప్రసుప్తా+ఏవ = నిద్రపోనేపోయినదే ( నిర్వర్ణ్య=నిదానించిచూచి )

శ్లో॥ ఇయం గేహే లక్ష్మీ రియ మమృతవర్తి ర్నయనయో
రసా వస్యాః స్పర్శో వపుషి బహుల శ్చందనరసః
అయం బాహుః కంఠే శిశిరమసృణో మౌక్తికసరః
కి మస్యా న ప్రేయో యది పర మసహ్యస్తు విరహః ॥

అర్థ:–ఇయం = ఈమె, గేహే = ( నాయొక్క ) గృహమందు, లక్ష్మీః=భాగ్యదేవత, ఇయం=ఈమె, నయనయోః = నేత్రములయందు, అమృతవర్తిః=అమృతమయమగువత్తి, అస్యాః = ఈమెయొక్క, అసౌ= ఈ, స్పర్శః=తాకుడు, వపుషి = ( నాయొక్క ) దేహమందు, బహులః= ఎక్కువగు, చందన–రసః=మంచిగంధపు రసము; అయం=ఈ, బాహుః= భుజము, కంఠే=గళమందు, శిశిర=చల్లనైనట్టియు+మసృణః=సుతిమెత్త నైనట్టియు, మౌక్తిక–సరః=ముత్యాలహారము; అస్యాః = ఈమెయొక్క ( ఈమెకుసంబంధించిన ) కిం = ఏసంగతి, న+ప్రియః = ప్రియమైనది కాదు ? యది = పక్షాంతరమున, విరహః+తు = ఎడబాటైతే, పరం+ అసహ్యః=మిక్కిలి సహింపనలవికానిది.

తా॥ ఈచెలియ, అస్మద్గృహసౌభాగ్యదేవత; నానేత్రములయం దమృతపు వత్తివలె సుఖమొసంగుచున్నది; మైనలందినచందనరసంబువలెను నీమె స్పర్శ నాశెమ్మేనంబున కమితానందము గూర్చుచున్నది; నాకంఠమునం బెనవైచిన యీమెచేయి చల్లనై సుతిమెత్తనగు ముత్యాలహారమువలె నొప్పిదమంబై యున్నది; ఇంతయేల, ఈమెతో నెడబాటొక్కటిమాత్రి నసహ్యం బదుస్సహమైయుండుఁగాని, ఏతత్సంబంధమగు నన్యంబెద్ది యానందదాయకమై యుండకుండు ? ) ←

( ప్రవిశ్య )

♦ ప్రతీహారీ:— దేవ ! ఉపస్థితః.

( ప్రవిశ్య = ప్రవేశించి )

ద్వారపాలకురాలు:—దేవ=స్వామీ ! ఉపస్థితః=అరుదెంచె.

రామః:— అయి కః ?

రాముఁడు:— అయి=ఓసీ ! కః=ఎవరు ?

❡ ప్రతీహారీ:— ఆసన్నపరిచారకో దేవస్య దుర్ముఖః.

ద్వా:— దేవస్య=దేవరవారియొక్క, ఆసన్న = సమీపవర్తియగు+పరిచారకః=సేవకుఁడౌ, దుర్ముఖః=దుర్ముఖుఁడనువాఁడు.

రామః:— (స్వగతం) శుద్ధాంతచారీ దుర్ముఖః స మయా పౌరజానపదే ష్వపసర్పః ప్రహితః. ( ప్రకాశం ) ఆగచ్ఛతు.

రా:— (స్వగతం=తనలో) శుద్ధాంత=అంతఃపురమందు+సంచారీ=సంచారముగల, దుర్ముఖః=దుర్ముఖుఁడా ! సః = వాఁడు, మయా = నాచే, పౌర = పురవాసులయందునను+జానపదేషు = పల్లెలవసించువారియందునను, అపసర్పః=గూఢచారిగా, ప్రహితః=పంపఁబడెను. ( ప్రకాశం = ప్రకాశముగా ) ఆగచ్ఛతు (లోనికి) వచ్చుఁగాక.

( ప్రతీహారీ నిష్క్రాంతా )

( ప్రతీహారీ=ద్వారసేవకురాలు, నిష్క్రాంతా = వెడలెను. )

( ప్రవిశ్య ) ( ప్రవిశ్య=ప్రవేశించి )

† దుర్ముఖః:— ( స్వగతం ) హా కథ మిదానీం దేవీమంతరే ణేదృశ మచింతనీయం జనాపవాదం దేవస్య కథయిష్యామి ; అథవా నియోగః ఖలు మమ మందభాగధేయ స్యైషః.

---

♦ దేవ ఉవట్ఠిదో. ❡ ఆసణ్ణపరిఆరఓ దేవస్స దుమ్ముహో. † హా కహం దాణిం దేవీమంతరేణ ఈరిసం అచింతణిజ్జం జణాపవాదం దేవ్వస్స

దుర్ముఖుఁడు:— ( స్వగతం=తనలో ) హా=అయ్యో ! దేవీం+అంతరేణ=సీతాదేవి మధ్యనుండఁగా, ఈదృశం=ఇట్టి, అచింతనీయం=చింతింపనశక్యమగు, జన—అపవాదం=లోకనిందను, దేవస్య=దేవరవారికి, ఇదానీం=ఇపుడు, కథం=ఎట్లు, కథయిష్యామి = చెప్పఁగలను. అథవా = కానిచో, మంద—భాగధేయస్య=మందభాగ్యుఁడనగు, మమ=నాకు, నియోగః=ఆజ్ఞ, ఏషః+ఖలు=ఇదియేకదా.

• సీతా:— ( ఉత్స్వప్నాయతే ) ఆర్యపుత్ర కుత్రాసి ?

సీత:— ( ఉత్స్వప్నాయతే = కలవరించుచున్నది ) ఆర్యపుత్ర = ఓయీఆర్యపుత్రా ! కుత్ర+అసి=ఎచటనున్నాఁడవు ?

రామః:— సేయమేవ రణరణకదాయినీ చిత్రదర్శనా ద్విరహభావనా దేవ్యాః స్వప్నోద్వేగం కరోతి. ( సస్నేహమంగ మస్యాః పరామృశన్ )

రా:— చిత్ర=చిత్తరువుయొక్క+దర్శనాత్=కాంచుటవలన, రణరణకదాయినీ=ఉద్వేగముకలిగించెడి, యా=ఏ,విరహ—భావనా = వియోగశంకగలదో, సా = ఆ, ఇయం+ఏవ = ఇదియే ( ఈవియోగశంకయే ) దేవ్యాః=సీతాదేవికి, స్వప్న=కలయందు+ఉద్వేగం=కలఁతను, కరోతి=కలిగించుచున్నది; (సస్నేహం=అనురాగపూర్వకముగ, అస్యాః=ఈమెయొక్క, అంగం=శరీరమును, పరామృశన్=నిమురుచు )

శ్లో॥ అద్వైతం సుఖదుఃఖయో రనుగతం సర్వాస్వవస్థాసు యద్విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్నహార్యో రసః

కహంఇస్సం అహవా ణిఓఓ క్ఖు మహ మందభాఅహేఅస్స ఏసో.

• అజ్జఉత్త కహింసి.

కాలే నావరణాత్యయా త్పరిణతే యత్ప్రేమసారే స్థితం .
భద్రం తస్య సుమానుషస్య కథమ ప్యేకం హి త త్ప్రార్థ్యతే॥

అర్థః— యత్=ఏదాంపత్యము, సుఖ—దుఃఖయోః=సుఖదుఃఖముల యందు, అద్వైతం = ఏకరూపమైనది; గనుకనే, సర్వాసు = సమస్తమైన, అవస్థాసు=దశలయందు ( సంపత్తులయందు విపత్తులయందు ) అనుగతం = కూడివర్తిలునట్టిదో; యత్ర=ఏదాంపత్యమునందు, హృదయస్య=( సంసార క్లేశబాధితమగు ) మనస్సునకు, విశ్రామః = విశ్రాంతి ( భవతి = కలుగు చున్నదో ) యస్మిన్ = ఏదాంపత్యమునందు, జరసా = ముసలితనముచే, రసః=ఆహ్లాదము, న+హార్యః=తొలఁగింపఁదగినదికాదో; యత్ = ఏదాంప త్యము, కాలేన=కాలానుసారముచే, ఆవరణ = ( సంకోచముమొదలగు ) ఆచ్ఛాదనముయొక్క ( లజ్జయొక్క ) ( అని యొకయర్థము ) వివాహము మొదలుకొని ( అని వేఱొకయర్థము ) + అత్యయాత్=తొలఁగుటవలన ( అని యొకయర్థము ) .జీవితాంతమువఱకు ( అని మఱొకయర్థము ) పరి ణతే=పరిపాకదశనొందిన, ప్రేమ—సారే=అనురాగముయొక్క సారమందు, స్థితం=ఉన్నదియో, తస్య=అట్టి ( విలక్షణమైన ) సుమానుషస్య=దాంపత్య మునకు, తత్ =అప్రసిద్ధమైనట్టియు, ఏకం=ముఖ్యమైనట్టియు, భద్రం=మంగ ళము, కథం+అపి+హి=సర్వప్రకారములచేతను, ప్రార్థ్యతే=అభిలషింపఁ బడుచున్నది.

తా॥ దాంపత్యము సుఖదుఃఖాది సర్వావస్థలయందును భేదములేక యనుగమించును. హృదయమున కది విశ్రాంతిస్థానము. అది ముదిమియందైనను దొలఁగఁబోని రసాతిశయము గలిగియుండును. కాలముగడచుకొలఁ దియు సిగ్గుతొలఁగి యది పరిణతమైనప్రేమసారమున నిల్చును; గాన దానికి సర్వదా యొక్లెని మంగళ మగుఁగాక యని యభిలషింపఁదగు.

। దుర్ముఖః:— ( ఉపసృత్య ) జయతు దేవః.

దు:— ( ఉపసృత్య=సమీపించి ) దేవః=ప్రభువు, జయతు=జయశీలుఁడగుఁగాక.

రామః:— బ్రూహి య దుపలబ్ధం.

రా:—యత్=ఏసంగతి, ఉపలబ్ధం=సంగ్రహింపఁబడినదో, తత్=దానిని, బ్రూహి=చెప్పుము.

‡ దుర్ముఖః:— ఉపస్తువంతి దేవం పౌరజానపదా యథా విస్మారితా వయం మహారాజం దశరథం రామదేవేనేతి.

దు:— వయం = మేము, మహారాజం=మహారాజగు, దశరథం=దశరథుని, రామ—దేవేన = రామప్రభునిచే, విస్మారితాః=మఱచిపోవునటులఁజేయఁబడితిమి, ఇతి+యథా=అనుట యెటులో, (తథా=ఆప్రకారము,) పౌర=పురవాసులును+జానపదాః=పల్లెలనుండువారును, దేవం=దేవరవారిని, ఉపస్తువంతి=కొనియాడుచున్నారు.

రామః:— అర్థవాద ఏవైషః. దోషం తు మే కథంచిత్కథయ యేన సః ప్రతివిధీయతే.

రా:— ఏషః=ఇది, అర్థవాదః+ఏవ=పొగడ్తయే; దోషం+తు=దోషము నన్ననో, కథంచిత్=ఎట్లయినను, మే=నాకు, కథయ=చెప్పుము, యేన=ఏ తెల్పుటచే, సః=ఆదోషము, ప్రతివిధీయతే = నివర్తింపఁబడునో.

† దుర్ముఖః:— ( సాస్రం ) శృణోతు మహారాజః. (కర్ణే ఏవమితి. )

---

। జేదు దేవో. ‡ ఉవట్టువంతి దేవం పోరజాణపదా జహా విసుమరిదా అహ్మే మహారాఅం దసరహం రామదేవ్వేణే త్తి.

† సుణాదు మహారాఓ ఏవ్వం విఅ ఇతి.

దు:- ( సాస్రం=కన్నీటితో ) మహారాజః=ప్రభువు, శృణోతు=వినుఁగాక; ( కర్ణే = చెవిలో ) ఏవం = ఇట్లు, ఇతి = అని, కథయతి = చెప్పుచున్నాఁడు.

రామః:- అహహ ! అతితీవ్రోఽయం వాగ్వజ్రః.

( ఇతి మూర్ఛతి. )

రా:- అహహ=అయ్యయ్యో ! అయం=ఈ, వాక్=పల్కనెడి+వజ్రః=వజ్రాయుధము, అతి-తీవ్రః = మిక్కిలితీక్ష్ణమైనది ( ఇతి=అని, మూర్ఛతి=మూర్ఛఁజెందుచున్నాఁడు. )

♦ దుర్ముఖః:- ఆశ్వసితు దేవః.

దు:- దేవః=ప్రభువు, ఆశ్వసితు=ఊఱడిలుఁగాక.

రామః:- ( ఆశ్వస్య )

శ్లో॥ హా హా ధి క్పరగృహవాసదూషణం య
ద్వైదేహ్యాః ప్రశమిత మద్భుతై రుపాయైః
ఏత త్తత్పునరపి దైవదుర్విపాకా
దాలర్కం విషమివ సర్వతః ప్రసక్తం ॥ ౪౦

రా:- ( ఆశ్వస్య=ఊఱడిలి. )

అర్థ:- హా ! హా ! = అయ్యయ్యో ! ధిక్ = ఛీ, వైదేహ్యాః = సీతాదేవియొక్క, యత్=ఏ, పర-గృహ = ఇతరుని-యింటియందు+వాస=నివాసమువలని+దూషణం=దూషణము, అద్భుతైః=అసామాన్యములగు, ఉపాయైః=ఉపాయములచే+ప్రశమితం=శాంతిచేయఁబడినదో, తత్=ఆ, ఏతత్=ఇదియే, దైవ=భగవంతునియొక్క+దుర్విపాకాత్=దుష్పరిపాకమువలన, పునః+అపి = మెండియు, ఆలర్కం = పిచ్చికుక్క

♦ ఆస్ససదు దేవో.

సంబంధమగు, విషం+ఇవ=విషమువలె, సర్వతః=అంతటు, ప్రసక్తం= ప్రాఁకినది.

తా॥ ఛీ! ఛీ! జానకినిగూర్చిన యీ పరగృహవాసదూషణ మట్లప్పు డద్భుతోపాయములచే నిశ్శేషముగ నివర్తింపఁ జేయఁబడియును మరల నిప్పుడు దైవానుగ్రహము తారుమారగుటచేఁ బిచ్చికుక్కవిషము వలె నెల్లెడల వ్యాపించిపోయెఁగదా.

తత్ కి మద్య మందభాగ్యః కరోమి. (విమృశ్య సకరుణం) అథవా కిమన్యత్.

శ్లో॥ సతాం కేనాపి కార్యేణ లోకస్యారాధనం వ్రతం
తత్ప్రతీతం హి తాతేన మాం చ ప్రాణాంశ్చ ముంచతా॥

తత్=దానఁజేసి, అద్య=ఇపుడు, మంద-భాగ్యః = అదృష్ట విహీనుఁడ నగునేను, కిం+కరోమి=ఏమిచేయుదు; (విమృశ్య = విమర్శించి, సకరుణం=దైన్యముతోఁగూడునట్లు,) అథవా=కానిచో, కిం+అన్యత్= వేఱేమున్నది;

అర్థః- కేన+అపి+కార్యేణ=ఎట్టిపనిచేతనైనను, (ఎట్టిదుష్కరమగు కార్యమొనర్చియైనను) లోక=ప్రజలయొక్క+ఆరాధనం = సేవ చేయుట, సతాం=సత్పురుషులకు, వ్రతం = వ్రతము; తత్ = ఆవ్రతము, మాం+చ=నన్నున్నూ, ప్రాణాన్+చ=ప్రాణములనున్నూ, ముంచతా =విడిచెడు, పిత్రా = (నా) తండ్రియగు దశరథునిచే, ప్రతీతం+హి= ప్రకటింపఁబడినది గదా.

తా॥ ఎట్టిపరిస్థితులయందైనను, ఎట్టిదుష్కరకార్యాచరణంబుచేతనైనను, నాకు లోకారాధనమొనర్చుటయే ముఖ్యధర్మము; ఈవిషయంబున వేఱ విచారింపఁబనిలేదు; ధర్మబద్ధులై నన్నేగాక నిజప్రాణంబులఁగూడఁ గోల్పోయిన మాతండ్రిగారే నాకిందుకు మార్గదర్శకులు.

సంప్రత్యేవ భగవతా వసిష్ఠేన సందిష్టం. అపి చ.

శ్లో॥ యత్సావిత్రైర్దీపితం భూమిపాలై
ర్లోకశ్రేష్ఠైః సాధు శుద్ధం చరిత్రం
మత్సంబంధాత్కశ్మలా కింవదంతీ
స్యాచ్చేదస్మిన్ హంత ధిఙ్మామధన్యం॥ ४३

రా:— సంప్రతి + ఏవ=ఇపుడే, భగవతా=పూజ్యుఁడగు, వసిష్ఠేన= వసిష్ఠునిచే, సందిష్టం=ఆజ్ఞాపింపఁబడినది; అపి + చ=అంతియకాక..

అర్థ:— లోక—శ్రేష్ఠైః = పురుషశ్రేష్ఠులైనట్టియు, సావిత్రైః = రవివంశంబున జన్మించినట్టియు, భూమి—పాలైః = రాజులచే, యత్= ఏ, శుద్ధం=పరిశుద్ధమగు, చరిత్రం=చరిత్ర, సాధు = బాగుగా, దీపితం= ప్రకాశింపఁజేయఁబడినదియో, అస్మిన్=దీనియందు, మత్=నాయొక్క+ సంబంధాత్=సంపర్కమువలన, కశ్మలా = మాలిన్యముతోఁగూడిన, కింవదంతీ = జనులపలుకు, స్యాత్ + చేత్ = కల్గునేని; హంత = అయ్యో! అధన్యం=దురదృష్టవంతుఁడనగు, మాం=నన్నుఁగూర్చి ధిక్=ఛీ.

తా॥ సూర్యునిదొట్టి లోకశ్రేష్ఠులగు నస్మద్వంశీయ మహారాజులు తామొనర్చిన ఘనకార్యములచేతను, దమపవిత్రజీవితములచేతను, బ్రకాశింపఁ జేసిన చిత్రచారిత్రమునందు, నేఁటికి నావలన నీచాతినీచమగు నొక కింవదంతిగలుగుచే తటస్థించునేని, గటకటా! నేనెంతటిపతితాధముఁడ నని తలంపవలెను ?

రామః:— హా దేవి ! దేవయజనసంభవే! హా ! స్వజన్మానుగ్రహపవిత్రితవసుంధరే ! హా ! నిమిజనకనందిని ! హా పావకవశిష్ఠారుంధతీప్రశస్తశీలశాలిని ! హా రామమయ

జీవితే ! హా మహారణ్యావాస ప్రియసఖి ! హా ప్రియ స్తోక వాదిని ! కథ మేవంవిధాయా స్తవేదృశః పరిణామః.

రా:— హా=అయ్యో, దేవి=దేవీ, దేవ=దేవతలయొక్క+యజన=యాగప్రదేశమే+సంభవే=ఉత్పత్తిస్థానముగాఁగలదానా, హా=అయ్యో, స్వ=స్వకీయమైన+జన్మ = పుట్టుకయనెడు+అనుగ్రహ = అనుగ్రహముచే+పవిత్రిత=పవిత్ర మొనర్పఁబడిన+వసుంధరే = భూమికలదానా; హా=అయ్యో, నిమి=నిమియనువానికిని (ఇతఁడుజనకవంశకర్త)+జనక=జనకమహారాజునకును+నందిని = ఆనంద మొసంగుదానా, హా=అయ్యో, పావక = అగ్నిహోత్రునిచేతను+వశిష్ఠ = వశిష్ఠునిచేతను+అరుంధతీ = అరుంధతీదేవిచేతను+ప్రశస్త = బాగుగఁగొనియాడఁబడిన+శీల=స్వభావముచే+శాలినీ=కూడినదానా ! హా=అయ్యో ! రామమయ=రాముని యందే యాధారపడిన+జీవితే = జీవితముగలదానా ! హా = అయ్యో, మహారణ్య = (దండకయను) మహారణ్యమందు+వాస = నివాసమున+ప్రియ=ఇష్టమగు+సఖీ = సహచరివై వర్తించినదానా ! హా = అయ్యో, ప్రియ=ఇష్టమగుదానిని+స్తోక=మితమగుదానిని+వాదిని=పల్కుదానా ! ఈదృశః=ఇట్టి, పరిణామః = చరమదశ, ఏవంవిధాయాః=ఇటువంటిదానవగు, తవ=నీకు, కథం=ఎట్లు ?

రామః:—

శ్లో॥ త్వయా జగంతి పుణ్యాని త్వ య్యపుణ్యా జనో క్తయః
నాథవంత స్త్వయా లోకా స్త్వ మనాథా విపత్స్యసే ॥

రా:—అర్థ:—త్వయా=నీచే, జగంతి = లోకములు, పుణ్యాని = పవిత్రత నొందినవి; త్వయి=నీయందు, జన = జనులయొక్క+ఉక్తయః= పలుకులు, అపుణ్యాని=అపావనములు; త్వయా=నీచే, లోకాః=లోకములు,

నాథవంతః = సనాథములైనవి; త్వం=నీవు, అనాథా = అనాథురాలవై (శరణులేనిదానవై) విపత్స్యసే=ఖేదముపొందఁగలవు.

తా॥ నీవలన భువనంబు లన్నియుఁ బావనములైనవికాని ప్రజల వాక్కులు నీయందపావనంబులై వరలుచున్నవి; నీవలన లోకములన్నియు సనాథంబులై మెలంగుచున్నవి గాని, నీవన్ననో యనాథవై విలవింప వలసియున్నది.

రామః:— (దుర్ముఖం ప్రతి) దుర్ముఖ! బ్రూహి. లక్ష్మణం ఏషః నూతనో రాజా రామః సమాజ్ఞాపయతి (కర్ణే) ఏవ మేవ మితి.

రా:— (దుర్ముఖం+ప్రతి = దుర్ముఖునిగూర్చి) దుర్ముఖ = ఓరీ దుర్ముఖుఁడా! లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి, బ్రూహి=చెప్పుము; ఏషః= ఇడుగో, నూతనః = క్రొత్తవాఁడగు, రామః+రాజా = రామరాజు, సమాజ్ఞాపయతి = ఆజ్ఞాపించుచున్నాఁడు; (కర్ణే = చెవియందు) ఏవం+ ఏవం=ఇట్లు—ఇట్లు, ఇతి=అని.

♦ దుర్ముఖః:— హా కథ మగ్నిపరిశుద్ధాయా గర్భస్థిత పవిత్రసంతానాయా దేవ్యా దుర్జనవచనా దిదం వ్యవసితం దేవేన.

దు:— హా = అయ్యో! అగ్ని = అగ్నిహోత్రమునందు+పరిశుద్ధా యాః=పరిశుద్ధురాలైనట్టియు, గర్భ=గర్భమందు+స్థిత=ఉన్న+పవిత్ర= పావనమగు+సంతానాయాః=సంతానముగలట్టియు, దేవ్యాః=సీతాదేవికి, దుర్జన—వచనాత్ = దుర్జనులయొక్క—పల్కువలన, ఇదం = ఈవిధము, దేవేన=ప్రభునిచే, కథం=ఎట్లు, వ్యవసితం=చింతింపఁబడినది.

♦ హా కహం అగ్గిపరిసుద్ధాఏ గబ్భట్టిదపవిత్తసంతాణాఏ దేవీఏ దుజ్జణవఅణాదో ఇదం వవసిదం దేవ్వేణ.

రామః:- శాన్తం పాపం, శాన్తం పాపం. దుర్జనాః కథం పౌరజానపదాః.

శ్లో॥ ఇక్ష్వాకువంశోఽభిమతః ప్రజానాం
జాతం చ దైవా ద్వచనీయబీజం
యచ్చాద్భుతం కర్మ విశుద్ధికాలే
ప్రత్యేతు క స్తద్యది దూరవృత్తం ॥　　౭౭

రా:- పాపం = పాపము, శాన్తం = శాంతించుఁగాక; పాపం = పాపము, శాన్తం = శాన్తించుఁగాక; పౌర-జానపదాః = పట్టణమందలి వారును-పల్లెలయందలివారును, దుర్జనాః=దుర్జనులు, కథం=ఎట్లు.

అర్థ:- ఇక్ష్వాకు=ఇక్ష్వాకుయొక్క + వంశః=వంశము, ప్రజానాం= ప్రజలకు, అభిమతః = ఇష్టమైనదియే; దైవాత్ + చ=( మందభాగ్య ) దేవతవలన, వచనీయ=నిందకు + బీజం=విత్తు, ( కారణము ) జాతం = కలిగినది; విశుద్ధి = పరిశుద్ధియొక్క + కాలే=కాలమందు, అద్భుతం = ఆశ్చర్యకరమగు, యత్ + కర్మ + చ = ఏపనియైతేకలదో, దూర = దూరమున ( లంకాపట్టణమునయెచ్చటనో ) + వృత్తం = జరిగిన, తత్ = దానిని, కః=ఎవఁడు, ప్రత్యేతు = నమ్మును.

తా॥ మా యిక్ష్వాకువంశము జనుల కందఱకును గౌరవనీయమైనదియే; కాని యందే యిట్టియపవాదబీజము నేఁటి కుదయించుట దైవికము; మహాసముద్రమధ్యమున నెచటనో లంకయందు సీతాపరిశుద్ధిని బరీక్షించుటకై యామెను నగ్నిప్రవిష్టను గావించితిమని మాలో మేము సంబరపడవలసినదియేగాని, అంతమాత్రమున నిప్పు డిచట నమ్మువాఁడెవఁడు ?

రామః:- త ద్గచ్ఛ.

రా:- తత్ =దానఁజేసి, గచ్ఛ=పొమ్ము.

దుర్ముఖః:— హా దేవి ( ఇతి నిష్క్రాంతః. )

దు:— హా=అయ్యో! దేవి=దేవీ ( ఇతి=అని, నిష్క్రాంతః=వెడలె.)

రామః:— హా కష్టం అతిబీభత్సకర్మా నృశంసోఽస్మి సంవృత్తః.

రా:— హా=అయ్యో! కష్టం=కష్టము; అతి-బీభత్స=మిక్కిలిభయంకరమగు + కర్మ=పనిగల, ( అహం=నేను, ) నృశంసః = ఘాతుకుఁడను, సంవృత్తః + అస్మి=ఐపోతిని.

శ్లో॥ శైశవాత్ప్రభృతి పోషితాం ప్రియాం
సౌహృదా దపృథగాశ్రయా మిమాం
ఛద్మనా పరిదదామి మృత్యవే,
సౌనికే గృహశకున్తికా మివ ॥ ౪౫

అర్థ:— శైశవాత్ + ప్రభృతి = బాల్యమునుండి ( మొదలుకొని,) పోషితాం=పోషింపఁబడినట్టియు, సౌహృదాత్=ప్రేమవశమున, అపృథక్-ఆశ్రయాం=భిన్నాశ్రయ రహితయైనట్టియు, ప్రియాం=ప్రేమాస్పదురాలైనట్టియు, ఇమాం = ( పార్శ్వస్థురాలగు ) ఈమెను, సౌనికే=కసాయివానికొఱకు, గృహ—శకుంతికాం+ఇవ = గృహసంబంధమగు — పక్షినివలెనే, ఛద్మనా=మిషచే ( తపోవనసందర్శననామకమగు సాకుచే ) మృత్యవే = మృత్యుదేవతకొఱకు, పరిదదామి=ఇచ్చుచున్నాను.

తా॥ బాల్యమునుండియుఁ జక్కని పోషణముచే వర్ధిలి యనురాగాతిశయముచే క్షణమైన నన్ను వదలియుండక నాతోఁ బాటెల్లకష్టముల ననుభవించిన యీనాప్రియురాలిని, పెంపుడు పులుఁగును గసాయివానికొసఁగినట్లు తపోవనసందర్శనాదివ్యాజమున మృత్యువున కప్పగించుచున్నాఁడఁ గదా.

రామః:— తత్కి మస్పృశ్యః పాతకీ దేవీం దూషయామి.
( ఇతి సీతాయాః శిరః సమున్నమయ్య బాహు మాకృష్య. )

శ్లో॥ అపూర్వకర్మచండాల మయి ముగ్ధే విముంచ మాం
శ్రితాసి చందనభ్రాంత్యా దుర్విపాకం విషద్రుమం ॥

రా:— తత్ = కాన, అస్పృశ్యః = తాకరానివాఁడనగునట్టియు, పాతకీ=పాతకుఁడనైనట్టియు, ( నేను ) దేవీం=సీతాదేవిని, దూషయామి + కిం=అపవిత్రురాలినిగా నొనర్చుచుంటినా ( ఇతి=అని, సీతాయాః = సీతాదేవియొక్క, శిరః=శిరస్సును, సమున్నమయ్య = ఎత్తి, బాహుం= చేతిని, ఆకృష్య=ఈవలికిలాగికొని. )

అర్థ:— అయి=ఓసీ, ముగ్ధే=అమాయకురాలా, అపూర్వ=అపూర్వ మగు + కర్మ=కర్మగల + చండాలం = చండాలుఁడనగు, మాం = నన్ను, విముంచ=విడువుము; చందన = గంధపుచెట్టనెడి + భ్రాంత్యా=భ్రాంతిచే, దుర్విపాకం=అనర్థదాయకమగు, విష-ద్రుమం=విషవృక్షమును, శ్రితా + అసి=ఆశ్రయించితివి.

తా॥ అవ్యక్తురాలా ! అనర్థావహమగు విషవృక్షమును, మంచి గంధపు మ్రానుగా భ్రమించినట్లు, అపూర్వకర్మచండాలుఁడనగు నన్ను మనః ప్రియుఁడనని భ్రమించి, యేల యింకను బెనవైచికొనియుందువు; విడిచివేయుము.

రామః:— ( ఉత్థాయ ) హన్త ! హన్త ! సంప్రతి విపర్యస్తో జీవలోకః. అద్యావసితం జీవితప్రయోజనం రామస్య. శూన్య మధునా జీర్ణారణ్యం జగత్. అసారః సంసారః. కాష్ఠ ప్రాయం శరీరం. అశరణోఽస్మి. కిం కరోమి. కా గతిః. అథవా.

శ్లో॥ దుఃఖసంవేదనాయైవ రామే చైతన్య మాగతం
మర్మోపఘాతిభిః ప్రాణై ర్వజ్రకీలాయితం హృది ॥ ४८

రా:- ( ఉత్థాయ=లేచి ) హా న్త=అయ్యో ! హా న్త = అహా ! జీవలోకః=ప్రాణికోటి, విపర్యస్తః = వ్యత్యస్తమైనది; రామస్య = రాముని యొక్క, జీవిత=ప్రాణధారణము+ప్రయోజనం=ఫలము, అద్య=ఇపుడు, అవసితం=ముగిసినది; అధునా = ఇపుడు, జగత్ = ప్రపంచము, కీర్ణ = అల్లకల్లోలమగు+అరణ్యం= అరణ్యమైనదిగనుకనే, శూన్యం = శూన్యమై యున్నది; సంసారః=సంసారము, అసారః=సారములేనిది; శరీరం=శరీరము, కాష్ఠ-ప్రాయం = కట్టెవారినది; అశరణః = శరణులేనివాఁడనైతి; కిం=ఏమి, కరోమి=చేయుదును, కా+గతిః=ఏమిగతి; అథవా=కానిపో

అర్థ:- దుఃఖ=దుఃఖముయొక్క+సంవేదనాయ+ఏవ = తెలిసికొనుటకొఱకే, రామే=రామునియందు, చైతన్యం=జ్ఞప్తి, ఆగతం = వచ్చినది; మర్మ=ఆయువుపట్లయందు=ఉపఘాతిభిః=ఘాతకలుగఁజేసెడి, ప్రాణైః = ప్రాణములచే, హృది=హృదయమందు, వజ్రకీలాయితం=వజ్రపుమేకులవలె నాచరింపఁబడినది.

తా॥ దుర్ముఖవాక్యశ్రవణానుపదంబుననే గతించిన నా చైతన్యము మరలఁ గేవలము నేను దుఃఖానుభవమును గ్రహించుటకుమాత్రమే కూడి నటులఁ గన్పట్టుచున్నది; ఎముకయెముకసందునను శూలములతో గ్రుచ్చుచున్న ట్లున్న యీ పాడుప్రాణములు నాశరీరమున వజ్రపుమేకులై స్థిరపడి, తుదకుఁ జావనైనఁ జావనీయకున్నవి.

రామః:- హా అంబ అరుంధతి ! భగవన్తౌ వసిష్ఠవిశ్వామిత్రౌ ! భగవన్ పావక ! హా దేవి భూతధాత్రి ! హా తాత జనక ! హా మాతః ! హా ప్రియసఖ మహారాజ సుగ్రీవ !

సౌమ్య హనూమన్ ! మహోపకారిన్ లంకాధిపతే విభీషణ ! హా సఖి త్రిజటే ! పరిముషితాః స్థ, పరిభూతాః స్థ రామహతకేన—అథవా కో నామ తేషా మహ మిదానీ మాహ్వానే.

శ్లో॥ తే హి మన్యే మహాత్మానః కృతఘ్నేన దురాత్మనా
మయా గృహీతనామానః స్పృశ్యంత ఇవ పాప్మనా ॥

రా:— హా=అయ్యో, అంబ=తల్లీ, అరుంధతీ = అరుంధతీదేవీ, భగవంతౌ=పూజ్యులరగు, వసిష్ఠ—విశ్వామిత్రౌ=వసిష్ఠ—విశ్వామిత్రులారా ! భగవన్=మహాత్ముఁడవగు, పావక=అగ్నిహోత్రుఁడా, హా = అయ్యో, దేవి=దేవీ, భూత—ధాత్రీ = (సమస్త) ప్రాణులధరించుభూదేవీ, హా = అయ్యో, తాత=తండ్రీ, జనక=జనకమహారాజా ! హా=అయ్యో, మాతః= తల్లీ, హా=అయ్యో, ప్రియ—సఖ=ఇష్ట—స్నేహితుఁడా, మహారాజ = మహారాజా, సుగ్రీవ=ఓసుగ్రీవుఁడా, సౌమ్య=సౌమ్యుఁడా, హనూమన్ = హనుమంతా, మహత్—ఉపకారిన్=మహోపకారీ, లంకా—అధిపతే = లంకాధినాథా; విభీషణ=ఓవిభీషణుఁడా, హా=అయ్యో, సఖి=సఖీ, త్రిజటే = త్రిజటా, రామ—హతకేన=పాపిష్ఠి—రామునిచే, పరిముషితాః + స్థ=దొంగిలింపఁబడితిరి, పరిభూతాః + స్థ=తిరస్కరింపఁబడితిరి; అథవా = కానిచో, ఇదానీం = ఇపుడు, తేషాం = వారియొక్క, ఆహ్వానే = పిలుచుటయందు, అహం+కః+నామ=నే నెవఁడను.

అర్థ:— మహాత్మానః=మహాత్ములగు, తే = వారు (ఆవసిష్ఠాదులు) కృతఘ్నేన=చేసినమేలుమఱచినట్టియు, దురాత్మనా=చెడ్డతలంపుగలట్టియు, మయా=నాచే, గృహీత=స్వీకరింపఁబడిన (పిలువఁబడిన) + నామానః= పేర్లుగలవారగుచు, పాప్మనా = మూర్తీభవించినపాపముచే, స్పృశ్యన్తే+ ఇవ+హి=తాకఁబడుచున్నారనియే, మన్యే=తలంచుచున్నాఁడ.

తా॥ దురాత్ముఁడను, కృతఘ్నుఁడను నగు నే నామహాత్ములపవిత్ర నామము లుచ్చరించుటచే వారి నపవిత్రుల నొనర్చుచుంటినని తలంచెద.

రామః:- యోఽహం.

శ్లో॥ విస్రంభా దురసి నిపత్య లబ్ధనిద్రా
మున్ముచ్య ప్రియగృహిణీం గృహస్య లక్ష్మీం
ఆతంకస్ఫురితకఠోరగర్భగుర్వీం
క్రవ్యాద్భ్యో బలిమివ దారుణః క్షిపామి॥ ౪౯

అర్థ:- యః=ఏ, అహం=నేను, గృహస్య=గృహమునకు, లక్ష్మీం=శోభనైయున్నట్టియు, విస్రంభాత్ = నమ్మకమువలన, ఉరసి=వక్షఃస్థలమున, నిపత్య=పడి, లబ్ధ=పొందఁబడిన+నిద్రాం=నిద్రకలట్టియు, ప్రియ=ప్రియురాలగు+గృహిణీం=ఇల్లాలిని, ఉన్ముచ్య=తొలఁగఁజేసి, దారుణః=దయమాలినవాఁడనై, ఆతంక = ( చిత్రపటదర్శన ) భీతిచే + స్ఫురిత = అదరుచున్నట్టియు + కఠోర = ( తొమ్మిదినెలలు నిండి ) పూర్ణమైనట్టియు + గర్భ = గర్భముచే + గుర్వీం = బరువెక్కియున్న యీమెను, క్రవ్యాద్భ్యః = ( సింహాది ) హింసకమృగంబులకు, బలిం + ఇవ = (మాంసము మొ॥) ఆహారపదార్థంబునువలె,క్షిపామి=పాఱవేయుచున్నాఁడ.

తా॥ నాయందించుకేనియు ననుమానంబులేక, మద్వక్షఃస్థలంబునఁ జేరిసుఖనిద్రఁజెందుచున్నట్టియు, నేతద్గృహలక్ష్మియై వెలయుచున్నట్టియుఁ, జిత్రపటదర్శనంబునఁ గలిగిన భీతిచే నదరుచున్న నిండుచూలుగలట్టి, యీనాప్రియురాలిని బరమకౄరుఁడనై ఘాతుకమృగములవాత బలిగాఁ బడఁద్రోయుచున్నాను గదా!

రామః:- ( సీతాయాః పాదౌ శిరసి కృత్వా ) అయం పశ్చిమ స్తే రామశిరసి పాదపంకజస్పర్శః. ( ఇతి రోదితి )

రా:- ( సీతాయాః=సీతాదేవియొక్క, పాదౌ=రెండుపాదములను, శిరసి+కృత్వా=శిరస్సునందుఁ జేర్చి ) రామ=రామునియొక్క + శిరసి=శిరంబునందు, తే = నీయొక్క, పాద-పంకజ = పాదపంకజములయొక్క + స్పర్శః=ముట్టుట, అయం+పశ్చిమః = ఇది+కడసారిది. ( ఇతి = అని, రోదితి=విలపించుచున్నాఁడు )

( నేపథ్యే=తెరయందు )

అబ్రహ్మణ్య మబ్రహ్మణ్యం.

అబ్రహ్మణ్యం + అబ్రహ్మణ్యం = వేదవిరుద్ధము + వేదవిరుద్ధము ( ఎంత యధర్మకార్య మెంత యధర్మకార్యము )

రామః:- జ్ఞాయతాం భోః కి మేతత్.

రా:- భోః=ఓహో, ఏతత్=ఇది, కిం=ఏమి ? జ్ఞాయతాం=తెల్పఁబడుఁగాక.

( పున ర్నేపథ్యే ) ( పునః=మరల, నేపథ్యే=తెఱలో )

శ్లో॥ ఋషీణా ముగ్రతపసాం యమునాతీర వాసినాం
లవణత్రాసితః స్తోమ స్త్రాతారం త్వా ముపస్థితః ॥ ౫౦

అర్థ:- యమునా = యమునానదియొక్క + తీర = ఒడ్డున + వాసినాం=నివసించునట్టియు, ఉగ్ర = భయంకరమగు + తపసాం = తపస్సుగలట్టియు, ఋషీణాం=ఋషులయొక్క, స్తోమః=సమూహము, లవణ=లవణాసురునిచే + త్రాసితః=భయపెట్టఁబడినదై, శరణ్యం = శరణుచొచ్చఁదగిన, త్వాం=నిన్ను, ఉపస్థితః=సమీపించినది.

తా॥ యమునాతీరవాసులై యుగ్రతపస్సంపన్నులగు పలువురు మహర్షులు లవణాసురభయభ్రాంతులై 'రామా నీవే దిక్క'ని వచ్చియున్నారు.

రామః:— కథ మద్యాపి రాక్షసత్రాసః. త ద్యావ దస్య దురాత్మనో మాధురస్య కుంభినసీకుమార స్యోన్మూల నాయ శత్రుఘ్నం ప్రేషయామి. (పరిక్రమ్య పున ర్నివృత్య) హా దేవి ! కథ మేవంవిధా గమిష్యసి. భగవతి ! వసుంధరే ! సుశ్లాఘ్యాం దుహితర మవేక్షస్వ జానకీం.

రా:— కథం = ఎట్లు, అద్య + అపి = ఇప్పుడుకూడ, రాక్షస-త్రాసః=రాక్షసులవలని-భయమా. తత్ + యావత్ =అవుఁగాక; కుంభీనసీ-కుమారస్య = కుంభీనసియను రాక్షసియొక్క — పుత్రుఁడైనట్టియు, మాధురస్య=మధురానాయకుఁడైనట్టియు, దురాత్మనః = దురాత్ముఁడగు, అస్య=ఈలవణాసురునియొక్క, ఉన్మూలనాయ=నాశనముచేయుటకొఱకు, శత్రుఘ్నం=శత్రుఘ్నుని, ప్రేషయామి=పంపెదను. ( పరిక్రమ్య = అరిగి, పునః=మగుడ, నివృత్య=మరలివచ్చి ) హా=అహా ! దేవి=ఓదేవీ ! ఏవం+విధా=ఇట్టిస్థితియందున్న నీవు, కథం + గమిష్యసి=ఎట్లేగఁగలవు. భగవతి=పూజ్యురాలా ! వసుంధరే=భూదేవీ ! సు-శ్లాఘ్యాం=మిక్కిలికొనియాడఁదగిన, దుహితరం = కుమార్తెయగు, జానకీం = సీతాదేవిని, అవేక్షస్వ = వీక్షింపుము.

రామః:—

శ్లో॥ జనకానాం రఘూణాం చ యత్కృత్స్నం గోత్రమంగలం
యాం దేవయజనే పుణ్యే పుణ్యశీలా మజీజనః ॥ ౫౧

రా:—అర్థ:— యత్ =ఏసీతారూపమగువస్తువు, జనకానాం = జనకవంశస్థులకును, రఘూణాం + చ=రఘువంశస్థులకును, కృత్స్నం = సమస్తమగు, గోత్ర-మంగలం=కులమంగళమో, పుణ్యశీలాం=పవిత్రచరిత్రయగు, యాం=ఏసీతను, పుణ్యే=పవిత్రమైన, దేవ-యజనే=దేవతల యజ్ఞభూమియందు, అజీజనః=కంటివో ( అట్టి నీకూఁతురగు సీతను వీక్షింపుము )

తా॥ ఓభూదేవీ! జనకరఘువంశములు రెండిటికిని సమగ్రమంగళరూపు రాలైనట్టియుఁ బరిపూతచరిత్రయైనట్టియు, నీసీతాదేవిని దొల్లి పుణ్యాధ్వరము నందు నీవేకదా కనినదానవు. అట్టి నీబిడ్డను నీవే కనిపెట్టియుండుము.

( ఇతి రుద న్నిష్క్రాంతః )

( ఇతి=ఇట్లని, రుదన్=ఖిన్నుఁ డగుచు, నిష్క్రాంతః=చనియె )

♦ సీతా:– హా సౌమ్య ఆర్యపుత్ర ! కుత్రాసి ( ఇతి సహ సోత్థాయ ) హా ధిక్; హా ధిక్; దుఃస్వప్నరణరణకవిప్రలబ్ధా ఆర్యపుత్రశూన్యమి వాత్మానం పశ్యామి. ( విలోక్య ) హా ధిక్, హా ధిక్, ఏకాకినీం ప్రసుప్తాం మా ముజ్ఝిత్వా కుత్ర గతో నాథః; భవతు, అస్మై కోపిష్యామి యది తం ప్రేక్ష మాణా ఆత్మనః ప్రభవిష్యామి. కోఽత్ర పరిజనః ?

సీత:– హా=అయ్యో, సౌమ్య=సౌమ్యుఁడా, ఆర్యపుత్రా = ఆర్య పుత్రా! కుత్ర=ఎచట, అసి=ఉన్నావు ? ( ఇతి = అని, సహసా = వేగ ముగా, ఉత్థాయ=లేచి ) హా=అయ్యో, ధిక్=ఛీ, హా=అయ్యో, ధిక్ = ఛీ, దుఃస్వప్న = చెడుకలసంబంధమగు + రణరణక = గంద్రగోళముచే + విప్రలబ్ధా=వంచింపఁబడినదాననై, ఆత్మానం=నన్ను, ఆర్యపుత్ర = ఆర్య

---

♦ హా సోమ్మ అజ్జఉత్త! కహింసి. హద్ధీ, హద్ధీ, దుస్సివిణరణరణ అ విప్పలద్ధా అజ్జఉత్త సుణ్ణం విఅ అత్తాణం పేక్ఖామి. హద్ధీ హద్ధీ. ఏఆఇణిం పసుత్తం మం ఉజ్ఝిఅ కహింగదో ణాహో. హోదు సే కుప్పిస్సం జఇ తం పేక్ఖన్తీ అత్తణో పహావిస్సం—కో ఏత్థ పరిఅణో.

పుత్రునిచే+శూన్యం=శూన్యమైనదానినిగా, పశ్యామి = చూచుచున్నాను. ( విలోక్య=చూచి ) హా=అకటా, ధిక్=ఛీ, హా=అకటా, ధిక్=ఛీ, ప్రసుప్తాం=నిద్రించినట్టి, మాం=నన్ను, ఏకాకినీం=ఒంటరిదానినిగా, ఉజ్ఝిత్వా=వదలి, నాథః=భర్త, కుత్ర=ఎచటికి, గతః=చనియె; తం=నాథుని, ప్రేక్షమాణా=చూచుచున్నదాననై, ఆత్మానం=నన్ను (నేను) ప్రభవిష్యామి + యది=( ఆత్మవశంబుననుంచుకొనుటకు ) సమర్థురాలనగుదునేని, అస్మై+కోపిష్యామి = వీనిపై ( భర్తపై ) కోపగింతును, అత్ర=ఇచట, పరిజనః=సేవకుఁడు, కః=ఎవఁడురా.

( ప్రవిశ్య=ప్రవేశించి. )

‡ దుర్ముఖః- దేవి ! కుమారలక్ష్మణో విజ్ఞాపయతి; ‘ సజ్జో రథః త దారోహతు దేవీ ’ ఇతి.

దు:- దేవి = ఓదేవీ ! కుమార-లక్ష్మణః = లక్ష్మణకుమా[redacted], విజ్ఞాపయతి=మనవిచేయుచున్నాఁడు; ‘ రథః = రథము, సజ్జః = సిద్ధమై యున్నది; దేవీ=అమ్మగారు ( తమరు ) తత్=దానిని, ఆరోహతు = ఆరోహింపనగును ’ ఇతి=అని.

† సీతా:- ఇయ మారూఢాస్మి. స్ఫురతి మే గర్భభారః. శనై ర్గచ్ఛామః.

సీ:- ఇయం=ఇదిగో, ఆరూఢా+అస్మి = ఎక్కుచున్నాను. మే=నాయొక్క, గర్భ=గర్భముయొక్క+భారః=భారము, స్ఫురతి = అదరుచున్నది. శనైః=మెల్లగ, గచ్ఛామః=పోవుదము.

---

‡ దేవి కుమారలక్ఖణో విణ్ణవేది. సజ్జో రహో తం ఆరుహదు, దేవీ త్తి.

† ఇ అం ఆరూఢహ్మి ఫురఇ మే గబ్భభారో సణిఅం గచ్ఛహ్మ.

❨ దుర్ముఖః:- ఇత ఇతో దేవీ.

దు:- దేవీ=ఓ దేవీ, ఇతః + ఇతః = ఇటు ఇటు.

♦ సీతా :- నమో రఘుకులదేవతాభ్యాం.

సీ:- రఘు-కుల=రఘువంశమందలి + దేవతాభ్యాం=దేవతలకొఱకు, ( లక్ష్మీనారాయణుల కొఱకు ) నమః=నమస్కారము.

( ఇతి నిష్క్రాంతాః సర్వే. )

( ఇతి=ఇట్లు, సర్వే=అందఱు, నిష్క్రాంతాః=నిష్క్రమించిరి.



---

❨ ఇదో ఇదో దేవీ.

♦ ణమో రహుఉలదేవదాణం.

# ద్వితీయోఽంకః.

## రెండవ - అంకము.

( నేపథ్యే = తెఱలో )

( తతః ప్రవిశ త్యధ్వగవేషా తాపసీ. )

( తతః=పిదప, అధ్వగ=త్రోవనడచువారియొక్క + వేషా=వేసము గల, తాపసీ=తాపసస్త్రీ, ప్రవిశతి=ప్రవేశించుచున్నది. )

తాపసీ:- అయే వనదేవతా ఫలకుసుమగర్భేణ పల్లవా ర్ఘ్యేణ దూరా న్మా ముపతిష్ఠతే.

తాపసి:- అయే=ఓహో! వన-దేవతా=వనదేవత, ఫల=పండ్లున్ను + కుసుమ=పుష్పములున్ను + గర్భేణ=మధ్యయందుఁగల, పల్లవ = చిగురు టాకులతోఁగూడిన + అర్ఘ్యేణ=పూజాద్రవ్యముచేతను, దూరాత్=దూర మునందుండి, మాం=నన్ను, ఉపతిష్ఠతే=పూజించుచున్నది.

( ప్రవిశ్య=ప్రవేశించి )

వనదేవతా:- ( అర్ఘ్యం వికీర్య )

శ్లో॥ యథేచ్ఛం భోగ్యం వో వన మిద మయం మే సుదివసః
సతాం సద్భి స్సంగః కథమపి హి పుణ్యేన భవతి;
తరుచ్ఛాయా తోయం యదపి తపసాం యోగ్య మశనం
ఫలం వా మూలం వా తదపి న పరాధీన మిహ వః ॥

వనదేవత:- ( అర్ఘ్యం=పూజాద్రవ్యమును, వికీర్య=అర్పించి. )

అర్థ:- ఇదం=ఈ, వనం=వనము, వః=మీకు, యథేచ్ఛం=ఇష్టము వచ్చినటుల, భోగ్యం=అనుభవింపఁదగినది; అయం=ఇది, మే=నాకు, సుదివసః=మంచిరోజు, కథం+అపి=అతికష్టముమీద, పుణ్యేన+హి=పుణ్యము చేతనేగదా, సతాం=(మాబోటి)వారికి, సద్భిః=సత్పురుషులతో, సంగః=కూడిక, భవతి=సమకూరుచున్నది, ఇహ=ఇచట, వః = మీకు, తరు-ఛాయా = చెట్లయొక్క-నీడయేని, తోయం=ఉదకమేని, యత్ + అపి = ఏదో, తపసాం=తపస్సులకు, యోగ్యం=తగిన, అశనం=తినుబండారమగు, ఫలం+వా= పండేని, మూలం + వా =దుంపయేని, తద్ + అపి=అదియు, పర-అధీనం= ఇతరులపైనాధారపడియుండవలసినది, న=లేదు.

తా॥ ఓ తాపసీ ! ఈవనంబు పరులదని యెంచక సొంతవనంబుంబలె యథేచ్ఛగ విహరించుమా; ఇంతకు నేఁడు నాకు మహాసుదినము; ఈప్రపంచమున మాబోటి వారికి సజ్జనసాంగత్యము లభించుటన్న బహుదుర్ఘటము; అదిపూర్వజన్మసుకృతముచేతనే సంఘటిల్లు; ఇచటి పుణ్యోదకంబుల స్నానపానంబుల కుపయోగించుకొనుచు, వృక్షచ్ఛాయల మెలంగుచుఁ దాపసభోజనార్హంబులగు నిందలి కందమూలఫలంబుల నీయిచ్ఛవచ్చినటుల సేవించుచు స్వచ్ఛందవృత్తి మెలంగుమా; ఇచట నొక రీతువలె మనము తీసికొనవలె ననుమాటఁ దలంపకుము; సర్వము నీయధీనమే.

తాపసీ:- కి మ త్రోచ్యతే.

శ్లో॥ ప్రియప్రాయా వృత్తి ర్వినయమధురో వాచి నియమః
ప్రకృత్యా కల్యాణీ మతి రనవగీతః పరిచయః
పురో వా పశ్చాద్వా తదిద మవిపర్యాసితరసం
రహస్యం సాధూనా మనుపధి విశుద్ధం విజయతే॥ ౨

తా:-:అత్ర = ఈవిషయమున, కిం+ఉచ్యతే=ఏమిచెప్పఁబడవలెను నీవు చెప్పినదంతయు నిజమే. )

అర్థః:— వృత్తిః=వ్యాపారము, ప్రియ—ప్రాయా=మిక్కిలి ప్రియమైనది; వాచి=పల్కునందు, నియమః=నియమము, వినయ=వినయముచే+మధురః=ప్రియతరమైనది, మతిః = మనస్సు, ప్రకృత్యా = స్వభావముచేతనే, కల్యాణీ=మంగళప్రదమైనది, కనుకనే, పరిచయః = ( హఠాత్తుగఁ జూచిన జనులతోఁగలిగిన ) పరిచయము, అనవగీతః = నిందింపఁదగనిది; ఇదం = ( ఈపూర్వోక్తమగు ) తత్ =అప్రసిద్ధమైనట్టియు, పురః+వా=ఆపరోక్షమందుఁగాని, పశ్చాత్ +వా = పరోక్షమందుఁగాని, అవిపర్యాసితె=వ్యత్యాసమునొందనట్టి+రసం = ఆదరణానురాగముగలట్టియు, అనుపధి = కపటములేనట్టియు, విశుద్ధం = నిర్మలమైనట్టియు, సాధూనాం = సత్పురుషులయొక్క, రహస్యం = ( ప్రవర్తన ) రహస్యము, విజయతే = సర్వోత్కృష్టమై యుండునుగాత !

తా:— ఓ వనదేవతా! సాధుజనచరిత్ర నుగ్గడింప నేరితరంబు ? ఆ మహాత్ములనేత లతిప్రియంబులై యుండు; వారిపల్కులు వినయముతోఁ గూడి నియమబద్ధములై చను; వారిమనంబు పరోపకారపారీణమై వర్తిలు; నూతనపురుషులయందుఁగూడఁ గృతపరిచయులయందువలెఁ బరిచయసంభావన మవినిందితమై యుండు; ఇవ్విధంబునఁ బరోక్షాపరోక్షములయందు వ్యత్యాసబుద్ధిలేక నిష్కపటమై పరిశుద్ధమగు సాధువులయొక్కచరిత్ర సర్వోత్కృష్టమై వర్తించుఁగాక.

( ఉపవిశతః=ఇరువురు కూర్చుండుచున్నారు )

వనదేవతా:— కాం పున రత్రభవతీ మవగచ్ఛామి.

వనదేవత:— అత్రభవతీం=పూజ్యురాలవగు నిన్ను, కాం+పునః+అవగచ్ఛామి=ఎవరినిగాఁ దెలిసికొందు. ( పూజ్యవగు నీపేరేమి )

తాపసీ:— ఆత్రేయ్యస్మి.

తా:— ఆత్రేయీ=ఆత్రేయి ( అను పేరుగలదాన ) అస్మి = అగుచున్నాను.

వనదేవతా:- ఆర్యే ! ఆత్రేయి ! కుతః పున రిహాగమ్యతే కిం ప్రయోజనో దండకారణ్యోపవనప్రచారః.

వ:- ఆర్యే=పూజ్యురాలా ! ఆత్రేయి=ఓ ఆత్రేయీ ! ఇహ = ఇచటికి, కుతః + పునః + ఆగమ్యతే = ఎచ్చటినుండివచ్చుచుంటివి ? దండకారణ్య=దండకారణ్యముయొక్క + ఉపవన=సమీపవనమునుగూర్చిన + ప్రచారః=గమనము, కిం + ప్రయోజనః=ఏమిప్రయోజనముగలది ?

ఆత్రేయీ:-

శ్లో॥ అస్మి న్నగస్త్యప్రముఖాః ప్రదేశే
భూయాంస ఉద్గీథవిదో వసన్తి
తేభ్యోఽధిగంతుం నిగమాంతవిద్యాం
వాల్మీకిపార్శ్వా దిహ పర్యటామి ॥ 3

ఆత్రేయి:- అస్మిన్ = ఈ, ప్రదేశే = ప్రదేశమందు, అగస్త్య-ప్రముఖాః = అగస్త్యుఁడు మొదలైన, ఉద్గీథవిదః = వేదశాస్త్రజ్ఞులు, భూయాంసః=పలువురు, వసన్తి=నివసించుచున్నారు; తేభ్యః=వారినుండి, నిగమ-అంత-విద్యాం = వేదాంతవిద్యను, అధిగంతుం=నేర్చుకొనుటకు, వాల్మీకి-పార్శ్వాత్ =వాల్మీకిమహర్షి కడనుండి, ఇహ = ఇచటికి, పర్యటామి=ఏతెంచుచున్నాను.

తా॥ ఈప్రదేశమున నగస్త్యుఁడు మున్నగు సకలవేదాంతతాత్పర్య పర్యాలోచనశీలురగుమహర్షు లుండుట జగద్విదితమేగదా; వారిచెంగట వేదాంతవిద్యాభ్యాసమొనర్ప వాల్మీకిమహర్షి సమీపముననుండి యిచటికి వచ్చుచున్నాను.

వనదేవతా:- యదా తావ దన్యేఽపి మునయ స్తమేవ హి పురాణబ్రహ్మవాదినం ప్రాచేతస మృషిం బ్రహ్మపారాయణా యోపాసతే తత్కోఽయ మార్యాయాః ప్రవాసః.

వనదేవత:— యదా + తావత్ = ఎప్పుడైతే, అన్యే = ఇతరులగు, మునయః + అపి = మునీశ్వరులున్నూ, బ్రహ్మ = వేదముయొక్క + పారాయణాయ = పారాయణ మొనర్చుటకై, పురాణ = మొదటి + బ్రహ్మ-వాదినం = వేదప్రవక్తయగు, తం = ఆ, ప్రాచేతసం + ఋషిం + ఏవ = వాల్మీకమహర్షినే, ఉపాసతే = సేవించుచున్నారో, తత్ = అట్టియెడ, ఆర్యాయాః = ఆర్యురాలవగు నీయొక్క, అయం = ఈ, ప్రవాసః = పరస్థలగమనము, కః = ఏమి ?

ఆత్రేయీ:— తత్ర మహా నధ్యయనప్రత్యూహ ఇత్యేష దీర్ఘప్రవాసప్రయాసో౽ంగీకృతః.

ఆత్రేయి:— తత్ర = అచట, మహాన్ = గొప్ప, అధ్యయన = చదువునకు + ప్రత్యూహః + ఇతి = విఘ్నమను కారణముచే, ఏషః = ఈ, దీర్ఘ = దీర్ఘమగు + ప్రవాస = పరదేశగమనముయొక్క + ప్రయాసః = శ్రమము, అంగీకృతః = సమ్మతింపఁబడినది.

వనదేవతా:— కీదృశః ?

వ:— కీదృశః = ఎట్టిది ? ( ఆవిఘ్నమేమి )

ఆత్రేయీ:— తస్య భగవతః కేనాపి దేవతావిశేషేణ సర్వప్రకారాద్భుతం స్తన్యత్యాగమాత్రకే వయసి వర్తమానం దారకద్వయ ముపనీతం; తత్ఖలు న కేవలం తస్య అపి తు తిరశ్చామ ప్యన్తఃకరణాని తత్త్వా న్యుపస్నేహయతి.

ఆత్రేయి:— భగవతః = పూజ్యుఁడగు, తస్య = ఆవాల్మీకిమహర్షికి, కేన + అపి = ఏదోయొక, దేవతా-విశేషేణ = దేవతావిశేషముచే, సర్వ-ప్రకార = అన్నివిధములచే + అద్భుతం = ఆశ్చర్యకరమైనట్టియు, స్తన్య = పాలను + త్యాగమాత్రకే = వదలిపెట్టియు, వదలిపెట్టునంతవిగానున్నట్టి

వయసి=ఈడునందు, వర్తమానం=ఉండునట్టి, దారక-ద్వయం = పిల్లవాండ్ర యొక్క-జంట, ఉపనీతం=అర్పించఁబడియె.

వనదేవతా:- అపి తయో ర్నామసంజ్ఞాన మస్తి ?

వనదేవత:- తయోః = వారి యిర్వురియొక్క-యు, నామ = పేళ్ళ యొక్క, సంజ్ఞానం=పరిజ్ఞానము, అస్తి+అపి=కలదా? ( వారి పేర్లు తెలుఁగుదువా ? )

ఆత్రేయీ:- తయైవ కిల దేవతయా తయోః కుశలవావితి నామనీ చ ప్రభావ శ్చాఖ్యాతః.

ఆత్రేయి:- తయా+దేవతయా+ఏవ = ఆదేవతచేతనే, కుశలవౌ+ఇతి = కుశలవులని, తయోః =ఆ యిరువురియొక్క-, నామనీ+చ = పేరులున్ను, ప్రభావశ్చ = ( వారి ) ప్రభావమున్ను, అఖ్యాతః+కిల = చెప్పఁబడియెనఁట.

వనదేవతా:- కీదృశః ప్రభావః ?

వ:- ప్రభావః=ప్రభావము, కీదృశః=ఎట్టిది.

ఆత్రేయీ:- తౌ చ భగవతా వాల్మీకినా ధాత్రీకర్మతః పరిగృహ్య పోషితౌ రక్షితౌ చ. నిర్వృత్తచౌలకర్మణో స్త్రయీవర్జ మితరా స్తిస్రో విద్యా స్సావధానేన పరినిష్ఠాపితాః. తదనంతరం భగవ తైకాదశే వర్షే క్షాత్రేణ కల్పే నోపనీయ త్రయీవిద్యా మధ్యాపితౌ. న త్వేతాభ్యా మతిదీప్తప్రజ్ఞాభ్యా మస్మదాదే స్సహాధ్యయనయోగోఽస్తి; యతః.

ఆత్రేయి:- తౌ+చ = వా రిర్వురును, భగవతా = పూజ్యుఁడగు, వాల్మీకినా=వాల్మీకిచే, ధాత్రీకర్మతః=పెంపుడుతల్లికృత్యమున, పరిగృహ్య=

కైకొని, పోషితౌ=పోషింపఁబడినారు; రక్షితౌ+చ = మఱియు రక్షింపఁబడినారు; నిర్వృత్త=నెరవేర్పఁబడిన+చౌల—కర్మణోః=చూడాకర్మగల, తయోః=ఆ యిద్దరికి, త్రయీవర్జం=మూఁడు వేదముల విడిచి, ఇతరాః = మిగిలిన, విద్యాః=విద్యలు, సావధానేన = సావధానముగా, పరినిష్ఠాపితాః = నేర్పఁబడినవి. తత్—అనంతరం=ఆపిదప, భగవతా=పూజ్యుఁడగు, వాల్మీకిచే, ఏకాదశే=పదునొకండవ, వర్షే=సంవత్సరమున, క్షాత్రేణ=క్షత్రియజాతికి నుడువఁబడిన, కల్పేన=విధానముచే, ఉపనీయ=ఉపనయన మొనర్చి, త్రయీ—విద్యాం=వేదవిద్యను, అధ్యాపితౌ=అధ్యయనము చేయింపఁబడిరి. అతిప్రదీప్తి = మిక్కిలి ప్రతిభయు+ప్రజ్ఞాభ్యాం = తెలివియుఁగలట్టి, ఏతాభ్యాం=వీ రిరువురితోఁడను, అస్మదాదేః=నాబోంట్లకు, సహ—అధ్యయన = కూడఁజదువుకొనుటకు+యోగః = యోగము, న+అస్తి=లేదు, యతః = ఎందువలననఁగా.

శ్లో॥ వితరతి గురుః ప్రాజ్ఞే విద్యాం యథైవ తథా జడే
న చ ఖలు తయో ర్జ్ఞానే శక్తిం కరో త్యపహంతి వా
భవతి చ పున ర్భూయా న్భేదః ఫలం ప్రతి త ద్యథా
ప్రభవతి శుచి ర్బింబోద్గ్రాహే మణి ర్న మృదాం చయః॥

అర్థః— గురుః=గురువు, యథా = ఎటుల, ప్రాజ్ఞే = తెలివిగలవానియందు, విద్యాం=విద్యను, వితరతి—వెల్లడిచేయునో, తథా+ఏవ=అటులనే, జడే=మందబుద్ధివిషయంబునను, (విద్యాం=విద్యను, వితరతి = వివరముగ నుడువును) తయోః=ఆ యిరువురికి, జ్ఞానే = సహజజ్ఞానవిషయమందు, శక్తిం+న+కరోతి+ఖలు=నిక్కముగ (ఒకనికి విద్యాగ్రహణమందలి) సామర్థ్యమును కూర్పను కూర్పఁడు, న+చ+అపహన్తి+వా = (రెండవవానియొక్క తత్సామర్థ్యమును ఖాడుచేయను జేయఁడు; )

ఫలం + ప్రతి + పునః = ఫలితంబునుగూర్చియన్ననో, ( తయోః = వారిర్వు రకు ) భూయాన్ = పెద్ద, భేదః = భేదము, భవతి + చ = కల్గనేకల్గును; తత్ = ఆసంగతి, యథా = ఎట్లనినచో, శుచిః = పరిశుభ్రమగు, మణిః = రత్నము, బింబ = ఛాయయొక్క + ఉద్గ్రాహే = గ్రహించుటయందు, ప్రభవతి = శక్తి కల్గియుండును; మృదాం + చయః = మృత్తికాసమూహమో, న + ప్రభవతి = సామర్థ్యము గల్గియుండదు.

తా॥ గురువు ప్రాజ్ఞుఁడగు శిష్యునకును, జడుఁడగు శిష్యునకును, నొకేవిధంబున విద్య నేర్పుచుండు; వారియిద్దరిలో నొకనిజ్ఞానమునందు శక్తి యెక్కువగఁ గల్గునట్లుగాని, మఱొకని జ్ఞానమునం దాశక్తి నశించు నట్లుగాని, చేయఁబోఁడు. కాని ఫలితాంశసందర్భమున నా యిర్వురకును మహత్తరభేదము కాన్పించు; ప్రాజ్ఞునియొక్క సూక్ష్మగ్రాహకశక్తియు, జడునియొక్క తచ్ఛక్తిశూన్యతయు నే దీనికిఁ గారణము; అ దెట్లన నేవస్తువు యొక్కఛాయ నేని బరిశుభ్రమగు రత్నము గ్రహింపఁజాలునిగాని మట్టిముద్ద గ్రహింప నేర్చునా ?

వన:— అయ మధ్యయనప్రత్యూహ ఏవ.

వనదేవత:— అయం = ఇది, అధ్యయన = చదువునకు + ప్రత్యూహః + ఏవ = విఘ్నమే.

ఆత్రేయీ:— అన్య శ్చ

ఆత్రేయి:— అన్యః + చ = మఱొక్కటియు ( అస్తి = కలదు )

వన:— అథాపరః కః ?

వనదేవత:— అథ = ఇఁక, అపరః = రెండవది, కః = ఏద్ది ?

ఆత్రేయీ:— అథ స బ్రహ్మర్షి రేకదా మాధ్యందినసవ నాయ నదీం తమసా మనుప్రపన్నః. తత్ర యుగ్మచారిణోః

క్రౌంచయో రేకం వ్యాధేన వధ్యమానం దదర్శ. ఆకస్మిక ప్రత్యవభాసాం దేవీం వాచ మానుష్టుభేన ఛందసా పరిణతా మభ్యుదైరయత్.

ఆత్రేయిః— అథ=పిదప, సః=ఆ,బ్రహ్మర్షిః=బ్రహ్మర్షి యగువాల్మీకి, ఏకదా=ఒకానొకప్పుడు, మాధ్యందిన = మధ్యాహ్నసంబంధమగు + సవనాయ=స్నానముకొఱకు, తమసాం+నదీం=తమసానదినిగూర్చి, అనుప్రపన్నః=చనెను; తత్ర=అచట, యుగ్మ=జంటచే (గా) + చారిణోః=సంచరించెడి, క్రౌంచయోః = ( మగది, ఆడుది ) క్రౌంచపక్షుల రెంటిలో, వ్యాధేన=బోయవానిచే, వధ్యమానం=చంపఁబడుచున్న, ఏకం=ఒకదానిని, దదర్శ=చూచెను. ఆకస్మిక=తనంతటఁదానె+ ప్రత్యవభాసాం=స్ఫురణముఁ దగిలినదై ( అప్రయత్నముగ వచ్చినదై) ఆనుష్టుభేన+ఛందసా = అనుష్టుబ్ఛందస్సుచే, పరిణతాం = మార్పుఁజెందిన, దేవీం + వాచం = వాగ్దేవిని, అభ్యుదైరయత్=ప్రకటించెను.

శ్లో॥ మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితం ॥

అర్థః— నిషాద=ఓబోయవాఁడా, యత్=ఏకారణమువలన, త్వం = నీవు, క్రౌంచ—మిథునాత్=క్రౌంచపక్షులజంటనుండి, కామ=కామముచే+ మోహితం=మోహముఁజెందిన, ఏకం=ఒకదానిని ( మగపక్షిని ) అవధీః = చంపితివో, తత్=ఆకారణమువలన, శాశ్వతీః = అనంతములైన, సమాః = సంవత్సరములపర్యంతము, ప్రతిష్ఠాం = ప్రతిష్ఠను, మా+గమః =పొందకుమా.

తా:— ఓ నిషాదుఁడా ! క్రౌంచమిథునములోఁ గామమోహితమగు మగపులుంగును జంపితివి కానఁ బెక్కుసంవత్సరముల పర్యంతము నీవు ప్రతిష్ఠావిహీనుఁడవై వర్తింతువుగాత.

వనదేవతా:- ఆమ్నాయా దన్యో నూతనచ్ఛందసా మవ తారః.

వనదేవత:- ఆమ్నాయాత్ = వేదమునకంటె, అన్యః = వేఱైన, నూతన=క్రొత్త+ఛందసాం=ఛందస్సులయొక్క, అవతారః=ఆవిర్భావము.

ఆత్రేయీ:- తేన హి పునః సమయేన తం భగవంత మావిర్భూతశబ్దప్రకాశ మృషి ముపసంగమ్య భగవాన్ భూతభావనః పద్మయోని రవోచత్ - 'ఋషే ప్రబుద్ధోఽసి వాగాత్మని బ్రహ్మణి; తద్బ్రూహి రామచరితం; అవ్యాహత జ్యోతి రార్షం తే చక్షుః ప్రతిభాతు! ఆద్యః కవి రసి' ఇత్యుక్త్వా న్తర్హితః. అథ స భగవా న్ప్రాచేతసః ప్రథమం మనుష్యేషు శబ్దబ్రహ్మణ స్తాదృశం వివర్త మితిహాసం రామాయణం ప్రణినాయ.

ఆత్రేయి:- పునః = మగుడ, తేన+హి+సమయేన = తోడ్తోడనే, ఆవిర్భూత = ఆవిర్భవించిన + శబ్ద-ప్రకాశం=శబ్దజ్యోతికల్గిన, భగవంతం=పూజ్యుఁడగు, తం=ఆ, ఋషిం=వాల్మీకిమహర్షిని, ఉపసంగమ్య= సమీపించి, భగవాన్ = పూజ్యుఁడగు, భూత-భావనః = భువనకర్తయగు, పద్మ-యోనిః=కమలగర్భుఁడు, అవోచత్=నుడివెను; ఋషే= ఓ వాల్మీకి ఋషీ! వాక్-ఆత్మని = శబ్దరూపమగు, బ్రహ్మణి = బ్రహ్మవిషయమున, ప్రబుద్ధః + అసి=ప్రకర్ష బోధకలవాఁడవైతివి. తత్ =అందువలన, రామ= రామునియొక్క + చరితం=చరిత్రను, బ్రూహి=పల్కుము. అవ్యాహత= అప్రతిహతమగు + జ్యోతిః=ప్రకాశముగలట్టియు, ఆర్షం = ఋషిసంబంధ మైనట్టియు, (యోగజ్ఞానసంబంధమగు) తే= నీ యొక్క, చక్షుః=నేత్రము,

ప్రతిభాతు=ప్రకాశించుఁగాక. ఆద్యః + కవిః = ఆది కవివి, అసి = అగుచున్నావు, ఇతి=అని, ఉక్త్వా=పలికి, అంతర్హితః = అదృశ్యుఁడాయెను. అథ=తరువాత, సః=ఆ, భగవాన్, పూజ్యుఁడగు, ప్రాచేతసః = వాల్మీకి, మనుష్యేషు=మనుష్యలోకమున, శబ్ద-బ్రహ్మణః=శబ్దబ్రహ్మకు, తాదృశం= అట్టి, వివర్తం=పరిణామమగు, ఇతిహాసం=ఇతిహాసమైన, రామాయణం = రామాయణమును, ప్రణినాయ=రచించెను.

వనదేవతా:- హన్త పండితః సంసారః.

వ:- హన్త=ఆహా, సంసారః=సంసారము (ప్రపంచము) పండితః= ప్రజ్ఞావంతముగ నొనర్పఁబడినది.

ఆత్రేయీ:- తస్మాదేవ హి బ్రవీమి తత్ర మహానధ్యయన ప్రత్యూహ ఇతి.

ఆత్రేయి:- తస్మాత్ + ఏవ + హి = అందువలననే కదా, తత్ర=అచ్చట, మహాన్ = గొప్ప, అధ్యయన = అధ్యయనమునకు + ప్రత్యూహః + ఇతి = విఘ్నమని, బ్రవీమి=పల్కుచున్నాను.

వనదేవతా:- యుజ్యతే

వ:- యుజ్యతే=నిక్కమే.

ఆత్రేయీ:- విశ్రాంతాస్మి భద్రే! సంప్రత్యగస్త్యాశ్రమస్య పంథానం బ్రూహి.

ఆత్రేయి:- విశ్రాంతా + అస్మి=సేదతీర్చుకొనినదాననైతి; భద్రే = ఓ కల్యాణీ! సంప్రతి=ఇపుడు, అగస్త్య=అగస్త్యమునియొక్క + ఆశ్రమస్య= ఆశ్రమమునకు, పంథానం=మార్గమును, బ్రూహి=చెప్పుము.

వనదేవతా:- ఇతః పంచవటీ మనుప్రవిశ్య గమ్యతా మనేన గోదావరీతీరేణ.

వ:— ఇతః=ఈ వైపుగా, పంచవటీం=పంచవటిని, అనుప్రవిశ్య=అనుసరించి, అనేన=ఈ, గోదావరీ—తీరేణ=గోదావరీనదియొక్క—యొడ్డుమీదుఁగా, గమ్యతాం=పోవుదువుగాక.

ఆత్రేయీ:- (సాస్రం) అప్యేత త్తపోవనం, అప్యేషా పంచవటీ, అపి సరి దియం గోదావరీ, అప్యయం గిరిః ప్రస్రవణః, అపి జనస్థానదేవతా త్వం వాసన్తి?

ఆత్రేయి:— (సాస్రం = కన్నీటితోఁగూడునట్లు) ఏతత్ = ఇది, అపి+తపః—వనం=తపోవనమా? ఏషా = ఇది, అపి+పంచవటీ = పంచవటియా? ఇయం+సరిత్ = ఈనది, అపి+గోదావరీ = గోదావరియా? అయం+గిరిః=ఈపర్వతము; అపి+ప్రస్రవణః=ప్రస్రవణమా? త్వం = నీవు, జనస్థాన=జనస్థానమందలి+దేవతా=దేవతవగు, అపి+వాసన్తీ=వాసన్తివా?

వాసన్తీ:— అస్త్యేత త్సర్వం.

వాసన్తి:— ఏతత్+సర్వం+అస్తి=ఇదంతయు వరలు.

ఆత్రేయీ:— వత్సే! జానకి!

శ్లో॥ స ఏష తే వల్లభబంధువర్గః
ప్రాసంగికీనాం విషయః కథానాం
త్వాం నామ శేషామపి దృశ్యమానః
ప్రత్యక్షదృశ్యా మివ నః కరోతి ॥   ౬

ఆత్రేయి:— వత్సే=బిడ్డా! జానకి=సీతా!

అర్థ:— ప్రాసంగికీనాం = ప్రసంగవశమునవచ్చిన, కథానాం=కథలకు, విషయః=విషయమగు, సః=ఆ, తే=నీయొక్క, ఏషః=ఈ, వల్లభ=ప్రేమాస్పదమైన+బంధు=బంధువులయొక్క+వర్గః=సమూహము, దృశ్య

మానః=చూడఁబడుచున్నదై, నామ=పేరే+శేషాం+అపి=మిగిలియుంట గలిగినను, త్వాం=నిన్ను, నః=మాయొక్క, ప్రత్యక్షు=కన్నులయెదుట+దృశ్యాం+ఇవ=చూడఁదగినదానినివలె, కరోతి=చేయుచున్నది.

తా॥ ఓజానకీ! ఏవియో మాటలాడుకొనుసందర్భమునఁ దత్ప్రసంగోదాహృతకథావిషయంబులై వర్తిలు నీ తపోవనము, ఈపంచవటి, యీగోదావరి మున్నగు త్వద్బంధువర్గము మాకుఁ గానవచ్చినపుడు, నామమాత్రావశిష్టవైయున్నను నిన్ను మాకన్నులచెంగట సంచరించుచున్నదానివలెనే చేయుచున్నది.

వాసన్తీ:- (సభయం స్వగతం) కథం నామ శేషా మిత్యాహ? (ప్రకాశం) ఆర్యే! కి మత్యాహితం సీతాదేవ్యాః?

వాసన్తి:- (సభయం = భయముతోఁ గూడునట్లుగా, స్వగతం = తనలో) నామ—శేషాం+ఇతి=పేరే—మిగిలినదాని నని, ఆహ+కథం = ఏలచెప్పెను? (ప్రకాశం=ప్రకాశముగా) ఆర్యే = పూజ్యురాలా! సీతా దేవ్యాః=సీతాదేవికి, కిం+అత్యాహితం=ఏమియుపద్రవము?

ఆత్రేయీ:- న కేవల మత్యాహితం సాపవాదమపి.

ఆత్రేయి:- అత్యాహితం+కేవలం+న=ఉపద్రవముమాత్రమేకాదు; సాపవాదం+అపి=అపవాదముతోఁగూడినట్టిదిగూడ.

వాసన్తీ:- కథమివ?

వా:- కథం+ఇవ=ఏపగిది?

ఆ:- (కర్ణే-ఏవ మేవం)

ఆత్రేయి:- (కర్ణే=చెవియందు;—ఏవం+ఏవం=ఇట్లిట్లు)

వా:- అహహ! దారుణో దైవనిర్ఘాతః (ఇతి మూర్ఛతి)

వాసన్తి:— అహహ = అయ్యయో! దైవ = భగవత్ప్రేరితమగు + నిర్ఘాతః=వజ్రపాతము, దారుణః=భయంకరమైనది, ( ఇతి=అని, మూర్ఛతి= మూర్ఛఁజెందుచున్నది )

ఆత్రేయీ:— భద్రే! సమాశ్వసిహి; సమాశ్వసిహి.

ఆ:— భద్రే=కల్యాణీ! సమాశ్వసిహి+సమాశ్వసిహి=ఊరడిల్లుము, ఊరడిల్లుము.

వాసన్తీ:— హా! ప్రియసఖి! హా! మహాభాగే! ఈదృశస్తే నిర్మాణభాగః. రామభద్ర! రామభద్ర! అథవా అలం త్వయా. ఆర్యే! ఆత్రేయి! అథ తస్మాదరణ్యాత్ పరిత్యజ్య నివృత్తే లక్ష్మణే సీతాదేవ్యాః కిం వృత్తమితి కాచిదస్తి ప్రవృత్తిః?

వాసన్తి:— హా=అయ్యో, ప్రియ—సఖి=ప్రియసఖీ! హా+మహాభాగే= హా! మహానుభావురాలా! తే=నీయొక్క, నిర్మాణ=సృష్టికాలమందలి + భాగః=భాగ్యము, ఈదృశః=ఇట్టిదియా; రామభద్ర+రామభద్ర = రామభద్రుఁడా! రామభద్రుఁడా! త్వయా+అలం = నీతోఁ జాలును (నీతోఁ బ్రయోజనమేమియు లేదు) ఆర్యే=పూజ్యురాలా! ఆత్రేయి = ఆత్రేయీ, అథ = తరువాత, లక్ష్మణే=లక్ష్మణుఁడు, పరిత్యజ్య = విడిచి, తస్మాత్= ఆ, అరణ్యాత్=వనమునుండి, నివృత్తే = మరలిపోవఁగా, సీతాదేవ్యాః = సీతాదేవికి, కిం+వృత్తం+ఇతి=ఏమి తటస్థించెనను విషయమున, కాచిత్+ ప్రవృత్తిః=ఎద్దియైనను వార్త, అస్తి+కిం=కలదా?

ఆత్రేయీ:— న హి న హి.

ఆత్రేయి:— న+హి+న+హి=లేదు, లేదు.

వాసన్తీ:- హా! కష్టం! అరుంధతీవసిష్ఠాధిష్ఠితేషు రఘుకదంబకేషు జీవన్తీషు చ ప్రవృద్ధాసు రాజ్ఞీషు కథ మిదం జాతం.

వాసన్తి:- హా + కష్టం = హా! కష్టము, రఘు-కదంబకేషు = రఘువులయొక్క సమూహములు (రఘువంశసంభవులు) అరుంధతీ-వసిష్ఠ=అరుంధతీవసిష్ఠులచే + అధిష్ఠితేషు=అధిష్ఠింపఁబడియుండగను, ప్రవృద్ధాసు=మిగుల వృద్ధలగు, రాజ్ఞీషు=కౌసల్యాదిరాణులు, జీవన్తీషు + చ=జీవించి యుండఁగను, ఇదం=ఇది, కథం=ఎట్లు, జాతం=తటస్థించెను.

ఆత్రేయీ:- ఋష్యశృంగసత్రే గురుజన స్తదాసీత్. సంప్రతి తు పరిసమాప్తం తత్ ద్వాదశవార్షికం సత్రం; ఋష్యశృంగేణ విసర్జితాశ్చ సంపూజ్య గురవః. తతో భగవత్యరుంధతీ నాహం వధూవిరహితా మయోధ్యాం గమిష్యామీ త్యాహ. తదేవ రామమాతృభి రనుమోదితం. తదనురోధాత్ భగవతో వసిష్ఠస్య పరిశుద్ధా వాచః "వాల్మీకితపోవనం గత్వా తత్ర వత్స్యామ" ఇతి.

ఆత్రేయి:- తదా=అపుడు, గురు-జనః=గురుజనము, ఋష్యశృంగ=ఋష్యశృంగునియొక్క + సత్రే=యాగమున, ఆసీత్=ఉండెను; సంప్రతి + తు=ఇపుడన్ననో, తత్=ఆ, ద్వాదశ-వార్షికం = పండ్రెండువత్సరంబు లవధిగాఁగల, సత్రం=యాగము, పరిసమాప్తం=ముగిసినది; గురవః=గురువులు, ఋష్యశృంగేణ=ఋష్యశృంగునిచే, సంపూజ్య=పూజించి, విసర్జితాః + చ=సాగనంపఁబడినారుకూడ; తతః=అటుపై, భగవతీ=పూజ్యురాలగు, అరుంధతీ=అరుంధతీదేవి, వధూ=కోడలిచే + విరహితాం=శూన్యమగు ( అనఁగా

గోడలులేని ) అయోధ్యాం=అయోధ్యాపట్టణమునుగూర్చి, అహం=నేను, న+గమిష్యామి=పోఁజాలను, ఇతి=అని, ఆహ=పలికెను; తత్ + ఏవ = అదియే, రామ—మాతృభిః=రామునితల్లులచే, అనుమోదితం = ఆమోదింపఁబడినది; తత్=ఆ, అరుంధతీ రామమాతలయొక్క, అనురోధాత్ = పోరుపెట్టుటవలన, భగవతః=పూజ్యుఁడగు, వసిష్ఠస్య = వశిష్ఠునియొక్క, పరిశుద్ధాః = పవిత్రములగు, వాచః = వాక్కులు, "వాల్మీకి—తపోవనం = వాల్మీకమహర్షి యొక్క—తపోవనమునుగూర్చి, గత్వా=వెడలి, తత్ర=అచట, వత్స్యామః=నివసింతుము" ఇతి=అని, ( నిస్సృతాః=బయల్వెడలినవి )

వాసన్తీ:— అథ స రాజా కిమారంభః సంప్రతి ?

వాసన్తి:— అథ=పిదప, సః+రాజా=ఆరామరాజు, సంప్రతి=ఇపుడు, కిం+ఆరంభః=ఏమివ్యాపారముగల్గియున్నవాఁడు ?

ఆత్రేయీ:— తేన రాజ్ఞా క్రతు రశ్వమేధః ప్రక్రాన్తః.

ఆత్రేయి:— తేన+రాజ్ఞా = ఆరాజుచే, అశ్వమేధః+క్రతుః = అశ్వమేధయాగము, ప్రక్రాంతః=ప్రారంభింపఁబడినది.

వాసన్తీ:— హా ! ధిక్ ! పరిణీతమపి.

వాసన్తి:— హా=అయ్యో ! ధిక్=ఛీ, పరిణీతం+అపి=వివాహము కూడఁ జేసికొనఁబడియెనా ?

ఆత్రేయీ:— న న శాన్తం పాపం శాంతం పాపం.

ఆత్రేయి:— న+న=లేదు లేదు, పాపం = పాపము, శాంతం = శాంతించుఁగాక, పాపం=పాపము, శాంతం=శాంతించుఁగాక.

వాసన్తీ:— కా తర్హి యజ్ఞే సహధర్మచారిణీ ?

వాసన్తి:— తర్హి=అటులైన, యజ్ఞే=యాగమున, సహ—ధర్మ—చారిణీ=తనతోఁగూడ—ధర్మమును—ఆచరించునామె (ధర్మపత్ని) కా=ఎవరు ?

ఆత్రేయీ:— హిరణ్మయీ సీతాప్రతికృతిః.

ఆత్రేయి:— హిరణ్మయీ = బంగారువికారమగు, సీతా = సీత యొక్క + ప్రతికృతిః=విగ్రహము.

వాసన్తీ:— హన్త !

శ్లో॥ వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి
లోకోత్తరాణాం చేతాంసి కో ను విజ్ఞాతు మర్హతి ॥ ౮

వాసన్తి:— హన్త = ఓహో !

అర్థ:— లోక — ఉత్తరాణాం = ప్రపంచాతీతులగువారియొక్క, చేతాంసి=మనస్సులు, వజ్రాత్ + అపి=వజ్రమునకన్నను, కఠోరాణి = కఠినములైనటువంటివిగా, ( దృశ్యంతే = కానఁబడుచున్నవి ) కుసుమాత్ + అపి=పుష్పమునకన్నను, మృదూని=మృదువులుగాను ( దృశ్యంతే=కానఁబడుచున్నవి) (తాని=ఆమనస్సులను,) విజ్ఞాతుం=గుర్తెఱుంగుటకు, కః + ను+అర్హతి=ఎవఁడర్హుఁడైయుండు నబ్బా !

తా॥ లోకాతీతులగు మహాత్ముల చిత్తవృత్తి నరయుట బహుకష్టతరము; వారిమనంబు లొకొక్కసమయంబున వజ్రంబులకన్నను మిగుల కఠినంబులైయుండు; మఱొక్కసమయంబునఁ బుష్పములకన్నను మిగుల మెత్తనైవర్తిల్లు; అట్టిచో వారిచిత్తంబులలోతుపాతు లెఱుంగ నెవఁడు సమర్థుఁడైయుండు ?

ఆత్రేయీ:— విసృష్టశ్చ వామదేవాభిమంత్రితో మేధ్యాశ్వః. ఉపకల్పితాశ్చ యథాశాస్త్రం తస్య రక్షితారః, తేషామధిష్ఠాతా చ లక్ష్మణాత్మజ శ్చంద్రకేతుః అవాప్తదివ్యాస్త్రసంప్రదాయ శ్చతురంగబలాన్వితః ప్రహితః.

ఆత్రేయి:— వామదేవ=వామదేవునిచే + అభిమంత్రితః=అభిమంత్రితంబైన, మేధ్య=యజ్ఞసంబంధమగు + అశ్వః=గుఱ్ఱము, విసృష్టః + చ=

విడువఁబడినదికూడ; యథాశాస్త్రం=శాస్త్రప్రకారముగా, తస్య = ఆ యశ్వమునకు, రక్షితారః + చ=రక్షకులును, ఉపకల్పితాః=ఏర్పఱుపఁబడిరి; చ = మఱియు, అవాప్త = పొందఁబడిన + దివ్య–అస్త్ర = దివ్యాస్త్రములయొక్క + సంప్రదాయః=ఉపదేశముగలట్టియు, చతురంగ–బల = చతురంగబలములచే + అన్వితః=కూడినట్టియు, లక్ష్మణ = లక్ష్మణునియొక్క + ఆత్మజః=పుత్రుఁడగు, చంద్రకేతుః = చంద్రకేతువు, తేషాం = ఆరక్షకసైన్యమునకు, అధిష్ఠాతా=నాయకుఁడుగా, ప్రహితః=పంపఁబడియె.

వాసన్తీ:- (సస్నేహకౌతుకాస్రం) కుమారలక్ష్మణస్యాపి పుత్రః ! హా న్త మాతః ! జీవామి.

వాసంతి:– ( సస్నేహ–కౌతుక–అస్రం ) స్నేహానందబాష్పములతోఁ గూడునట్లుగా ) కుమార–లక్ష్మణస్య + అపి=కుమారలక్ష్మణునకుఁ గూడను, పుత్రః=పుత్రుఁడా ? హ న్త=ఆహా ! మాతః = తల్లీ ! జీవామి = బ్రతికితిఁగదా.

ఆత్రేయీ:- అత్రాంతరే బ్రాహ్మణేన మృతం పుత్రమారోప్య రాజద్వారి సోరస్తాడ మబ్రహ్మణ్య ముద్ఘోషితం. తతో "న రాజాపచారమంతరేణ ప్రజా స్వకాలమృత్యుశ్చరతి" ఇత్యాత్మదోషం నిరూపయతి కరుణామయే రామభద్రే సహసైవ వాశరీరిణీ వా గుదచరత్.

శ్లో॥ శంబూకో నామ వృషలః పృథివ్యాం తప్యతే తపః
శీర్షచ్ఛేద్య స్స తే రామ ! తం హత్వా జీవయ ద్విజం ॥

ఆత్రేయి:– అత్ర – అంతరే = ఈలోపల, మృతం=చనిపోయిన, పుత్రం=కుమారుని, ఆరోప్య=ఎత్తికొని, రాజ–ద్వారి=రాజద్వారమున,

బ్రాహ్మణేన = ( ఒక ) బ్రాహ్మణునిచే, స—ఉరః + తాడం = రొమ్ము యొక్క—బాదుకొనుటచే గూడునటుల ( రొమ్ముమోదుకొనుచు ) అబ్రహ్మణ్యం=బ్రాహ్మణుల కత్యాహితమనుమాట ( అసహజమగు మరణవార్త ) ఉద్ఘోషితం=మొఱ్ఱపెట్టఁబడినది; తతః=తరువాత, " రాజ=రాజుయొక్క + అపచారం + అంతరేణ = దుర్వ్యాపారముచేఁగాక, ప్రజాసు=ప్రజలయందు,అకాల-మృత్యుః=కాలముకానికాలమునఁజావు, న + చరతి=కలుగదు, ఇతి=అని, కరుణామయేః=దయామయుఁడగు,రామచంద్రేః=రామచంద్రుఁడు, ఆత్మ=తనయొక్క + దోషం = తప్పిదమును, నిరూపయతి=ఊహించుచుండ, సహసా + ఏవ=వెనువెంటనే, అశరీరిణీ = శరీరములేని, వాక్=మాట ( ఆకాశవాణి ) ఉదచరత్=ఆవిర్భవించెను.

అర్థః— హే రామ=ఓ రాముఁడా, శంబూకః + నామ=శంబూకుఁడను, వృషలః=శూద్రుఁడు, పృథివ్యాం=భూమిపై, తపః+తప్యతే=తపంబొనరించుచున్నవాఁడు; సః=వాఁడు, తే=నీకు, శీర్ష—ఛేద్యః=శిరశ్ఛేదనమున కర్హుఁడు; తం=వానిని, హత్వా=పరిమార్చి, ద్విజం – బ్రాహ్మణుని, జీవయ=బ్రతికింపుము ;

తా॥ శంబూకుఁ డను నొకశూద్రుఁడు భూమియందుఁ దపంబాచరించుచున్నవాఁడు; నీ వేమాత్రము యోజింపక వెంటనే స్వయముగా వాని తల నఱకివైచి భూసురపుత్రుఁ బునర్జీవితునొనర్పుమా.

ఆత్రేయీ:— ఇత్యుపశ్రుత్య కృపాణపాణిః పుష్పకం విమాన మారుహ్య సర్వా దిశో విదిశశ్చ శూద్రతాపసాన్వేషణాయ జగత్పతి శ్చరితు మారబ్ధవాన్.

ఆత్రేయిః— ఇతి=పైవాక్యమును, ఉపశ్రుత్య = విని, కృపాణ = ఖడ్గము + పాణిః=చేతియందుఁగలవాఁడై, పుష్పకం+విమానం = పుష్పక

మను విమానమును, ఆరుహ్య = ఎక్కి, జగత్-పతిః = లోకనాయకుఁడౌ రాముఁడు, సర్వాః=సమస్తమగు, దిశాః=దిక్కులఁగూర్చియు, విదిశః + చ=దిక్కులమూలలఁగూర్చియు, శూద్ర-తాపస = శూద్రమునియొక్క + అన్వేషణాయ=వెదకుటకొఱకై, చరితుం=సంచరించుటకు, ఆరబ్ధవాన్=ప్రారంభించెను.

వాసన్తీ:-శూద్రశ్శంబూకో నామ ధూమపః అస్మిన్నేవ జనస్థానే తపశ్చరతి. తత్; అపి నామ రామభద్రః పున రిదం వన మలంకుర్యాత్.

వాసన్తి:- అధః-ముఖః=క్రిందికి మొగముగలవాఁడై, ధూమపః = పొగను-పానముచేయువాఁడై, శంబూకః + నామ = శంబూకుఁడను, శూద్రః=శూద్రుఁడు, అస్మిన్ + జనస్థానే + ఏవ = ఈజనస్థానమందుననే, తపః=తపస్సును, చరతి=ఒనర్చుచున్నాఁడు; తత్=ఆపక్షమున, రామభద్రః=రామభద్రుఁడు, పునః=మరల, ఇదం + వనం=ఈవనమును, అలంకుర్యాత్ + అపి + నామ =అలంకరించుఁ గాఁబోలును.

ఆత్రేయీ:- భద్రే! గమ్యతేఽధునా.

ఆత్రేయి:-భద్రే=మంగళప్రదురాలా, అధునా=ఇపుడు, గమ్యతే=పోయెద.

వాసన్తీ:- ఆర్యే! ఆత్రేయి! ఏవ మస్తు. కఠోరీభూతస్తు వసః. తథాహి.

శ్లో॥ కండూలద్విపగండపిండకషణోత్కంపేన సంపాతిభి
ర్ఘర్మస్రంసితబంధనైః స్వకుసుమై రర్చంతి గోదావరీం
ఛాయాపస్కిరమాణవిష్కిరముఖవ్యాకృష్టకీటత్వచః
కూజత్క్లాంతకపోతకుక్కుటకులాః కూలే కులాయ

( ఇతి నిష్క్రాన్తే )    [ ద్రుమాః॥

శుద్ధవిష్కంభః.

వాసన్తి:— ఆర్యే=పూజ్యురాలా ! ఆత్రేయి=ఆత్రేయీ, ఏవం+అస్తు=ఇట్లగుఁగాక, దివసః + తు = ( ఈ ) రోజన్ననో, కఠోరీభూతః = కఠోరమైయున్నది; తథా + హి=అదియుక్తమేకదా.

అర్థః—ఛాయా = నీడలయందు + అపస్కిరమాణ = గీఱుచున్న + విష్కిర=పక్షులయొక్క + ముఖ = చంచువులచే + వ్యాకృష్ట = పైకిలాగఁబడిన + కీట=పుర్వులయొక్క + త్వచః=చర్మములు గల్గినట్టియు, కూజత్ = ధ్వనిచేయుచున్నట్టియు + క్లాంత = అలసినట్టియు + కపోత = పావురముల యొక్కయు + కుక్కుట = అడవికోళ్ళయొక్కయు + కులాః = సమూహములుగలట్టియు, కూలే=తీరమునందలి, కులాయ—ద్రుమాః = గూళ్ళుగల వృక్షములు, ఘర్మ = ఎండదెబ్బచే + స్రంసిత = పట్టుదప్పునటులఁజేయఁబడిన + బంధనైః = తొడిమలుకలవిగనుకనే, కండూల = దురదతోఁగూడియున్న + ద్విప = ఏనుఁగులయొక్క + గండ—పిండ=చెక్కిళ్ళు — కండల యొక్క + కషణ = రాయుటవలని + ఉత్కంపేన = కదలికచే, సంపాతిభిః=రాలుచున్న, స్వ = తమయొక్క + కుసుమైః = పువ్వులచే, గోదావరీం=గోదావరీనదిని, అర్చన్తి=పూజించుచున్నవి.

తా॥ ఇదిగో యీ చల్లని చెట్లనీడలఁ జేరి వాయసాదిపక్షులు తమ గోళ్ళతో గీరి బెరడుపగుళ్ళలోనున్న చచ్చిన పురుగులతోళ్ళను ముక్కులతోఁ బైకిలాగి తినుచున్నవి. అదిగో యటుచ బడలిన పావురములు, కోళ్లు మున్నగుపక్షులు గుంపులుగూడి రొదసేయుచున్నవి. ఎండయుబ్బచేతనే తొడిమలు పట్టుదప్పి యుండఁగా మదపుటేనుఁగులు తమ గండపిండముల దురదలఁ బాపికొనుట కటు నిటు స్కంధములపై రాచిరాచి రాపిడి సేయుటచేఁ జలజల రాలుచున్న తమ పూవులచే నీతీరమందలి కులాయ వృక్షములు గోదావరిని బూజించుచున్నవి.

( ఇతి=ఇట్లు, నిష్క్రాంతే=నిష్క్రమించిరి. )

శుద్ధవిష్కంభః = కేవలగీర్వాణభాషగల విష్కంభము.

( తతః ప్రవిశతి సదయోద్యతఖడ్గో రామభద్రః. )

( తతః = పిదప, సదయ = దయతోఁగూడునట్లుగా + ఉద్యత = ఎత్తిపట్టుకొనఁబడిన + ఖడ్గః = కరవాలముగలవాఁడై, రామభద్రః = రామభద్రుఁడు, ప్రవిశతి = ప్రవేశించుచున్నాఁడు. )

రామః:- శ్లో॥ రే హస్త ! దక్షిణ ! మృతస్య శిశో ర్ద్విజస్య
జీవాతవే విసృజ శూద్రమునౌ కృపాణం
రామస్య గాత్రమసి దుర్భరగర్భఖిన్న
సీతావివాసనపటోః కరుణా కుత స్తే॥ ౧౦

( కథంచిత్ ప్రహృత్య ) కృతం రామసదృశం కర్మ. అపి జీవేత్ స బ్రాహ్మణశిశుః ?

రాముఁడు:- అర్థ- రే = ఓపీ ! దక్షిణ + హస్త = దక్షిణకరమా ! ద్విజస్య = బ్రాహ్మణునియొక్క, మృతస్య = చనిపోయిన, శిశోః = కుఱ్ఱవానియొక్క, జీవాతవే = బ్రతుకుటకొఱకు, శూద్రమునౌ = శూద్రమునియందు, కృపాణం = ఖడ్గమును, విసృజ = విడువుము, దుర్భర = భరింపశక్యముగాని + గర్భ = చూలుచే + ఖిన్న = కష్టపడెడి + సీతా = సీతయొక్క + వివాసన = ప్రవాసమున + పటోః = సమర్థుఁడైయున్న, రామస్య = రామునియొక్క, గాత్రం = అవయవమైనదానవు, అసి = అగుచున్నావు, తే = నీకు, కరుణా = దయ, కుతః = ఎందుకు ?

తా॥ ఓదక్షిణహస్తమా ! నీవు, దయాదాక్షిణ్యవిహీనుఁడై నిండుచూలాలనియైనఁ దలంపక నిజపత్నిని ఘోరకాంతారంబుల డించి రమ్మని పంపినరాముని యవయవంబవుకావా ? అట్టినీకును దయయా ! చాలుఁజాలును జాగుచేయక వేనువేంటనే, మృతుఁడగు బ్రాహ్మణశిశువును బునర్జీవితునొనర్చుట కీశూద్రమునిపైఁ గరవాలంబును విసర్జింపుము.

( కథంచిత్=అతికష్టమున, ప్రహృత్య=విసరి ) రామ=రామునకు+సదృశం=తగినపోయిన, కర్మ=పని, కృతం=చేయఁబడినది. బ్రాహ్మణ—శిశుః=బ్రాహ్మణకుమారుఁడు, అపి+జీవేత్=జీవించియుండునా ?

(ప్రవిశ్య) దివ్యపురుషః:—జయతి జయతి దేవః.

శ్లో॥ దత్తాభయే త్వయి యమాదపి దండధారే
సంజీవితః శిశు రసౌ మమ చేయ మృద్ధిః
శంబూక ఏష శిరసా చరణౌ నత స్తే
సత్సంగజాని నిధనాన్యపి తారయ న్తి॥ ౧౧

(ప్రవిశ్య=ప్రవేశించి) దివ్యపురుషుఁడు:—దేవః=ప్రభువు, జయతు+జయతు=జయశీలుఁడగుఁగాక, జయశీలుఁడగుఁగాక.

అర్థః— ఏషః=ఇదుగో, శంబూకః=శంబూకుఁడు; తే=నీయొక్క, చరణౌ=పాదములను, శిరసా=శిరస్సుచే, నతః=నమస్కరించె; యమాత్+అపి=యమునినుండిగూడ, దత్త=ఇవ్వఁబడిన+అభయే=భయాభావముగల, త్వయి=నీవు, దండధారే=( స్వయముగ ) అంతకుఁడవై యుండ, అసౌ=ఈ, శిశుః=( బ్రాహ్మణ ) పిల్లవాఁడు, సంజీవితః=బ్రతికింపఁబడినాఁడు; మమ+చ=నాకును, ఇయం=ఈ, ఋద్ధిః=అభివృద్ధి; ( జాతా=కల్గినది ) సత్=సత్పురుషులయొక్క+సంగ=పొందికవలన+జాని=కలిగెడు, నిధనాని+అపి=మరణములుకూడ, తారయన్తి=తరింపఁజేయును.

తా॥ ఓ రామచంద్రా ! శంబూకుఁడనువాఁడను నేనే; ఇదె నా సాష్టాంగప్రణామము గ్రహింపుము; యముఁడంతవాని నుండియు నభయంబొసంగి నీవే తదంతకత్వమును వహించుటచే బ్రాహ్మణశిశువు పునర్జీవితుఁడాయె; నాకా యిట్టిదివ్యదేహసంపత్తి గల్గె; ఇంతకు యోజింప సజ్జనులచేతఁ జంపఁబడియును దరింపవచ్చును గదా !

రామః:- ద్వయమపి ప్రియం నః త దనుభూయతా ముగ్రస్య తపసః ఫలం.

శ్లో॥ యత్రానందాశ్చ మోదాశ్చ యత్ర పుణ్యాశ్చ సంపదః
వైరాజా నామ తే లోకా స్తైజసా స్సన్తు తే ధ్రువాః ॥

రాముఁడు:— ద్వయం + అపి=రెండును, నః=మాకు, ప్రియం=ఇష్టమే; తత్ =దానఁజేసి, ఉగ్రస్య=ఉగ్రమగు, తపసః=తపస్సుయొక్క, ఫలం= ఫలము, అనుభూయతాం=అనుభవింపఁబడుఁగాక.

అర్థ:—యత్ర=ఏలోకములయందు, ఆనందాః + చ=ఆత్మానుభవజన్య సుఖములును, మోదాః + చ=దివ్యవిషయానుభవజన్య సుఖములును, యత్ర= ఏలోకములయందు, పుణ్యాః=సుకృతజన్యములైన, సంపదః + చ=అణిమాది విభూతులును, (అనుభూయన్తే=అనుభవింపఁబడుచున్నవో) తే=ఆ, వైరాజాః + నామ=వైరాజములను, తైజసాః = తేజోవంతములగు, లోకాః= లోకములు, తే=నీకు, ధ్రువాః=స్థిరమైనవి, సన్తు=అగుఁగాక.

తా॥ ఓశంబూకా! అతిశయ సుఖప్రమోదైశ్వర్యంబుల కాలవాలం బులై, తేజోమయంబులై, పుణ్యైకలభ్యంబులగు వైరాజలోకంబుల నీవు చిరస్థాయివై సుఖింపుమా.

శంబూకః:—యుష్మత్పాదప్రసాదోపాయ ఏష మహిమా న తు తపసః ఫలం. అథవా మహా దుపకృతం తపసా.

శ్లో॥ అన్వేష్టవ్యో యదసి భువనే భూతనాథ శ్శరణ్యో
మా మన్విష్య న్నిహ వృషలకం యోజనానాం శతాని
క్రాన్త్వా ప్రాప్తః స ఇహ తపసాం సంప్రసాదోన్యథా చేత్
క్వాయోధ్యాయాః పునరుపగమో దండకాయాం వనే వః॥

శంబూకుఁడు:— ఏషః=ఈ, మహిమా = మహిమ, యుష్మత్ = మీయొక్క + పాద=చరణములయొక్క + ప్రసాద= అనుగ్రహమే + ఉపాయః=ఉపాయముగాఁగలది; తపసః=(నా) తపస్సుయొక్క, ఫలం=ఫలము, న + తు=కాదుసుమా, అథవా=పక్షాంతరమున, తపసా=తపంబుచే, మహత్_ ఉపకృతం=ఎక్కువయుపకార మొనర్పఁబడినది.

అర్థః— ఇహ = ఈవిషయమున (నా కీపుణ్యలోకప్రాప్తి చేకూరిన విషయమున) భూత–నాథః=భూతవిభుండవును, శరణ్యః = శరణుచొచ్చఁదగినవాఁడవును, భువనే=ప్రపంచమున, అన్వేష్టవ్యః=వెదకఁదగినవాఁడవునగు, త్వం=నీవు, వృషలకం = పనికిమాలినశూద్రుఁడనగు, మాం = నన్ను, అన్విష్యన్=వెదకుచు, యోజనానాం=ఆమడలయొక్క, శతాని=నూరులను, క్రాంత్వా=దాటి, ఇహ=ఇచ్చటికి, ప్రాప్తః=వచ్చితివి, (ఇతి) + యత్ =అనుసంగతి యేదికలదో, సః=అది, తపసాం=తపస్సులయొక్క, సంప్రసాదః=అనుగ్రహము; అన్యథా + చేత్=అటులఁగానిచో, అయోధ్యాయాః= అయోధ్యనుండి, దండకాయాం + వనే = దండకారణ్యమున, వః= తమయొక్క, పునః + ఉపగమః + క్వ=తిరిగివచ్చుటేడ ?

తా॥ ఓ రామా ! నేను తపంబొనర్చినందులకు బొత్తిగా ఫలం బించుకేని లేదని చెప్పరాదు; అదెట్టులన నాతపస్సు మత్పుణ్యలోకప్రాప్తికిఁ బ్రత్యక్షసాధనము కాకున్నను భూతనాథుఁడవును, శరణ్యుఁడవును, యోగిపుంగవాన్వేష్టవ్యుండవును, పరబ్రహ్మస్వరూపుఁడవునగు నీయంతవానినే "ఎచటరా వృషలుఁ"డని వెదకించుచు నాసమీపమునకుఁ గొనివచ్చినది. అటులఁగానిచో నయోధ్యాపట్టణవాసులగు మీ రేడ ! బహుయోజనాంతరగతమగు నీదండకారణ్యమునకు మగుడ వచ్చుటేడ ?

రామః:— కిం నామ దండకేయం ? (సర్వతోఽవలోక్య.)

శ్లో॥ స్నిగ్ధశ్యామాః క్వచి దపరతో భీషణాభోగరూక్షాః
స్థానే స్థానే ముఖరకకుభో ఝాంకృతై ర్నిర్ఝరాణాం
ఏతే తీర్థాశ్రమగిరిసరిద్గర్తకాంతారమిశ్రాః
సందృశ్యన్తే పరిచితభువో దండకారణ్యభాగాః ॥ ౧౪

రాముఁడు:— కిం=ఏమి ! ఇయం=ఇది, దండకా + నామ=దండకారణ్యమా ? ( సర్వతః=అన్నివైపుల, అవలోక్య=చూచి, )

అర్థ:— ఏతే = ఈ, పరిచిత=తెలియఁబడిన + భువః=ప్రదేశములు గల్గినట్టియు, తీర్థ = పుణ్యజలపాతములచేతను + ఆశ్రమ = ఆశ్రమముల చేతను + గిరి = పర్వతములచేతను + సరిత్ = నదులచేతను + గర్త=బిలముల చేతను + కాన్తార = అడవులచేతను + మిశ్రాః = కూడియున్నవిగనుకనే, క్వచిత్=కొన్నిచోట్ల, స్నిగ్ధ=సొంపుగా + శ్యామాః=నల్లనైనట్టియు, అపరతః=మఱికొన్నిచోట్ల, భీషణ=భయంకృతిచేతను + ఆభోగ = విస్తృతి చేతను + రూక్షాః=సొంపుగానుండనట్టియు, స్థానే + స్థానే=అందందు (ఎడనెడ) నిర్ఝరాణాం = సెలయేళ్ళయొక్క, ఝాంకృతైః = ఝాంకారముల చేత, ముఖర=ధ్వనిచేయుచున్న + కకుభః = దిక్కులుకల్గినట్టియు, దండకారణ్య=దండకారణ్యమందలి + భాగాః = ప్రదేశములు, సందృశ్యన్తే = కానఁబడుచున్నవి.

తా॥ సమముగను దట్టముగను బెఱిఁగిన చెట్లగములచే నల్లవారి దర్శనీయములై, వికృతముగను విస్తారముగను బెఱిఁగిన మ్రాకులచే భీకరములై, యెడనెడ నానాముఖములఁ బారుకొండవాగులరొదలచే మాఱుమ్రోగుచుఁ, బుణ్యతీర్థాశ్రమపర్వతనదీగర్తారామములచే సందులేకున్న యీప్రదేశము

లన్నియును నాకుఁ జిరపరిచితములగు దండకారణ్య భూభాగములేయని స్మృతి గలుగుచున్నది.

శంబూకః:—దండకై వేయం. అత్ర కిల పూర్వం నివసతా దేవేన—

శ్లో॥ చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణాం
త్రయశ్చ దూషణఖరత్రిమూర్ధానో రణే హతాః ౨౧

తేన సిద్ధక్షేత్రే జనస్థానే మాదృశామపి భీరుజనానాం అకుతోభయ స్సంచారో జాతః.

శం:—ఇయం=ఇది, దండకా + ఏవ = దండకారణ్యమే; పూర్వం = మున్ను, అత్ర + నివసతా + కిల + దేవేన = ఇచట వసించుచుండఁగ నేకదా దేవరవారిచే—

అర్థ:— భీమ=భయంకరములగు + కర్మణాం=చేష్టలుగల, రక్షసాం = రాక్షసులయొక్క, చతుర్దశ—సహస్రాణి = పదునాలుగువేలమందియు, త్రయః=మూవురగు, దూషణ—ఖర—త్రిమూర్ధానః=దూషణుఁడు—ఖరుఁడు—త్రిశిరసుఁడును, రణే=యుద్ధమున, హతాః=చంపఁబడిరి.

తా॥ రామచంద్రా! ఖరదూషణత్రిశిరః ప్రముఖరాక్షసాధిపులను, దదితర చతుర్దశ సహస్రరాక్షసులను దాము పూర్వ మీదండకయందుండి నప్పుడేగదా సంహరించితిరి.

తేన=దానఁజేసి, సిద్ధ = తపస్సిద్ధులకు + క్షేత్రే = స్థానమగు, జనస్థానే=జనస్థానమున, మాదృశాం=నాబోఁటి, భీరు—జనానాం + అపి = భయపడుజనంబులకుఁగూడ, అకుతోభయః=నిర్భయమగు, సంచారః = సంచారము, జాతః=కలిగినది.

రామః:—న కేవలం దండకా; జనస్థానమపి ?

రాముఁడు:— న + కేవలం + దండకా = దండకమాత్రమే కాక, జనస్థానం + అపి = జనస్థానముకూడనా ?

శంబూకః :- బాఢం ఏతాని ఖలు సర్వభూతలోమహర్షణాని ఉన్మత్తచండశ్వాపదకులసంకులగిరిగహ్వరాణి జనస్థానపర్యంత దీర్ఘారణ్యాని దక్షిణాం దిశ మభివర్తన్తే. తథాహి.

శ్లో॥ నిష్కూజస్తిమితాః క్వచి త్క్వచిదపి ప్రోచ్చండసత్వస్వనాః
స్వేచ్ఛాసుప్తగభీరభోగభుజగశ్వాసప్రదీప్తాగ్నయః
సీమానః ప్రదరోదరేషు విలసత్స్వల్పాంభసో యాస్వయం
తృష్యద్భిః ప్రతిసూర్యకై రజగరస్వేదద్రవః పీయతే॥ ౧౬

శం:— బాఢం = ఔను, ఏతాని + ఖలు = ఇవియేకదా, సర్వ = సమస్తమైన + భూత = భూతములకు + లోమ-హర్షణాని = గగుర్పాటుగలిగించునట్టియు, ఉన్మత్త = మదించినట్టియు + చండ = భయంకరమైనట్టియు + శ్వాపద = మాంసాహారజంతువులయొక్క + కుల = సమూహములచే + సంకుల = నిండిన + గిరి—గహ్వరాణి = పర్వతగుహలుగలట్టియు, జనస్థాన = జనస్థానముయొక్క + పర్యంత = ప్రాంతభాగములయందున + దీర్ఘ = పొడుగైన + అరణ్యాని = అడవులు, దక్షిణాం + దిశం = దక్షిణపుదిక్కువైపునకు, అభివర్తన్తే = వ్యాపించియున్నవి. తథా—హి = అగునుగదా.

అర్థః— ప్రదర = గుహలయొక్క + ఉదరేషు = మధ్యభాగములయందు, విలసత్ = ప్రకాశించుచున్న + స్వల్ప—అంభసః = కొద్దినీరుగల, సీమానః = ప్రదేశములు, క్వచిత్ = కొన్నితావుల, నిష్కూజ = ధ్వనులులేకుంటచే + స్తిమితాః = నిశ్చలములైనవిగాను, క్వచిత్ = మఱికొన్నితావుల, ప్రోచ్చండ = మిగుల భయంకరములైన + సత్వ = మృగములయొక్క + స్వనాః + అపి = నాదములుగలవిగాను, స్వేచ్ఛా = ఇష్టమువచ్చినటుల + సుప్త = నిద్రించుచున్నట్టియు +

గభీర=గొప్పవగు + భోగ=పడగలుగల + భుజగ = సర్పములయొక్క + శ్వాస=నిట్టూర్పులచే + ప్రదీప్త=రగులుకొనిన + అగ్నయః = అగ్నులుకలవి గాను, దృశ్యన్తే=కానఁబడుచున్నవి; యాసు=ఏప్రదేశములయందు, తృష్యద్భిః=దప్పిగొన్న, ప్రతిసూర్యకైః=తొండలచే, అయం=ఈ, అజగర=కొండచిలువలయొక్క + స్వేద=చెమటయొక్క + ద్రవః=ద్రవము, పీయతే=త్రాగఁబడుచున్నదో.

తా॥ ఔను; తెలిసినది; ఇది దండకారణ్యభాగమే; ఒకచో నిశ్శబ్దంబులైనట్టియు, వేఱొకచో మిక్కిలి భయంకరంబులైన సత్త్వముల ఘోషంబులచేఁ బ్రతిధ్వనించునట్టియు, వేఱొకచో యథేచ్ఛగ నిద్రించుచు గుఱ్ఱుపెడు సర్పరాజంబుల నిట్టూర్పులచే రగులుకొనిన యగ్నిహోత్రములు గల్గినట్టియుఁ, బ్రదేశంబు లవిగో కానవచ్చుచున్నవి; అదిగో వేఱొకచో స్వల్పజలపూర్ణంబులై యొప్పునీగిరికందర మధ్యభాగంబుల, స్వేదజలంబుల వెడలఁగ్రక్కుచు నిద్రించు కొండచిలువలఁజేరి కృకలాసంబులు దప్పిక నాపలేక యథేచ్ఛగఁ దత్స్వేదజలంబుఁ గ్రోలుచున్నవి.

రామః:—శ్లో॥ పశ్యామి చ జనస్థానం భూతపూర్వఖరాలయం
ప్రత్యక్షా నివ వృత్తాన్తాన్ పూర్వా ననుభవామి చ॥

(సర్వతో౽వలోక్య) ప్రియారామా హి వైదేహ్యాసీత్. ఏతాని తాని నామ కాంతారాణి. కి మతః పరం భయానకం స్యాత్. (సాస్రం)

రాముఁడు:—భూతపూర్వ=పూర్వమందున్న + ఖర=ఖరనామకదైత్యునియొక్క + ఆలయం=నివాసమగు, జనస్థానం=జనస్థానమును, పశ్యామి + చ=చూచుచున్నాను; పూర్వాన్ = పూర్వపు, వృత్తాంతాన్=వార్తలను, ప్రత్యక్షాన్ + ఇవ=కనులయెదుటజరుగువానినివలె, అనుభవామి + చ= అనుభవించుచున్నాను.

తా॥ పూర్వమున ఖరాసురనివాసమైతనరు నీజనస్థానంబును గనులారఁ గాంచుచునేయున్నాఁడ; మఱియుఁ, బూర్వ మీప్రదేశమున జరిగినవృత్తాంత ములనన్నిటిని బ్రత్యక్షముగ జరుగుచున్నవానిఁగా ననుభవించుచునున్నాఁడ.

(సర్వతః=అన్నివైపుల, అవలోక్య=చూచి) సర్వథా=అన్నివిధ ములచే, వైదేహీ=సీత, ప్రియ=ఇష్టమైన+ఆరామా = వనప్రదేశములుగలది ఆసీత్+హి=ఐయుండెఁగదా, ఏతాని=ఈకానవచ్చునవి, తాని+నామ+ కాంతారాణి = ఆ ( సీతకుఁ బ్రియములగు ) యరణ్యములే; అతః+ పరం=ఇంతకన్నను, భయానకం=భయంకరమైనది, కిం+స్యాత్ = ఏమి యుండును. ( సాస్రం=కన్నీటితో )

రామః:—

శ్లో॥ త్వయా సహ నివత్స్యామి వనేషు మధుగంధిషు
ఇతీవారమ తే హాసా స్నేహ స్తస్యాః స తాదృశః॥

శ్లో॥ న కించిదపి కుర్వాణః సౌఖ్యై ర్దుఃఖా న్యపోహతి
త త్తస్య కిమపి ద్రవ్యం యో హి యస్య ప్రియో జనః॥

రాముఁడు:—అర్థ:— త్వయా+సహ=నీతోఁగూడ, మధు—గంధిషు= మకరందపరిమళములుగల, వనేషు=వనములయందు, నివత్స్యామి=నివసిం పఁగలను, ఇతి=అని, ఇహ=ఇచట ( ఈ దుర్గమకాంతారమున ) అసౌ=ఈ సీత, అరమత+ఇవ = ఆనందించినట్లుండెను; తస్యాః = ఆమెయొక్క, స్నేహః = ( నాయందలి ) స్నేహము, తాదృశః=అట్టిది.

తా॥ నాథా ! మకరందసువాసితములగు నీ కాంతారంబుల మీతోఁ గూడి చరించుచుందు నని వక్కాణించుచు నధికసంతోషంబున నీ విపినంబు నే రాజమందిరముగా నెంచుచు నా ప్రేయసి విహరింపఁదొడఁగె; నాపై నామెకుఁగల ప్రేమ యెట్టిదోకదా.

అర్థః:— యః=ఎవఁడు, యస్య=ఎవనికి, ప్రియః=ఆప్తుఁడగు, జనః= జనమో, తత్=అది, తస్య=వానికి, కిం + అపి + ద్రవ్యం + హి = అనిర్వాచ్యమగుభాగ్యముసుమా; సః=వాఁడు, కించిత్ + అపి + న + కుర్వాణః = ఏమియుఁ జేయనప్పటికిని, సౌఖ్యైః=సుఖసంతానంబులచే, దుఃఖాని = చింతలను, అపోహతి=పోఁగొట్టును.

తా॥ ఆప్తతముఁడగు హితుని గల్గియున్నవాని భాగ్యమే భాగ్యము; అట్టివాఁ డేమియుఁజేయక మిన్నకయుండినవాఁడయ్యు హితునిదుఃఖంబుల రూపుమాపఁగలఁడు.

శంబూకః:- తదల మేభి ర్దురాసదైః. అథైతాని మదకల మయూరకంఠకోమలచ్ఛవిభి రవకీర్ణాని పర్వతై రవిరలనివిష్ట నీలబహులచ్ఛాయాతరుషండమండితా న్యసంభ్రాంత వివిధ మృగయూథాని పశ్యతు మహాభాగః ప్రశాంతగంభీరాణి శ్వాపదకులశరణ్యాని మహారణ్యాని.

శం:— తత్=అందువలన, దురాసదైః=దుర్గమంబులగు, ఏభిః=వీనిచే, అలం=చాలును; అథ=అటుపై, మద=ఆనందముచే + కల=మధురమగు + మయూర=నెమిలియొక్క + కంఠ=కంఠమువలెనే + కోమల= మంజులములగు + ఛవిభిః=కాంతులుగల, పర్వతైః=పర్వతములచే, అవకీర్ణాని=వ్యాప్తంబులైనట్టియు, అవిరల=ఎడములేక + నివిష్ట=పెరిగిన + నీల=నల్లనైన + బహుల=అనేకములైన + ఛాయా=ఛాయాప్రధానములైన + తరు=వృక్షముల యొక్క + షండ = సమూహముచే + మండితాని = అలంకరింపఁబడినట్టియు, అసంభ్రాంత=భయమొందని + వివిధ=పలువిధములగు + మృగ = మృగముల యొక్క + యూథాని= గుంపులుగలట్టియు, శ్వాపద-కుల=హింసాత్మకజంతు -సంతానమునకు + శరణ్యాని=శరణుఁజొచ్చఁదగినట్టియు, ఏతాని = ఈ,

ప్రాంత=శాంతియుక్తములై + గంభీరాణి = చోరనలవికానట్టియు, మహా
రణ్యాని = మహారణ్యములను, మహాభాగః = మహానుభావుఁడవగునీవు,
పశ్యతు=దర్శింతువుగాక.

శంబూకః:—శ్లో॥ ఇహ సమదశకుంతాక్రాంతవానీరముక్త
ప్రసవసురభిశీతస్వచ్ఛతోయా వహంతి
ఫలభరపరిణామశ్యామజంబూనికుంజ
స్ఖలనముఖరభూరిస్రోతసో నిర్ఝరిణ్యః ॥ ౨౦

అపి చ; శ్లో॥ దధతి కుహరభాజామత్ర భల్లూకయూనా
మనురసితగురూణి స్త్యాన మంబూకృతాని;
శిశిరకటుకషాయః స్త్యాయతే సల్లకీనా
మిభదలితవికీర్ణగ్రంథినిష్యందగంధః ॥ ౨౧

శం:— అర్థ:—ఇహ=ఇచట, సమద=మదముతోఁగూడిన + శకుంత=
పక్షులచే + ఆక్రాంత = ఆక్రమింపఁబడిన + వానీర = ప్రబ్బలిచెట్లచే +
ముక్త=విడువఁబడిన + ప్రసవ=పుష్పములచే + సురభి= పరిమళించుచున్న
ట్టియు + శీత = చల్లనైనట్టియు + స్వచ్ఛ=నిర్మలమైనట్టి + తోయాః=ఉద
కములుగలట్టియు, ఫల=పండ్లయొక్క + భర=రాశియొక్క + పరిణామ=
వ్యాప్తిచే + శ్యామ=నల్లనగు + జంబూ = నేరేడుచెట్లయొక్క + నికుంజ=
పొదలయందు + స్ఖలన=పొరలుటచే + ముఖర=ధ్వనించుచున్న + భూరి=అధి
కములగు + స్రోతసః = ప్రవాహములుగలట్టియు, నిర్ఝరిణ్యః = సెలయేళ్ళు,
వహన్తి=పారుచున్నవి.

తా॥ రామా! ఈ ప్రదేశంబులఁ జూచితివా? మదించిన పక్షిసంతతు
లాప్రబ్బలిచెట్లపై వాలుటవలన వెనువెంటనే తద్వృక్షంబులనుండి రాలిన

పుష్పవితానంబుచే సువాసితంబులై మఱియు శీతలంబులును స్వచ్ఛంబులు నై చను జలంబులుగల్గి, పరిపక్వదశనొందిన ఫలసంతతిచే మిక్కిలినల్లనై వెలుగొందు నేరేడుచెట్లపొదలగుండ ధ్వనిసేయుచుఁ బారుప్రవాహంబులతోఁ గూడినపర్వతనదు లవిగో.

అపి+చ=అంతియకాక

అర్థః— అత్ర=ఇచట, కుహర = గుహలను+భాజాం = పొందిన, భల్లూక=ఎలుగుబంట్ల+యూనాం=పిల్లలయొక్క, అనురసిత = ప్రతిధ్వనులచే+గురూణి=గొప్పవైన, అంబూకృతాని = ఘూత్కారములు ( అనఁగా నుమ్మివేయునపుడు కల్గుధ్వనులు ) స్త్యానం=వృద్ధిని, దధతి=పొందుచున్నవి; సల్లకీనాం=అందుగుచెట్లయొక్క, శిశిర = చల్లనైనట్టియు+కటు = కారము గలట్టియు+కషాయః=చేదైనట్టియు, ఇభ=ఏనుఁగులచే+దళిత = చీల్పఁబడినట్టియు+వికీర్ణ = చెదరిపోయినట్టియు+గ్రంథి = కొమ్మలసంధిభాగముల సంబంధమైన+నిష్యంద = స్రవించుక్షీరముయొక్క+గంధః = సువాసన, స్త్యాయతే=అభివృద్ధిచెందుచున్నది.

తా॥ రామా ! ఈతావున గుహలయందు నంబూకృతమొనర్చు పిల్లయెలుఁగుల యెలుంగులచేఁ బ్రతిధ్వనులు పిక్కటిలుచున్నవి; వేఱొకతావున గజంబులు సల్లకీవృక్షముల డాసి కొమ్మలవిఱచి చెల్లాచెదరుచేయుటచే శాఖాసంధులనుండి స్రవించుతిక్తకటుకషాయంబగు క్షీరగంధము వెల్లువిరియుచున్నది.

రామః— ( సబాష్పస్తంభం ) భద్ర ! శివాస్తే పంథానః దేవయానం ప్రతిపద్యస్వ పుణ్యేభ్యః లోకేభ్యః.

రాముఁడు:— ( సబాష్పస్తంభం = కన్నీరునాపుటతోఁ గూడునట్లు ) భద్ర=ఓయీ, తే=నీయొక్క, పంథానః=మార్గములు, శివాః=శుభప్రదంబులగుఁగాక. పుణ్యేభ్యః=పవిత్రములగు, లోకేభ్యః = లోకములకొఱకై

(పుణ్యలోకగమనార్థము) దేవయానం = దేవతలచేనంపఁబడిన విమానమును, ప్రతిపద్యస్వ=కైకొనుము (ఎక్కుము)

శంబూకః:-యావత్ పురాణబ్రహ్మవాదిన మగస్త్య మృషి మభివాద్య శాశ్వతం పద మనుప్రవిశామి. (ఇతి నిష్క్రాంతః.)

శంబూకః:- పురాణ=పురాతనుఁడగు + బ్రహ్మ-వాదినం=బ్రహ్మవాదియైన, అగస్త్యం + ఋషిం=అగస్త్యమునిని, అభివాద్య=నమస్కరించి, శాశ్వతం=శాశ్వతమగు, పదం = పదవిని, యావత్ + అనుప్రవిశామి = ఇదిగో చేరెదను. (ఇతి=అని, నిష్క్రాంతః=చనెను)

రామః:-

శ్లో॥ ఏత త్పున ర్వన మహో కథ మద్య దృష్టం
యస్మి న్నభూమ చిరమేవ పురా వసంతః
ఆరణ్యకాశ్చ గృహిణశ్చ రతా స్స్వధర్మే
సాంసారికేషు చ సుఖేషు వయం రసజ్ఞాః॥ ౨౨

రాముఁడు:-అర్థః- యస్మిన్=ఏవనమందు, పురా=మున్ను, చిరం+ఏవ=చాలకాలమువఱకును, వసంతః=నివసించుచున్న, ఆరణ్యకాః+చ = మునివృత్తిగల్గినట్టియు, గృహిణః + చ = గృహస్థులమైనట్టియు, వయం = మేము, స్వధర్మే=స్వధర్మమందు, రతాః = కోర్కెగలవారమై, సాంసారికేషు=సంసారసంబంధమగు, సుఖేషు=సుఖములయందు, రసజ్ఞాః + చ=సారస్యమెఱింగినవారము, అభూమ=అయితిమో, (తత్ = ఆ) వనం=వనము, ఏతత్=ఇదిగదా! పునః=మగుడ, కథం=ఎట్లు, దృష్టం=చూడఁబడినది.

తా॥ మున్ను మేమే ప్రదేశంబుల, ధర్మైకదీక్షితులమును, గృహస్థులమునై చిరకాలము సాంసారికసౌఖ్యరసంబు ననుభవించుచుఁ గాపుర మొనర్చితిమో యట్టివనప్రదేశములు మరలఁ గానఁబడినవికదా.

రామః :–శ్లో॥ ఏ తే త ఏవ గిరయో విరువన్మయూరా
స్తాన్యేవ మత్తహరిణాని వనస్థలాని
ఆమంజువంజులలతాని చ తాన్యమూని
నీరంధ్రనీలనిచులాని సరిత్తటాని ॥ ౨౩

రాముఁడు:– ఏతే = ఈ, విరువత్ = ధ్వనిచేయుచున్న + మయూ రాః = నెమిళ్ళుగల, గిరయః = పర్వతములు, తే + ఏవ = అవియే, మత్త = మదించిన + హారిణాని = లేళ్ళుగల, వన–స్థలాని = వనప్రదేశములు, తాని + ఏవ = అవియే; అమూని = ఈ, ఆమంజు = మిక్కిలిరమ్యమగు + వంజుల-లతాని = వేతసలతలుకల్గినట్టియు, నీరంధ్ర = దట్టమైనట్టియు + నీల = నల్లనైనట్టియు + నిచులాని = గన్నేరుచెట్లుగల్గినట్టియు, సరిత్–తటాని + చ = నదీతీరములును, తాని + ఏవ = అవియే.

తా॥ కలనాదంబులొనర్చు మయూరంబుల కావాసంబులగు నీపర్వతములు, మత్తహారిణ సంచారయోగ్యంబులగు నీవనస్థలులును, గొన్నిపట్ల రమ్యములగు వేతసలతలతోఁగూడి, మఱికొన్నిపట్ల నల్లనై క్రిక్కిరిసి మొల చిన నిచులవృక్షములతోనిండిన సరిత్తటంబులును బూర్వము నే వనవాస మొనర్చువేళనున్నటులనే యున్నవి; మార్పేమియుఁ గానవచ్చుటలేదు.

రామః:–శ్లో॥ మేఘమాలేవ య శ్చాయ మారాదపి విభావ్యతే
గిరిః ప్రస్రవణ స్సోయం యత్ర గోదావరీ నదీ ॥

రాముఁడు:–అర్థః– యత్ర = ఎచట, (ఏపర్వతసమీపమున) గోదావరీ + నదీ = గోదావరీనది, (అస్తి = కలదో) అయం + చ = ఈ యెదుటఁగనఁబడు, యః = ఎయ్యది, ఆరాత్ + అపి = సమీపమునందుండియు, మేఘమాలా + ఇవ = మేఘపంక్తివలె, విభావ్యతే = ఊహింపఁబడుచున్నదో, సః + అయం + గిరిః = ఆ యీపర్వతము, ప్రస్రవణః = ప్రస్రవణనగము.

తా॥ దాపునకు వచ్చినను మహోన్నతశిఖరసంక్రాంతంబౌట మేఘమాలకైవడిఁ గానఁబడు నీ పర్వతము ప్రస్రవణమే; అదిగో యచటనే గోదావరీనదియుఁ బ్రవహించుచున్నది.

రామః:—

శ్లో॥ అస్యై వాసీ న్మహతి శిఖరే గృధ్రరాజస్య వాస
స్తస్యాధస్తా ద్వయమపి రతా స్తేషు పర్ణోటజేషు
గోదావర్యాః పయసి వితతశ్యామలానోకహశ్రీ
రంతఃకూజన్ముఖరశకునో యత్ర రమ్యో వనాన్తః.

రా:—అర్థ:— అస్య = ఈపర్వతముయొక్క, మహతి = గొప్పదగు, శిఖరే+ఏవ=శిఖరమందే, గృధ్ర—రాజస్య=జటాయువుయొక్క, వాసః = నివాసము, ఆసీత్ =ఉండెను; తస్య = ఆ జటాయువుయొక్కవాసస్థానమునకు, అధస్తాత్ = క్రింద, వయం+అపి = మేముకూడను, తేషు = ఆ, పర్ణ-ఉటజేషు=పర్ణశాలలయందు, రతాః=సంచరించుచు, (అస్మ=ఉంటిమి;) యత్ర=ఏప్రదేశములయందు, గోదావర్యాః=గోదావరీనదియొక్క, పయసి= నీటియందు, వితత=విస్తరింపఁజేయఁబడినట్టియు+శ్యామల=నల్లనైనట్టియు+ అనోకహ=వృక్షములయొక్క+శ్రీః=సంపదగల్గినట్టియు, అంతః=లోపల+ కూజత్ =కూయుచు + ముఖర=ధ్వనిచేయుచున్న + శకునాః= పక్షులుగలట్టియు, వన—అంతః=వనాంతము, రమ్యః=సొంపైనది, ఆసీత్ =అయెను.

తా॥ ఈప్రస్రవణ నగశిఖరాగ్రంబుననే జటాయువు మున్ను వసించియుండువాఁడు; మేమును దత్పర్వతాధోభాగంబుననే పర్ణశాలల సుఖముండితిమి; మేమున్నప్రదేశములకు సమీపముననే వనవీథులు, ఒకవంకఁ దమ పచ్చనికొమ్మల గోదావరీనదియందుఁ బ్రతిబింబింపఁజేసి నయనానందకరంబులై దనరుచుండె; మఱొకవంకఁ జెట్లగుబురులఁబక్షిసంతతులు ధ్వనించుచు శ్రవణానందం బొసంగుచుండె.

రామః:- అత్రైవ సా పంచవటీ యత్ర చిరనివాసేన వివిధ విస్రంభాతిప్రసంగసాక్షిణః ప్రదేశాః, ప్రియాయాః ప్రియ సఖీ వాసన్తీ చ ప్రతివసతి. తత్ కిమిద మాపతిత మద్య రామహతకస్య. సంప్రతి హి.

శ్లో॥ చిరా ద్వేగారంభీ ప్రసృత ఇవ తీవ్రో విషరసః
కుతశ్చి త్సంవేగా త్ప్రచల ఇవ శల్యస్య శకలః
వ్రణో రూఢగ్రంథిః స్ఫుటిత ఇవ హృన్మర్మణి పునః
పురాభూత శ్శోకో వికలయతి మాం నూతన ఇవ॥ ౨౬

రాముఁడు:- యత్ర = ఎచ్చటి, ప్రదేశాః=స్థానములు, చిర=చాల కాలము + నివాసేన =కాపురముంటచే, వివిధ=అనేకవిధములగు + విస్రంభ =స్వచ్ఛందవిలాసములకును + అతిప్రసంగ=బహుసంస్థితులకును + సాక్షిణః =సాక్షీభూతములు, ( ఆసన్=ఆయెనో ) యత్ర=ఎచట, ప్రియాయాః= ( నా ) ప్రియురాలియొక్క, ప్రియ=ప్రేమాస్పదురాలగు + సఖీ = చెలి యగు, వాసన్తీ+చ = వాసంతియు, ప్రతివసతి = నివసించెడునో, సా= ఆప్రసిద్ధమగు, పంచవటీ=పంచవటి, అత్ర+ఏవ=ఇచటనే. తత్ =కాన, అద్య=ఇపుడు, రామ-హతకస్య = ఈపాపిష్ఠిరామునకు, కిం+ఇదం+ ఆపతితం=ఏమిసంభవింపనున్నదో ? సంప్రతి+హి=ఇపుడన్నో.

అర్థః-తీవ్రః= భయంకరమైనదై, చిరాత్=చాలకాలమునకు, వేగ- ఆరంభీ=వేగమగునారంభముకలదై, ప్రసృతః = ( శరీరమున ) వ్యాపించిన, విష-రసః+ ఇవ=విషముయొక్క-రసమువలెను; కుతశ్చిత్ = ఏదియొకయొక కైన, సంవేగాత్=వేగమువలన, ప్రచలః=కలకఁబారిన, శల్యస్య=బాణము యొక్క, శకలః+ఇవ = తునకవలెను; హృత్ = హృదయముయొక్క+ మర్మణి=మర్మస్థానమునందు, రూఢ= (ఎడగట్టి) పెరిగిన+గ్రంథిః=గడ్డ

గర్భితై, పునః = మగుడ, స్ఫుటితః = భిన్నమైన, వ్రిణః + ఇవ = పుండువలెను, పురా—భూతః=వెనుకననుభవింపఁబడిన, శోకః = దుఃఖము, నూతనః+ఇవ = క్రొత్తదివలె, మాం = నన్ను, వికలయతి = ఎక్కువగఁ గలఁతఁ బెట్టుచున్నది.

తా॥ చాలకాలముక్రిందట శమించియు, నోకానొకప్పటి కెంతయో వేగముగ దేహమునందంతటను వ్యాపించు తీవ్రవిషరసమువలెను, ఏకాలంబు ననో దేహమున నాటుకొనిపోయి కారణాంతరముచేఁ గలకవారిన బాణశకలంబు చండముగను, హృదయమునందలి మర్మస్థలంబున నణఁగినట్లుండియు నెడగట్టి మరల గడ్డువారి ప్రిభిన్నమగు వ్రిణము వడువునను, బహుకాలము క్రింద ననుభవింపఁబడి మఱపువట్టిన నాదుఃఖ మిప్పుడు మరల నూతనమై నదిగాఁ దోఁచుచు నన్ను వివశునిగాఁ జేయుచున్నది.

రామః:— తథాపి తాన్ పూర్వసుహృదో భూమిభాగాన్ పశ్యామి. ( నిరూప్య ) అహో ! అనవస్థితో భూమిసన్నివేశః. తథాహి.

శ్లో॥ పురా యత్ర స్రోతః పులిన మధునా తత్రి సరితాం
విపర్యాసం యాతో ఘనవిరలభావః క్షితిరుహాం
బహోః కాలా ద్దృష్టం కాలా దపరమివ మన్యే వన మిదం
నివేశ శ్శైలానాం తదిద మితిబుద్ధిం ద్రిఢయతి ॥ ౨౭

రాముఁడు:- తథా + అపి=అయినను, పూర్వ = మున్ను + సుహృదః = పరిచితములైన, తాన్ = ఆ, భూమిభాగాన్ = భూప్రిదేశముల, పశ్యామి=చూచెదను; ( నిరూప్య=పరికించి ) అహో = ఓహో; భూమి = భూమియొక్క + సన్నివేశః = ఉనికి, అనవస్థితః = మార్పుచెందినది; తథా + హి=అటులే కదా.

అర్థ:— యత్ర=ఎచట, పురా=మున్ను, సరితాం=నదులయొక్క, స్రోతః=ప్రవాహము, ( ఆసీత్=ఉండెనో ) తత్ర=అచట, అధునా = ఇపుడు, పులినం = ఇసుకతిన్నె, ( దృశ్యతే = కానఁబడుచున్నది. ) క్షితిరుహాం=వృక్షములయొక్క, ఘన—విరళభావః=క్రిక్కిరియుట పలచబడుటయు, విపర్యాసం=వ్యత్యాసమును, యాతః=పొందినది; బహోః—కాలాత్=చాలకాలమైనపిదప, దృష్టం=చూడఁబడిన, ఇదం + వనం=ఈవనమును, అపరం + ఇవ = వేరైనదానినిగా, మన్యే=తలఁచుచున్నాను; ( కింతు= అయిన ) శైలానాం=పర్వతములయొక్క, నివేశః=ఉనికి, ఇదం=ఈవనము, తత్=అని ( నేను మున్ను చూచినది ) ఇతి=అని, బుద్ధిం=బుద్ధిని, ద్రఢయతి=రూఢిచేయుచున్నది.

తా॥ పూర్వము మే మిందువశించువేళ నీ నదులయం దేస్థానముల జలము ప్రవహించుచుండెనో యిపు డాస్థానముల నిసుక తిన్నెలు కానవచ్చుచున్నవి; తొంటిసాంద్రవృక్షస్థానంబు లిపుడు విరళంబులుగను, నాఁటి విరలవృక్షప్రదేశంబు లిపుడు సాంద్రంబులుగను గానఁబడుచున్నవి; చాల కాలమైనవెనుకఁ జూచుటచే నీవనమంతయుఁ బెక్కుమార్పులఁజెంది, యింతకుమున్ను జూచితినా లేదాయనుశంకను గల్గించుచున్నను, నిశ్చలములగు పర్వతములచేఁ బూర్వము నేఁజూచినవన మిదియేయని రూఢియగుచున్నది.

రామః:— హన్త ! పరిహరంతమపి మా మితః పంచవటీస్నేహో బలా దాకర్షతీవ ( సకరుణం )

శ్లో॥ యస్యాం తే దివసా స్తయా సహ మయా నీతాః పునః
యత్సంబంధికథాభిరేవ సతతం దీర్ఘాభిరస్థీయత [ స్వే గృహే
ఏకః సంప్రతి నాశితప్రియతమ స్తా మద్య రామః కథం
పాపః పంచవటీం విలోకయతు వా గచ్ఛత్వసంభావ్య వా॥

రాముఁడు:— హంత=అయ్యో ! పరిహరంతం + అపి = వదలిపోవు చున్నను, పంచవటీ - స్నేహః=పంచవటియందలి స్నేహము, మాం=నన్ను, ఇతః = ఈవైపునకు, బలాత్ = బలవంతముగా, ఆకర్షతి + ఇవ=ఆకర్షించుచున్నటులున్నది ( సకరుణం=దైన్యము గల్గునట్లు. )

అర్థః— తయా + సహ=ఆసీతతోఁగూడి, మయా=నాచే, యస్యాం= ఏపంచవటియందు, తే=ఆ, దివసాః=రోజులు, నీతాః = జరుపఁబడినవో; పునః=తిరిగి, స్వే=స్వకీయమగు, గృహే=ఇంటియందు, దీర్ఘాభిః=దీర్ఘములైన, యత్=ఏపంచవటికి + సంబంధి = సంబంధించిన + కథాభిః + ఏవ= కథలచేతనే, సతతం=ఎల్లపుడు, అర్థీయత=గడుపఁబడినదియో, తాం=ఆ, పంచవటీం = పంచవటిని, సంప్రతి = ఇపుడు, నాశిత = పోఁగొట్టుకొనఁబడిన + ప్రియతమః= ప్రియనిగలవాఁడుగనుకనే, పాపః = పాపియగు, రామః = రాముఁడు ( నేను ) కథం = ఎట్లు, అద్య = ఇపుడు, ఏకః=ఒంటరిగనే, విలోకయతు + వా=చూడవలసినదా; అథవా=కానిచో, అసంభావ్య=సన్మానింపకయే, గచ్ఛతు + వా= వెళ్ళవలయునా.

తా॥ మున్ను బహుకాలము మైత్రేయసీ సహితుఁడనై నే నీపంచవటియందుఁ గాపురమొనర్చి రోజులఁగడపితి; అంతియకాక వనవాసానంతరము గృహంబునకు మరలి దివ్యప్రాసాదంబుల సుఖముండు వేళలయందు సైత మేతత్పంచవటీకథాగోష్ఠియందే సభార్యుఁడనై కాలక్షేపమొనర్చుచు బ్రహ్మానందమొందుచుంటి; ఇపుడు నష్టభార్యుఁడనై, సమస్తవిధములచేఁ బరమపాపినగు నే నేకాకినై యీపంచవటినిఁ బ్రవేశించుట యుక్తమా లేక దీనిమాటయే తలపెట్టక పోవుట యుక్తమా.

( ప్రవిశ్య ) శంబూకః:— జయతు జయతు దేవః. దేవ ! భగవా నగస్త్యః మత్తః శ్రుతభవత్సన్నిధాన స్త్వామాహ—

పరికల్పితవిమానావతరణమంగలా ప్రతీక్షతే వత్సలా లోపా ముద్రా, సర్వే చ మహర్షయః; తదేహి సంభావయాస్మాన్. అథ ప్రజవినా పుష్పకేన స్వదేశ ముపగమ్య అశ్వమేధాయ సజ్జో భవిష్యసి—ఇతి.

(ప్రవిశ్య=ప్రవేశించి) శంబూకుఁడు:— దేవః=ప్రభువులవారు, జయతు + జయతు=జయించుఁగాక; జయించుగాఁక; భగవాన్=పూజ్యుఁడగు, అగస్త్యః=అగస్త్యముని, మత్తః=నావలన, శ్రుత = వినఁబడిన + భవత్=తమయొక్క + సన్నిధానః=సాన్నిధ్యముకలవాఁడై, త్వాం=తమరిని గూర్చి, పరికల్పిత = సిద్ధమొనర్పఁబడిన + విమాన = విమానమునుండి + అవతరణ = దిగుటకొఱకు + మంగలా = మంగళద్రవ్యములు గలదగుచు, వత్సలా=వాత్సల్యయుక్తయగు, లోపాముద్రా = (అగస్త్యభార్యయగు) లోపాముద్ర, ప్రతీక్షతే = ఎదురుచూచుచున్నది; సర్వే + ఋషయః + చ=అందఱు మునులును, నిరీక్షన్తే=ఎదురుచూచుచున్నవారు. తత్=అందువలన, ఏహి=రమ్ము, అస్మాన్ = మమ్ములను, సంభావయ = ఆదరింపుము. అథ=అటుపై, ప్రజవినా=మిక్కిలి వేగముగల, పుష్పకేన=పుష్పకవిమానముచే, స్వ—దేశం = స్వదేశమునుగూర్చి, ఉపగమ్య = సమీపించి, అశ్వమేధాయ=అశ్వమేధయాగముకొఱకు, సజ్జః=సిద్ధమైనవాఁడవు, భవిష్యసి=కాఁగలవు, ఇతి=అని, ఆహ=పల్కెను.

రామః:— యథాజ్ఞాపయతి భగవాన్.

రాముఁడు:— భగవాన్ = పూజ్యుఁడగు నగస్త్యుఁడు, యథా + ఆజ్ఞాపయతి=ఆజ్ఞాపించినటులనే (కరిష్యామి=చేసెదను.)

శంబూకః :— ఇతస్తర్హి దేవః ప్రవర్తయతు పుష్పకం.

శం:— తర్హి=అటులైన, దేవః = దేవరవారు, పుష్పకం = పుష్పకవిమానమును, ఇతః=ఈవైపునకు, ప్రవర్తయతు=మరలింతురుగాత.

రామః :— భగవతి పంచవటి ! గురుజనోపరోధాత్ క్షణం క్షమ్యతా మతిక్రమో రామస్య.

రాముఁడు:— భగవతి=పూజ్యురాలా ! పంచవటి=పంచవటీ ! గురుజన = గురుజనముయొక్క + ఉపరోధాత్ = నిర్బంధమువలన, క్షణం = ఒక్క క్షణకాలము, రామస్య=రామునియొక్క, అతిక్రమః=అతిక్రమించి పోవుట, ( నేను నిన్నుదర్శింపక యతిక్రమించి పోవుచున్నాఁడఁ గాన ) క్షమ్యతాం=క్షమింపఁబడుఁగాక.

శంబూకః :— దేవ పశ్య పశ్య —

శ్లో॥ గుంజత్కుంజకుటీరకౌశికఘటాఘుత్కారవత్కీచక
స్తంబాడంబరమూకమౌకులికులః క్రౌంచాభిధోఽయం గిరిః
ఏతస్మి న్ప్రచలాకినాం ప్రచలతా ముద్వేజితాః కూజితై
రుద్వేల్లంతి పురాణరోహిణతరుస్కంధేషు కుంభీనసాః॥ ౨౯

శం:— దేవ=స్వామీ ! పశ్య+పశ్య=చూడుఁడు; చూడుఁడు.

అర్థ:— అయం = ఈ యెదుటఁ గానఁబడునది, గుంజత్ = ధ్వని చేయుచున్న + కుంజ—కుటీర=లతాగృహంబులందలి + కౌశిక—ఘటా = గుడ్లగూబల సమూహములయొక్క + ఘుత్కారవత్ = 'ఘుత్' అను ధ్వనితోఁ గూడిన + కీచక—స్తంబ = వెదురు మొదళ్ళయొక్క + ఆడంబర = గడబిడ ధ్వనిచే + మూక=మూగయైన (అణఁగిపోయిన) మౌకులి=కాకములయొక్క + కులః = సమూహము కల్గినట్టి, క్రౌంచ—అభిధః = క్రౌంచమను పేరుగల, గిరిః = పర్వతము; ఏతస్మిన్ = ఈ పర్వతమందు, ప్రచలతాం = చెలరేఁగుచున్న, ప్రచలాకినాం=నెమిళ్ళయొక్క, కూజితైః=కేకలచే, ఉద్వేజితాః= భయపెట్టఁబడిన, కుంభీనసాః = కొండచిలువలు, పురాణ = ప్రాతవియగు, రోహిణ—తరు=మంచిగంధపు చెట్లయొక్క + స్కంధేషు=బోదెలయందు, ఉద్వేల్లన్తి=వ్రేలాడుచున్నవి.

తా॥ రామా ! ఆ కానవచ్చునదియే క్రౌంచపర్వతము; అందలి లతాగృహంబుల నిర్భయంబుగ వసించు ఘూకములరొదతోఁగూడిన కీచకస్వనంబు పెల్లుమీరి,తండోపతండములై కాకంబులొక పెట్టునఁ గూయుచున్నను దన్నాదంబు నణచివేయుచున్నది; బృందబృందంబులై స్వేచ్ఛాసంచారమొనర్చు నెమిళ్ళ కేకలకుఁ జాలజంకువడి, అజగరంబులు పాత్రితవియగు మంచిగంధపుఁ జెట్ల మొదళ్ళ వ్రేలుచున్నవి.

అపి చ.

అపి + చ=మఱియు.

శ్లో॥ ఏతే తే కుహరేషు గద్గదనదద్గోదావరీవారయో
మేఘాలంబితమౌలినీలశిఖరాః క్షోణీభృతో దాక్షిణాః
అన్యోన్యప్రతిఘాతసంకులచలత్కల్లోలకోలాహలై
రుత్తాలా స్త ఇమే గభీరపయసః పుణ్యాస్సరిత్సంగమాః॥

( ఇతి నిష్క్రాంతా స్సర్వే. )

ఏతే=ఈయెదుటఁగనఁబడునవి, తే=ఆ, కుహరేషు = గుహాలయందు, గద్గద = గద్గదస్వరముతో ( అవ్యక్తమధురధ్వనితో ) + నదత్ = ధ్వనిచేయుచున్న + గోదావరీ = గోదావరీనదియొక్క + వారయః = నీరుగలవియు, మేఘ = మేఘములచేత + ఆలంబిత = కప్పుకొనఁబడిన + మౌళి = శిరోభాగములచే + నీల = నల్లనగు + శిఖరాః = శిఖరములు గల్గినట్టియు, దాక్షిణాః = దక్షిణదిక్కునకు వ్యాపించిన, క్షోణీభృతః = పర్వతములు, ( కిం+చ=మఱియు) ఇమే = ఈ యెదుటఁ గనఁబడునవి, తే = ఆ, గభీర=లోతైన + పయసః = ఉదకము గల్గినట్టియు, అన్యోన్య = ఒండొంటితో + ప్రతిఘాత = సంఘర్షణచే + సంకుల=కలసి

పోవునట్లుగా + చలత్ = సంచలించుచున్న + కల్లోల=తరంగములయొక్క + కోలాహలైః = కోలాహలధ్వనులతో, ఉత్తాలాః = ఎక్కువైనట్టియు, పుణ్యాః=పవిత్రములైనట్టియు, సరిత్ – సంగమాః=నదీసంగమములు.

తా॥ రామా! అవ్యక్తమధురధ్వనిచేయుచు గోదావరీనదీజలంబులు దమ గుహాలలోనికిఁ బార, మేఘమాలావృతశిఖరంబు లౌటచే మిక్కిలి నల్లగఁ గానవచ్చు దక్షిణభూధరంబు లాకానవచ్చునవేఁమఱియు, నన్యోన్యసంఘర్షణంబుల నేకమై సంచలించువేళ నధికకోలాహలధ్వను లొనర్చుచుఁ బవిత్రోదకంబులచేఁ దనరారు నదీసంగమంబు లయ్యవియే; కనుఁగొంటివా?

( ఇతి=ఇట్లు, సర్వే=అందఱు, నిష్క్రాంతాః=చనిరి. )



# తృతీయోఽంకః

## మూఁడవ యంకము.

( తతః ప్రవిశతి నదీద్వయం )
(తతః=పిదప, నదీ-ద్వయం = నదులయొక్క జంట, ప్రవిశతి = ప్రవేశించుచున్నది)

ఏకా:- సఖి! మురళే! కిమసి సంభ్రాంతేవ.

ఒకతె:- సఖి=చెలీ, మురళే=మురళా, సంభ్రాంతా+ఇవ+కిం+అసి=చాలఁ దొందరపడుదానివలెఁ గానవచ్చుచున్నావేమి ?

మురళా:- సఖి! తమసే! ప్రేషితాస్మి భగవతో ఽగస్త్యస్య పత్న్యా లోపాముద్రయా సరిద్వరాం గోదావరీ మభిధాతుం. "జానాస్యేవ ఖలు వధూపరిత్యాగాత్ప్రభృతి.

శ్లో॥ అనిర్భిన్నో గభీరత్వా దంతర్గూఢఘనవ్యథః
పుటపాకప్రతీకాశో రామస్య కరుణో రసః॥ ౧

మురళ:- సఖి=చెలీ, తమసే = తమసా, భగవతః = పూజ్యుఁడగు, అగస్త్యస్య = అగస్త్యమునియొక్క, పత్న్యా = భార్యయగు, లోపాముద్రయా = లోపాముద్రిచే, సరిత్-వరాం = నదులలో శ్రేష్ఠురాలగు, గోదావరీం = గోదావరిని గూర్చి, ( ఈ చెప్పఁబోవు సంగతి ) అభిధాతుం=నుడువుటకు, ప్రేషితా+అస్మి=పంపఁబడినదాననైతి; ( ఓ గోదా

సీ! నీవు ) వధూ = కోడలగు సీతయొక్క + పరిత్యాగాత్ + ప్రభృతి= విడిచిననాఁటనుండియు, (జరిగినసంగతి) జానాసి + ఏవ + ఖలు=ఎఱిఁగియే యున్నావుగదా.

అర్థః- గభీరత్వాత్ =గంభీరుఁడగుటవలన, అనిర్భిన్నః = ( హృదయముబ్రద్దలుచేసికొని) బయల్వెడలనట్టియు, (కాని) అన్తః = లోపల+ గూఢ=పాదుకొనిపోయిన+ఘన = గొప్పదగు+వ్యథః = వేదనకల్గినట్టియు, రామస్య=రామచంద్రునియొక్క,కరుణః+రసః=ప్రియజనవియోగమువలనఁ గలిగిన దుఃఖాతిశయవికారముచే జాలిగొల్పురసము, పుట= (మూతిబిగించిన) పాత్రియందలి + పాక = వంటకముతో + ప్రతీకాశః = సమానమైనది.

తా॥ రామచంద్రుఁడు గంభీరుఁ డగుటచేఁ బ్రియజనవియోగము వలనఁ దనకుఁగలిగిన యపరిమితమనోవేదనను బయటికిఁ దెలియఁబడకుండఁ దనయందుననే నిలుపుకొని పుటముపెట్టినపాత్రములోని పదార్థ మెట్లు తుక తుక కుమిలిపోవుచుండునో యారీతిగాఁ దనహృదయము కుమిలిపోవుచుండ మిక్కిలి పరితపించుచున్నాఁడు.

మురళా:- తేన చ తథావిధేష్టజనకష్టవినిపాతజన్మనా ప్రకృష్ట గద్గదేన దీర్ఘశోకసంతాపేన సంప్రతి పరిక్షీణో రామభద్రః. త మవలోక్య కంపితమివ కుసుమసమబంధనం మే హృదయం. అధునా చ రామభద్రేణ ప్రతినివర్తమానేన నియతమేవ పంచవటీవనే వధూసహనివాసవిస్రంభసాక్షిణః ప్రదేశా ద్రష్టవ్యాః. తత్ర చ నిసర్గధీరస్యా ప్యేవంవిధాయా మవస్థాయా మతిగంభీరాభోగశోకక్షోభసంవేగాత్ పదే పదే మహా ప్రమాదాని శోకస్థానాని శంకనీయాని. తద్భగవతి ! గోదావరి ! త్వయా తత్రభవత్యా సావధానయా భవితవ్యం.

అర్థః:- తేన+చ=అందుచేతనే, తథావిధ = ఆవిధమగు+ఇష్ట - జన=ఇష్టమైనజనముయొక్క+కష్ట=కష్టములయందు+ వినిపాత = పడఁద్రోయుటవలన+జన్మనా=సంభవించినట్టియు, ప్రకృష్ట = అధికమగు+ గద్గదేన=గద్గదికకలట్టియు, దీర్ఘ=గొప్పదియగు+శోక = శోకమువలని+ సంతాపేన=వ్యధచే, సంప్రతి=ఇపుడు, రామభద్రః = రామభద్రుఁడు, పరిక్షీణః=చాలఁగృశించియున్నాఁడు; తం=(అట్టి) వానిని, అవలోక్య=చూచి, కుసుమ=పుష్పముతో+సమ=సమానమైన+ బంధనం=పట్టుగల్గిన, మే = నాయొక్క, హృదయం = మనస్సు, కంపితం+ఇవ = చలించినదివలె (ఆయెను) అధునా+చ = ఇపుడన్ననో, ప్రతినివర్తమానేన = (శంబూకవధ నొనర్చి) మరలిపోవుచున్న, రామభద్రేణ=రామభద్రునిచే, నియతం+ఏవ=విధిగానే, పంచవటీ-వనే=పంచవటీకాననమున, వధూ = (మున్నరణ్యవాసమొనర్పవచ్చినవేళ) భార్యతో+సహ-నివాస=కూడికాపురము చేయుటయందు+విస్రంభ=స్వచ్ఛందవిహారవిషయముల+సాక్షిణః=సాక్షిభూతములైయున్న, ప్రదేశాః = స్థానములు, ద్రష్టవ్యాః = చూడఁబడవలసియున్నవి; తత్ర+చ=అచ్చటనున్ను, నిసర్గ=స్వభావముచే+ధీరస్య+అపి= ధైర్యముగల్గినవాఁడైనను, రామభద్రస్య=రామభద్రునకు, ఏవం-విధాయాం= ఈవిధమగు, అవస్థాయాం = అవస్థయందు, అతి-గంభీర = మిక్కిలిగంభీరమగు+ఆభోగ = నిండుపుగల+శోక = దుఃఖమువలని+క్షోభ = సంక్షోభముయొక్క+సంవేగాత్ = గొప్పవేగమువలన, పదే+పదే = అడుగడుగున, మహా-ప్రమాదాని=గొప్పప్రమాదములుగల, శోక-స్థానాని=శోకము గూర్చుతావులు, శంకనీయాని=అనుమానింపఁదగియున్నవి. తత్=దానఁజేసి, భగవతి=మహానుభావురాలా! గోదావరి = గోదావరీ! తత్రభవత్యా+ త్వయా=పూజ్యురాలవగునీవు, సావధానయా+భవితవ్యం = జాగరూకరాలవై యుండవలసియున్నది.

శ్లో॥ వీచీవాతైః శీకరక్షోదశీతై
రాకర్షద్భిః పద్మకింజల్కగంధాన్
మోహే మోహే రామభద్రస్య జీవం
స్వైరం స్వైరం ప్రేరితై స్తర్పయేతి ॥ ౭

అర్థః:— మోహే + మోహే = మూర్ఛఁజెందినపుడెల్ల, శీకర = నీటి బిందువులయొక్క + క్షోద = సూక్ష్మాంశములచే + శీతైః = చల్లనైనట్టియు, పద్మ—కింజల్క = కమలకేసరములయొక్క + గంధాన్ = సువాసనలను, ఆకర్షద్భిః = కూడలాగికొనివచ్చునట్టియు, స్వైరం + స్వైరం = యథేష్టముగా, ప్రేరితైః = ప్రేరేపింపఁబడిన, వీచీ = తరంగములయొక్క + వాతైః=వాయువులచే, రామభద్రస్య=రామభద్రునియొక్క, జీవం=జీవమును, తర్పయ = హాయినొందఁజేయుమా ( అను సంగతి నుడువుటకై, ఓగోదావరీ నీచెంతకు నే నంపఁబడితిని. )

తా॥ ఓగోదావరీ ! నీటి తుంపురులచేఁ జల్లనై, పద్మకేసరపరాగముచేఁ బరిమళించుచుండు నీతరంగవాతపోతములచే రామచంద్రుఁడు మూర్ఛఁజెందినపుడెల్ల నేమరక వలసినటుల వీచుచు నాయనప్రాణములకు హాయి గలిగించుచుండవలసినది సుమా !

తమసా:— ఉచితమేవ దాక్షిణ్యం స్నేహస్య. సంజీవనోపాయస్తు మౌలిక ఏవ రామభద్రస్య సంనిహితః.

తమసః— దాక్షిణ్యం = (ఈ) ఉదారభావము, స్నేహస్య = ( రామునియెడల నామెకుఁగల ) స్నేహమునకు, ఉచితం+ఏవ = తగియే యున్నది. రామభద్రస్య = రామభద్రునియొక్క, మౌలికః = మూలాధారమగు, సంజీవన—ఉపాయః + తు=ఉజ్జీవనోపాయ మనినన్రో, సంనిహితః + ఏవ=సమీపమున వర్తించునదియె యగుచున్నది.

మురలా:— కథ మివ ?

మురలః— కథం + ఇవ=అదెట్లు ?

తమసా:— శూ్రియతాం. పురా కిల వాల్మీకితపోవనోప కంఠాత్ పరిత్యజ్య గతే లక్ష్మణే సీతాదేపి ప్రాప్తప్రసవ వేదన మాత్మానం అతిదుఃఖసంవేగాత్ గంగాప్రవాహే నిక్షి ప్తవతీ. తదైవ తత్ర దారకద్వయం ప్రసూతా. భగవతీభ్యాం పృథ్వీభాగీరథీభ్యా మభ్యుపపన్నా రసాతలం చ నీతా. స్తన్య త్యాగాత్ పరేణ చ తద్దారకద్వయం తస్యాః ప్రాచేతసస్య మహర్షే ర్గంగాదేపి స్వయ మర్పితవతీ.

తమసః— శ్రూయతాం=వినఁబడుఁగాక (వినుమా) పురా = పూర్వ ము, పరిత్యజ్య = ( సీతను ) వదలి, లక్ష్మణే = లక్ష్మణుఁడు, వాల్మీకి = వాల్మీకియొక్క+తపో—వన=తపోవనముయొక్క+ఉపకంఠాత్ = సమీప మునుండి, గతే = ( స్వనగరంబునకు ) చనఁగా, సీతాదేవీ = సీతాదేవి, ప్రాప్త = తటుస్థించిన+ప్రసవ—వేదనం = ప్రసవబాధగల, ఆత్మానం= తనను, అతి—దుఃఖ = గొప్పదుఃఖమునుయొక్క+సంవేగాత్ = దారుణత్వ మువలన, గంగా—ప్రవాహే = గంగాప్రవాహమందు, నిక్షిప్తవతీ = పడఁద్రోసికొనెను. తదా + ఏవ = అప్పుడే, తత్ర = అచట, దారక - ద్వయం = పిల్లలయొక్క—జంటను ( ఇరువురు పిల్లలను ) ప్రసూతా = కనియెను. భగవతీభ్యాం = పూజ్యురాండ్రగు, పృథ్వీ—భాగీరథీభ్యాం = భూదేవిచేతను గంగాదేవిచేతను, అభ్యుపపన్నా = అనుగ్రహింపఁబడినదై, రసాతలం = పాతాలమునుగూర్చి, నీతా + చ = కొనిపోఁబడినదికూడ; తస్యాః=ఆసీతాదేవియొక్క, తత్=ఆ, దారక-ద్వయం+చ = శిశువుల జంటయు, స్తన్య=పాలయొక్క+త్యాగాత్=విడుచుటకంటె, పరేణ =

కోడనే ( చనుబాలుదాగ్రివుటమానిన వెంటనే ) ప్రాచేతసస్య+మహర్షేః =వాల్మీకి మహర్షికి, గంగాదేవీ=గంగాదేవి, స్వయం=తానే, అర్పితవతీ= సమర్పించినది.

మురళా:— ( సవిస్మయం )

శ్లో॥ ఈదృశానాం విపాకోఽపి జాయతే పరమాద్భుతః
యత్రోపకరణీభావ మాయా త్యేవంవిధో జనః ॥ 3

మురళ:— సవిస్మయం=ఆశ్చర్యముతోఁగూడునటుల.

అర్థ:— ఈదృశానాం=ఇట్టివారియొక్క ( సీతమున్నగు నప్రాకృత వ్యక్తివిశేషములయొక్క ) విపాకః+అపి=దుర్దశకూడ, పరమ—అద్భుతః= మిక్కిలి ఆశ్చర్యకరమైనది, జాయతే=అగుచున్నది; యత్ర=ఏదుర్దశనొందు సందర్భమున, ఏవం—విధః=ఈవిధమగు ( గంగ, వసుంధరమున్నగు ) జనః= జనము, ఉపకరణీభావం=ఉపకారకత్వమును, ఆయాతి=పొందుచున్నదో.

తా॥ ఔరా ? ఏమివింత; గంగావసుంధరలంతవారలే సరియగు కష్టకాలమునకుఁ దమకై తామె వచ్చి భాగీరథీజలంబులఁగూలిన సీతకు భృత్యానుభృత్యలై సేవ లొసంగిరి; ఇంతకు యోజించినచో సీతాదేవి మున్నగునలౌకికవ్యక్తివిశేషంబులకుఁ జేకూరినకష్టపరంపరలును నత్యాశ్చర్య కరంబులై కానవచ్చుచుండు.

తమసా:— ఇదానీం తు శంబూకవృత్తాంతే నానేన సంభావితజనస్థానాగమనం రామభద్రం సరయూముఖా దుపశ్రుత్య భగవతీ భాగీరథీ యదేవ భగవత్యా లోపాముద్రయా స్నేహా దాశంకితం తదే వాశంక్య సీతాసమేతా కేనచిదివ గృహాచారవ్యపదేశేన గోదావరీం విలోకయితు మాగతా.

తమసః:- ఇదానీం+తు=ఇపుడన్ననో, సరయూ = సరయూనది యొక్క + ముఖాత్ =ముఖమునుండి, అనేన=ఈ, శంబూక-వృత్తాంతేన= శంబూకునివృత్తాంతముచే, సంభావిత = బాగుగనూహచేయఁబడిన + జనస్థాన=జనస్థానమునుగూర్చి+ఆగమనం = రాకగల, రామభద్రం = రామభద్రుని, ఉపశ్రుత్య = విని, (" ఈశంబూకవృత్తాంతమునఁ జేసి, జనస్థానంబునకు రాముఁడు వచ్చుట నిశ్చయము " అనుసంగతిని సరయూనది చెప్పుటవలన విని ) భగవతీ = పూజ్యురాలగు, భాగీరథీ = గంగాదేవి, యత్ +ఏవ = ఏదైతే, భగవత్యా = పూజ్యురాలగు, లోపాముద్రయా=లోపాముద్రచే, స్నేహాత్ =అనురాగమువలన, ఆశంకితం=శంక చేయఁబడినదో, తత్ +ఏవ=ఆవిషయమునే, ఆశంక్య=శంకచేసి, కేనచిత్ = ఏదోయొక, గృహ—ఆచార = కులక్రియయొక్క + వ్యపదేశేన+ఇవ = మిషచేతనోయన, సీతా-సమేతా=సీతతోఁగూడినదై, గోదావరీం = గోదావరీం=గోదావరిని, విలోకయితుం=చూచుటకు, ఆగతా=వచ్చినది.

మురలా:- సువిచింతితం భగవత్యా. " రాజధానీస్థితస్య ఖలు తైస్తైర్జగతామాభ్యుదయికైః కార్యైర్వ్యాపృతస్య రామభద్రస్య నియతాశ్చిత్తవిక్షేపాః. అవ్యగ్రస్య పున రస్య శోకమాత్రద్వితీయస్య పంచవటీప్రవేశో మహాననర్థః" ఇతి. తత్కథమిదానీం సీతాదేవ్యా రామభద్రః ఆశ్వాసనీయః స్యాత్ ?

మురల:- " రాజధానీ=రాజధానియందు + స్థితస్య=ఉన్నట్టియు, జగతాం=లోకములకు, ఆభ్యుదయికైః=శుభముకల్గించెడి, తైః+తైః= ఆయా, కార్యైః = కార్యములచే, వ్యాపృతస్య = తగులొందినట్టియు, రామభద్రస్య=రామభద్రునియొక్క, చిత్త—విక్షేపాః=మనోవ్యాకులతలు,

నియతాః + ఖలు = నియంత్రితములై నవగుచునే యున్నవి. పునః = మగుడ (ఇపుడన్ననో) అవ్యగ్రస్య = విషయాంతరములయం దాసక్తుఁడు కానట్టియు, శోక – మాత్ర–ద్వితీయస్య = ఒక్క శోకమే తోడుగాఁగల్గినట్టియు, అస్య = ఈరామునికి, పంచవటీ – ప్రవేశః = పంచవటియందుఁ బ్రవేశించుట, మహాన్ = గొప్ప + అనర్థః = చేటు " ఇతి = అని (అనుసంగతి) భగవత్యా = పూజ్యురాలగు, భాగీరథిచే, సు–విచింతితః = బాగుగయోజింపఁబడినది. తత్ = అందువలన, రామభద్రః = రామభద్రుఁడు, సీతాదేవ్యా = సీతాదేవిచే, ఆశ్వాసనీయః = ఊఱడింపఁదగినవాఁడు; కథం + స్యాత్ = ఎట్లగును ?

తమసా:—ఉక్త మత్ర భగవత్యా భాగీరథీదేవ్యా– "వత్సే దేవయజనసంభవే! సీతే! అద్య ఖలు ఆయుష్మతోః కుశలవయో ర్ద్వాదశస్య సంవత్సరస్య సంఖ్యామంగళగ్రంథి రభివర్ధ్యతే. తదాత్మనః పురాణశ్వశురం ఏతావతో మానవస్య రాజర్షి వంశస్య ప్రసవితారం సవితారం అపహతపాప్మానం దేవం స్వహస్తాపచితైః పుష్పై రుపతిష్ఠస్వ. న చ త్వా మవనీపృష్ఠచారిణీం అస్మత్ప్రభావాత్ వనదేవతా అపి ద్రక్ష్యన్తి; కింపున ర్మర్త్యాః" ఇతి. అహం చ ఆజ్ఞాపితా – "తమసే! త్వయి ప్రకృష్టప్రేమైవ వధూ ర్వత్సా జానకీ. అత స్త్వమేవాస్యాః ప్రత్యనన్తరీభవ" ఇతి. సాహం మధునా యథాదిష్టమనుతిష్ఠామి.

తమసః— అత్ర = ఈవిషయమునందు, భగవత్యా = పూజ్యురాలగు, భాగీరథీదేవ్యా = గంగాదేవిచే, "వత్సే = బిడ్డా! దేవ = దేవతల

యొక్క + యజన=యజ్ఞభూమినుండి + సంభవే=పుట్టినదానా, సీతే=సీతా, అద్య + ఖలు=నేఁడేగదా, ఆయుష్మతోః=చిరంజీవులగు, కుశలవయోః= కుశలవులకు, ద్వాదశస్య=పండ్రెండవదియగు, జన్మ-వత్సరస్య=పుట్టినయేఁటి యొక్క, సంఖ్యా-మంగళ-గ్రంథిః = సంఖ్యాపూర్తిహేతుకమైన శుభ సూత్రబంధనము, అభివర్తతే = కావింపఁబడనున్నది. తత్ = అందువలన, ఆత్మనః=నీకు, పురాణ=మొట్టమొదటి + శ్వశురం = మామగారైనట్టియు, ఏతావతః=ఇప్పటివఱకుఁగడచనిన, మానవస్య=మనుసంబంధమగు, రాజర్షి-వంశస్య=రాజర్షి వంశముయొక్క, ప్రసవితారం=కన్నవాఁడైనట్టియు, అప హత=వినాశమొనర్పఁబడిన + పాప్మానం=పాపములుగలట్టియు, దేవం = భగవానుఁడగు, సవితారం=సూర్యుని, స్వ-హస్త=స్వహస్తములచే + అప చితైః=కోయఁబడిన, పుష్పైః = పువ్వులచే, ఉపతిష్ఠస్వ = పూజింపుమా, అవనీ=పుడమియొక్క + పృష్ఠ = పైభాగమున + చారిణీం = సంచరించెడి, త్వాం=నిన్ను, అస్మత్=మాయొక్క + ప్రభావాత్=పరిభావమువలన, వన-దేవతాః + అపి=వనదేవతలుకూడ, న + చ + దృశ్యన్తి = చూడనేలేరు, మర్త్యాః=మనుజులు, ( ద్రక్ష్యంతి + ఇతి=చూచెదరనువిషయమున ) కిం + పునః=ఏమిచెప్పవలెను? ". ఇతి=అని, ఉక్తం = చెప్పఁబడినది. అహం + చ=నేనుగూడ, " తమసే=తమసా ! వధూః = (నా) కోడలైనట్టియు, వత్సా=కుఱ్ఱదియైనట్టియు, సీతా=సీత, త్వయి=నీయందు, ప్రకృష్ట-ప్రేమా + ఏవ=అధికానురాగముగలదే. అతః=ఇందువలన, త్వం + ఏవ=నీవే, అస్యాః= ఈమెకు, ప్రత్యంతరీభవ = అనుచరురాలవుకమ్ము. ఇతి=అని, ఆజ్ఞాపితా= ఆజ్ఞాపింపఁబడితిని. సా + అహం = అట్టినేను, అధునా = ఇపుడు, యథా దిష్టం=ఆజ్ఞాపింపఁబడినప్రకారముగా, అనుతిష్ఠామి=నడచుకొనుచున్నాను.

మురళా:- అహమప్యముం వృత్తాంతం భగవత్యై లోపాముద్రాయై నివేదయామి. రామభద్రోఽపి ఆగత ఏవ ఇతి తర్కయామి.

మురల:— అహం + అపి = నేనుగూడను, అముం = ఈ, వృత్తాంతం = వార్తను, భగవత్యై = పూజ్యురాలగు, లోపాముద్రాయై = లోపాముద్రకొఱకు, నివేదయామి = ఎఱుకపఱచెదను. రామభద్రః + అపి = రామభద్రుఁడును, ఆగతః + ఏవ + ఇతి = వచ్చియేయున్నాఁడని, తర్కయామి = అనుకొనెద.

తమసా:— త దియం గోదావరీహ్రదా న్నిష్క్రమ్య—

శ్లో॥ పరిపాండుదుర్బలకపోలసుందరం
దధతీ విలోలకబరీక మాననం
కరుణస్య మూర్తిరివ వా శరీరిణీ
విరహవ్యథేవ వన మేతి జానకీ ॥　　४

తమసః— తత్ = దానఁజేసి, ఇయం = ఇదిగో! గోదావరీ—హ్రదాత్ = గోదావరిమడుగునుండి, నిష్క్రమ్య = వెలువడి—

అర్థ:—జానకీ = సీత, పరిపాండు = మిక్కిలి తెల్లనైనట్టియు + దుర్బల = చిక్కినట్టియు + కపోల = చెక్కిళ్లతోడ + సుందరం = మనోహరమైనట్టియు, విలోల = చెదరిన + కబరీకం = కేశబంధముగల్గినట్టియు, ఆననం = ముఖమును, దధతీ = ధరించుచున్నదై, కరుణస్య = కరుణయొక్క, మూర్తిః + ఇవ = ఆకృతివలెను (మూర్తిభవించినకరుణరసంబువలెను) శరీరిణీ = శరీరముగల, విరహ—వ్యథా + ఇవ = విరహబాధవలెను (విరహబాధయే యిట్లు రూపుదాల్చినదా ! అనునట్లును) వనం = వనమునుగూర్చి, ఏతి = వచ్చుచున్నది.

తా॥ అదిగో, సీత; తెల్లపడి చిక్కిపోయిన చెక్కిళ్ళుగలిగి, ఒకవంకఁ గ్రొమ్ముడి విడిపోయి, కురులు ముఖంబుపైఁ జెదరిపడియుండ, " మూర్తీభవించిన కరుణరసంబో " అనునట్లును, " రూపుదాల్చిన విరహవేదనయా " అనునట్లును గానఁబడుచు వనంబున కేతెంచుచున్నది.

మురలా:— ఇయం హి సా—

శ్లో॥ కిసలయమివ ముగ్ధం బంధనా ద్విప్రలూనం
హృదయకుసుమశోషీ దారుణో దీర్ఘశోకః
గ్లపయతి పరిపాండు క్షామ మస్యాః శరీరం
శరదిజ ఇవ ఘర్మః కేతకీగర్భపత్రం ॥ 4

( ఇతి పరిక్రమ్య నిష్క్రాంతే )

శుద్ధ విష్కంభః

మురల:— సా = ఆ జానకి, ఇయం + హి = ఈమెయే.

అర్థ:— హృదయ—కుసుమ = మానసపుష్పంబును + శోషీ = ఎండించెడి, దారుణః = కఠోరమైన, దీర్ఘ—శోకః = గొప్పవేదన, శరది—జః = శరత్కాలమున—పుట్టిన, ఘర్మః = ఎండ, కేతకీ = మొగలిచెండుయొక్క + గర్భ = లోపలి + పత్రం + ఇవ = రేకునువలెనే, బంధనాత్ = తొడిమనుండి, విప్రలూనం = భిన్నమైనట్టియు, ముగ్ధం = సుందరమైనట్టియు, కిసలయం + ఇవ = చిగురుటాకువలె, పరిపాండు = పాలిపోయినట్టియు, క్షామం = సన్నగిలినట్టియు, అస్యాః = ఈ సీతాదేవియొక్క, శరీరం = దేహమును, గ్లపయతి = పీడించుచున్నది.

తా॥ మనఃపుష్పమును మలమల మాడ్చివేయు నట్టితీవ్రదీర్ఘదుఃఖము తొడిమ వీడి జారిపడినకొంజిగురుటాకువలె లలితమై, మిక్కిలికృశించి, పాలిపోయిన, యీసీతాదేవిశరీరమును శరత్కాలమునందలియెండ మొగలి పూవులోని రేకునువాడఁబారఁజేయునట్లు మాడ్చివేయుచున్నది కదా!

( ఇతి = అని, పరిక్రమ్య = పరిక్రమించి, నిష్క్రాంతే = నిష్క్రమింతురు. )

శుద్ధ—విష్కంభః = సంస్కృతభాషాసహిత విష్కంభము.



(నేపథ్యే) ప్రమాదః ప్రమాదః ( తతః ప్రవిశతి పుష్పాపచయవ్యగ్రా సకరుణౌత్సుక్య మాకర్ణయంతీ సీతా )

( నేపథ్యే=తెరలో ) ప్రమాదః+ప్రమాదః=ప్రమాదము ప్రమాదము!

( తతః=తరువాత, పుష్ప=పువ్వులయొక్క+అపచయ=కోయుటయందు+వ్యగ్రా=అధీనురాలై, సకరుణ–ఔత్సుక్యం = విచారకుతూహలములతోఁ గూడునటుల, ఆకర్ణయంతీ=వినుచున్నదై, సీతా = సీత, ప్రవిశతి=ప్రవేశించుచున్నది )

♦ సీతా:– అహో జానామి ప్రియసఖీ మే వాసన్తీ వ్యాహరతీతి.

సీత:– అహో=ఆహా; జానామి = తెలియుచున్నాను; మే = నాయొక్క, ప్రియ–సఖీ=ప్రియసఖియగు, వాసన్తీ=వాసంతి, వ్యాహరతి = పల్కుచున్నది, ఇతి=అని.

( పునర్నేపథ్యే )

శ్లో॥ సీతాదేవ్యా స్వకరకలితై స్సల్లకీపల్లవాగ్రై
రగ్రే లోలః కరికలభకో యః పురా పోషితోఽభూత్

( పునః=మరల, నేపథ్యే=తెరయందు )

అర్థ:– పురా=పూర్వము, సీతాదేవ్యా=సీతాదేవిచే, అగ్రే = ( సీతయొక్క ) సమక్షమందు, లోలః=(బాల్యతనపు చేష్టలచే ) చపలమైనదై, యః=ఏ, కరి–కలభకః = ఏనుఁగుగున్న, స్వ–కర = తనచేతులతోడనే–కలితైః=కోయఁబడిన, సల్లకీ–పల్లవ=అందుగు చిగుళ్ళయొక్క+అగ్రైః=అగ్రములచే, పోషితః + అభూత్=పోషింపఁబడినది–ఆయెనో;

---

♦ అహ్మహే జాణామి పిఅసహీ మే వాసన్దీ వ్యాహరది త్తి.

‡ సీతా:— కిం తస్య ? — ( పున ర్నేపథ్యే. )

సీత:— తస్య = దానికి, కిం=ఏమి ? ( దాని కిపు డేమి తటస్థించె) ( పునః=మరల, నేపథ్యే=తెరయందు; )

శ్లో॥ వధ్వా సార్థం పయసి విహరన్ సోఽయ మన్యేన దర్పా

దుద్దామేన ద్విరదపతినా సన్నిప త్యాభియుక్తః ॥ ౬

అర్థః— సః + అయం = ఆయీయేనుఁగుగున్న, వధ్వా + సార్థం= భార్యతోఁగూడ, పయసి=ఉదకమందు, విహరన్=క్రీడించుచు, అన్యేన= మఱొక, ఉద్దామేన = గొప్పబలముగల, ద్విరద—పతినా = గజరాజుచే, దర్పాత్=దర్పమువలన, సన్నిపత్య=డీకొని, అభియుక్తః = ఆక్రమింపఁ బడెను;

తా॥ పూర్వము సీత, స్వహస్తంబులచేతనే లేతవగునందుగుచిగుళ్లఁ గోసికొనివచ్చి తనసమక్షంబుననే నిల్పి కడుపార భుజింపనిడి యేకరి కలభంబును బోషించెనో, ఆకరికలభ మిపుడు తనసహచరితోఁగూడి జల క్రీడసల్పుచుండ నింతలో హఠాత్తుగా నొకబలసినగజరాజంబు దాని నెదు ర్కొని ముట్టడించినది.

† సీతా:—( ససంభ్రమం కతిచిత్ పదాని గత్వా ) ఆర్య పుత్ర ! పరిత్రాయస్వ పరిత్రాయస్వ మమ, తం పుత్రకం. ( స్మృతి మభినీయ సవైక్లబ్యం ) హా ధిక్ హా ధిక్. తా న్యేవ చిరపరిచితా న్యక్షరాణి పంచవటీదర్శనేన పునరపి మాం మందభాగినీ మనురుంధంతి. హా ఆర్యపుత్ర (ఇతి మూర్ఛతి.)

---

‡ కిం తస్స. † అజ్జఉత్త పరిత్తాహి పరిత్తాహి మహ తం పుత్తఅం. హద్ధీ హద్ధీ తాఇం ఏవ్వ చిరపరిఇదాఇం అక్ఖరాఇం పంచవటీదరిసణేణ పుణోవి మం మందభాఇణిం అణురుంధన్తి. హాఅజ్జఉత్త

సీత:- ( ససంభ్రమం = తొందరతోఁగూడునట్లుగా; కతిచిత్ = కొన్ని, పదాని=అడుగులు, గత్వా=నడచి ) ఆర్యపుత్ర=ఓఆర్యపుత్రా! మమ=నాయొక్క, తం=ఆ, పుత్రకం=బిడ్డను, పరిత్రాయస్వ + పరిత్రాయస్వ=రక్షింపుము, రక్షింపుము. ( స్మృతిం = భర్తతనను విడిచినవృత్తాంతము యొక్క ) జ్ఞప్తిని, అభినీయ = అభినయించి, ( సవైక్లబ్యం = నిరాశతోఁగూడుకొనినట్లు ) హా + ధిక్ + హా + ధిక్ = అయ్యో ఛీ, అయ్యో ఛీ, పంచవటీ=పంచవటియొక్క + దర్శనేన=చూచుటచే, పునః + అపి=వెండియు, మందభాగినీం=దురదృష్టవంతురాలనైన, మాం = నన్ను, చిర-పరిచితాని = చాలకాలమునుండియు నలవాటుపడిన, తాని + అక్షరాణి + ఏవ = ( ఆర్యపుత్రయనెడి ) ఆయక్కరములే, ఉపరుద్ధన్తి = ( నాల్కఁజుట్టికొని ) అడ్డువచ్చుచున్నవి.

ఇతి=అని, మూర్ఛతి=మూర్ఛఁజెందుచున్నది )

(ప్రవిశ్య) తమసా:-వత్సే ! సమాశ్వసిహి, సమాశ్వసిహి.

( ప్రవిశ్య=ప్రవేశించి, ) తమసః-వత్సే = బిడ్డా, సమాశ్వసిహి + సమాశ్వసిహి=ఊఱడిల్లుము, ఊఱడిల్లుము.

నేపథ్యే:- విమానరాజ ! అత్రైవ స్థీయతాం.

నేపథ్యే = తెరలో:- విమానరాజ = ఓవిమానశ్రేష్ఠమా, అత్ర + ఏవ = ఇచటనే, స్థీయతాం=నిలుతువుగాక.

♦ సీతా:- ( ఆశ్వస్య ససాధ్వసోల్లాసం ) అహో ! జలభరితమేఘస్తనితగంభీరమాంసలః కుతో ను ఏష భారతీనిర్ఘోషో భ్రియమాణకర్ణవివరాం మామపి మందభాగినీం ఝటితి ఉచ్ఛ్వాసయతి ?

---

♦ అమ్హాహే జలభరిదమేహత్థణిదగంభీరమంసలో కుదో ణు ఏసో భారదీణిగ్ఘోసో భరిజ్జమాణకణ్ణవివరం మం వి మందభాఇణిం ఝత్తి ఉస్సాసేది.

సీత:— ( ఆశ్వస్య=ఊఱడిలి, ) ససాధ్వస—ఉల్లాసం=భయముతో_ఉల్లాసముతోఁ గూడునట్లుగా ) అహో=ఏమియాశ్చర్యము! జల=నీటిచే+భరిత=నిండిన+మేఘ=మేఘముయొక్క+స్తనిత=ఉఱుమువలె+గంభీర=గంభీరమైనట్టియు+మాంసలః=గట్టిదియైనట్టియు, ఏషః = ఈ, భారతీ = వాక్కుయొక్క+నిర్ఘోషః=ధ్వని, కుతః+ను = ఎక్కడిదోకదా ? భ్రియమాణ = నింపఁబడుచున్న+కర్ణ—వివరాం = శ్రవణరంధ్రములుగల, మంద భాగినీం=అదృష్టహీనురాలనగు, మాం+అపి=నన్నుఁగూడ, ఝటితి—శీఘ్రముగా, ఉచ్ఛ్వాసయతి=ప్రాణములు లేచివచ్చునటులఁ జేయుచున్నది.

తమసా:— ( సస్నేహాస్రం ) అయి ! వత్సే !

శ్లో॥ కి మవ్యక్తేఽసి నినదే కుతస్త్యేఽపి త్వ మీదృశీ
స్తనయిత్నో ర్మయూరీవ చకితోత్కంఠితం స్థితా ॥ ౭

తమసః— ( సస్నేహ—అస్రం = అనురాగాశ్రుజలంబులతోఁ గూడునట్లు ) అయి=ఓసీ, వత్సే=బిడ్డా !

అర్థ:— ఈదృశీ=ఇట్టి, త్వం=నీవు, అవ్యక్తే = స్ఫుటముకానట్టియు, కుతస్త్యే=ఎచ్చటినుండియోవచ్చినట్టియు, నినదే+అపి=ధ్వనివిషయమందుఁ గూడ, స్తనయిత్నోః = మేఘముయొక్క ( ధ్వనౌ = ధ్వనివిషయమందు ) మయూరీ+ఇవ=ఆఁడునెమిలివలెనే, చకిత—ఉత్కంఠితం = భయపడినట్లుగాను—తహతహపాటుతోఁ గూడినట్లుగాను, స్థితా+అసి+కిం=ఉన్నావేమి?

తా॥ ఓసీతా ! అస్పష్టమై, “ ఫలానావారికంఠధ్వని ” అని నిర్ణయించుటకు వీలులేక, ఎచ్చటనోదూరమునుండివచ్చు కంఠధ్వనిని నీ వట్టెయాలకించుచు, మేఘనాదంబు విని చకితమగు మయూరిచందంబున నొకవైపున భయము వేఱొకవైపునఁ దహతహపాటు నొందెదవేల ?

♦ సీతా:– భగవతి ! కిం భణసి, అవ్యక్తమితి; మయా పునః స్వరసంయోగేన ప్రత్యభిజ్ఞాతం; ఆర్యపుత్ర ఏవ వ్యాహరతి.

సీత:—భగవతి=పూజ్యురాలా ! కిం+భణసి = ఏమనుచున్నావు ? అవ్యక్తం+ఇతి = స్ఫుటముకానిదనియా; మయా+పునః = నాచేత నైతే, స్వర—సంయోగేన = ఉచ్చారణముయొక్క—పొందికచే, ప్రత్యభిజ్ఞాతం=గుఱుతింపఁబడినది; ఆర్యపుత్రః+ఏవ = ఆర్యపుత్రుఁడే, వ్యాహరతి=పల్కుచున్నాఁడు.

తమసా:– శ్రూయతే తపస్యతః శూద్రస్య దండధారణార్థం ఐక్ష్వాకో రాజా జనస్థాన మాగత ఇతి.

తమస:— తపస్యతః=తపంబొనరించుచున్న, శూద్రస్య=శూద్రునికి, దండ—ధారణార్థం=శిక్షవిధించుటకొఱకు, జనస్థానం=జనస్థానమునుగూర్చి, ఐక్ష్వాకః=ఇక్ష్వాకువంశోద్భవుఁడగు, రాజా = (రామ) రాజు, ఆగతః = వచ్చియున్నాఁడు, ఇతి=అని, శ్రూయతే=వినఁబడుచున్నది.

❙ సీతా:– దిష్ట్యా అపరిహీణరాజధర్మః ఖలు స రాజా.

సీత:— దిష్ట్యా=ఆహా ఎంతయానందము ! సః+రాజా = ఆరాజు, అపరిహీణ = లోపములేని+రాజ—ధర్మః+ఖలు = రాజధర్మముకల వాఁడుగదా !

(నేపథ్యే=తెరలో)

శ్లో॥ యత్ర ద్రుమా అపి మృగా అపి బంధవో మే

యాని ప్రియాసహచర శ్చిర మధ్యవాత్సం

---

♦ భఅవది కిం భణసి అవ్వత్తఇత్తి ? మఏ ఉణ సరసంజోఏణ పరిఅభిఆణిదం అజ్జఉత్తఏవ్వ వాహరది.

❙ దిట్ఠిఆ అపరిహీణరాఅధమ్మో క్ఖు సో రాజా.

ఏతాని తాని బహునిర్ఝరకందరాణి
గోదావరీపరిసరస్య గిరేస్తటాని ॥ ౮

అర్థః- యాని = ఏ తీరభూములను (యందు) ప్రియా = ప్రియురాలి తోడ + సహ-చరః=కూడి తిరుగువాఁడనై, చిరం = చాలకాలము, అధ్యుషితం=కాపుర మొనర్చితినో, యత్ర = ఏ తీరభూములయందు, ద్రుమాః + అపి=వృక్షములున్ను, మృగాః + అపి=మృగములున్ను, మే=నాయొక్క, బంధవః=బంధువులు ( ఆయెనో ) తాని=అట్టి, బహు = ఎక్కువైన+నిర్ఝర=సెలయేళ్ళను+కందరాణి = గుహలనుగల్గి, గోదావరీ-పరిసరస్య = గోదావరియొక్క - సమీపముననున్న, గిరేః = ప్రస్రవణగిరియొక్క, తటాని=తీరభూములు, ఏతాని=ఈకానవచ్చునివియె.

తా॥ బహుగుహలతోడను, సెలయేళ్ళతోడను గూడిన యీపర్వత ప్రాంతభూములయందు మున్ను నా ప్రియురాలితోడఁగూడి నేను జాల కాల మధికానందంబునఁ గాపుర మొనర్చితిని. అప్పు డిచటి పెనుమ్రాకులు, క్రూరమృగములు మాత్రమే మాకు నిరుగు పొరుగు చుట్టములై వర్తించెడివి.

( సీతా:- ( దృష్ట్వా ) హా ! కథం ! ప్రభాతచంద్రమండలాపాండురపరిక్షామదుర్బలేన ఆకారేణ అయం సౌమ్యగంభీరానుభావమాత్రప్రత్యభిజ్ఞేయః ఆర్యపుత్ర ఏవ. తన్మాం ధారయ ధారయ (ఇతి తమసా మాశ్లిష్య మూర్ఛతి.)

సీత:- ( దృష్ట్వా = చూచి ) హా = అయ్యో ! కథం = ఎట్లూ ! ప్రభాత = ప్రాతఃకాలమునందలి + చంద్ర-మండల = చంద్రమండలము

( హా కహం పహాదచందమండలాపాండురపరిక్ఖామదువ్వలేణ ఆఆరేణ అఅం సోమ్మగంభీరాణుభావమేత్తపచ్చహిజాణిజ్జో అజ్జఉత్తో ఏవ్వ. తా మం ధారేహి, ధారేహి.

వలె + పాండుర = తెల్లఁబారిన + పరిక్షామ = కృశించిన + దుర్బలేన = దుర్బ లమునైన, ఆకారేణ = ఆకారముచే ( తోచుచున్నప్పటికి ) సౌమ్య = మన మ్మున కానందము గూర్చునట్టియు + గంభీర = గంభీరమైనట్టియు + అను భావ-మాత్ర = కేవలప్రభావముచేతనే + ప్రత్యభిజ్ఞాతః = (నాచే,) గుర్తు పట్టఁబడిన, అయం = ఈ కానవచ్చునతఁడు, ఆర్యపుత్రః + ఏవ = ఆర్యపుత్రుఁడే- తత్ = అందువలన, మాం = నన్ను, ధారయ + ధారయ = పట్టుకొనుము-పట్టు కొనుము. ( ఇతి = అని, తమసాం = తమసను, ఆశ్లిష్య = కౌఁగిలించుకొని, మూర్ఛతి = మూర్ఛపోవుచున్నది )

తమసా:— (ధారయన్తీ) వత్సే ! సమాశ్వసిహి సమా శ్వసిహి.

తమసః— ( ధారయన్తీ = పట్టుకొనుచున్నదై ) వత్సే = బిడ్డా ! సమాశ్వసిహి + సమాశ్వసిహి = ఊఱడిల్లుము-ఊఱడిల్లుము.

( నేపథ్యే ) అనేన పంచవటీదర్శనేన.

శ్లో॥ అంతర్లీనస్య దుఃఖాగ్నే ర ద్యోద్దామం జ్వలిష్యతః
ఉత్పీడ ఇవ ధూమస్య మోహః ప్రా గావృణోతి మాం॥

హా ప్రియే ! జానకి !

( నేపథ్యే = తెరలో ) అనేన = ఈ, పంచవటీ-దర్శనేన = పంచ వటియొక్క-చూచుటచే.

అర్థః— అద్య = ఇపుడు, ఉద్దామం = అడ్డుపెట్టఁబడకయొక్క-వగా, జ్వలిష్యతః = పరిజ్వలింపనున్నట్టియు, అంతః = లోపల, లీనస్య = డాగియున్న ట్టియు, దుఃఖ-అగ్నేః = శోకాగ్నిహోత్రమునుండి, ధూమస్య = పొగ యొక్క, ఉత్పీడః + ఇవ = పరంపరవలెనే, మోహః = మోహము, ప్రాక్ = ముందుగా, మాం = నన్ను, ఆవృణోతి = క్రమ్ముకొనుచున్నది.

తా॥ ఈ పంచవటిని గాంచినతోడనే, యేలనోగాని, నా హృదయంబున నిగూఢంబుగ నణఁగి, ప్రజ్వలింపనున్న శోకాగ్నిహోత్రమునుండి ముమ్మందుగా మోహధూమపరంపరలు నన్నావరించుచున్నవి.

హా=అయ్యో, ప్రియే=ప్రియురాలా! జానకి=జానకీ!

తమసా:- (స్వగతం) ఇదం తావ దాశంకితం గురుజనేన.

తమసః- (స్వగతం=తనలో) గురు-జనేన=గురుజనంబుచే, ఇదం=ఈ సంగతి, తావత్+ఆశంకితం=సరిగా నూహింపఁబడినదిసుమా.

౧ సీతా:- (సమాశ్వస్య) హా కథ మేతత్.

సీత:- (సమాశ్వస్య=తెప్పిరిలి) హా=అయ్యో! ఏతత్ = ఇది, కథం=ఎట్లు!

నేపథ్యే:- హా దేవి! దండకారణ్యప్రియసఖి! హా దేవి! విదేహరాజపుత్రి! (ఇతి మూర్ఛతి)

తెరలో:- హా=అయ్యో! దేవి=దేవీ, దండక-అరణ్య=దండకారణ్యమున+ప్రియ=ప్రియమైన+సఖి = చెలీ, హా=అయ్యో! దేవి = దేవీ, విదేహ-రాజ=విదేహదేశపురాజుయొక్క+పుత్రి=తనయా! (ఇతి = అని, మూర్ఛతి=మూర్ఛిలుచున్నాఁడు)

౨ సీతా:- హా ధిక్ హా ధిక్ మాం మందభాగినీం వ్యాహృత్య ఆమీలితనేత్రనీలోత్పలో మూర్ఛిత ఏవ ఆర్యపుత్రః. హా కథం ధరణీపృష్ఠే నిరుత్సాహనిఃసహం విపర్యస్తః, భగవతి! తమసే! పరిత్రాయస్వ పరిత్రాయస్వ జీవయ ఆర్యపుత్రం.

---

౧ హా! కహం ఏదం. ౨ హద్ధీ హద్ధీ మం మందభాఇణిం వాహరిఅ అమీలిదణేత్తణీలుప్పలో ముచ్ఛిదో ఏవ్వ అజ్జఉత్తో. హా కహం ధరణీపిట్ఠే

సీత:— హా+ధిక్ = అయ్యో! ఛీ, హా+ధిక్ = అయ్యో ఛీ; మంద భాగినీం=దురదృష్టవంతురాలనగు, మాం = నన్ను, వ్యాహృత్య = పేరునఁ బిలిచి, ఆర్యపుత్రః = ఆర్యపుత్రుఁడు, ఆమీలిత = పూర్తిగా మూసికొని పోయిన+నేత్ర—నీలోత్పలః = నల్లకలువలఁబోలు నేత్రములుగలవాఁడై, మూర్ఛితః+ఏవ = మూర్ఛఁజెందనే చెందినాఁడు. హా=అయ్యో! కథం = ఎటుల, ధరణీ=భూమియొక్క+పృష్ఠే=పైభాగంబున, నిరుత్సాహ—నిస్స హం=చేష్టలేమియు బలములేమియుఁ గలుగునటుల, విపర్యస్తః = తలక్రింద దుగాఁ బడినాఁడు. భగవతి=పూజ్యురాలా! తమసే = తమసా! పరిత్రా యస్వ+పరిత్రాయస్వ = రక్షింపుము; రక్షింపుము; ఆర్యపుత్రం = (నా) ప్రాణేశ్వరుని, జీవయ=బ్రదికింపుము.

తమసా:—

శ్లో॥ త్వమేవ నను కల్యాణి! సంజీవయ జగత్పతిం
ప్రియస్పర్శో హి పాణిస్తే తత్రైష నిరతో జనః॥

తమసః— అర్థః— కల్యాణి = ఓ మంగళప్రదురాలా! త్వం+ఏవ= నీవే, జగత్—పతిం=జగన్నాథుని, నను+సంజీవయ=ఆలసింపకుండ జీవింపఁ జేయుము; తే=నీయొక్క, పాణిః=హస్తము, ప్రియ—స్పర్శః+హి=హిత మైన స్పర్శకలదిసుమా, ఏషః+జనః = ఈ పురుషోత్తముఁడు, తత్ర = అచ్చటనే (నీ కరస్పర్శముననందే) నిరతః=మిక్కిలి యాసక్తిగొనినవాఁడు.

తా॥ ఓ శోభనప్రదురాలా! లోకనాయకుండగు నీ భర్తను జీవింపఁ జేయ నీవే సమర్థురాలవు; ప్రియతమంబగు నీ హస్తస్పర్శ మొక్కటియే యాయనను మూర్ఛనుండి తేర్చునది; అన్యోపాయంబు లెవ్వియును లేవు. ఇది

---

నిరుస్సాహణీసహం విపత్థో. భఅవది తమసే పరిత్తాఏహి పరిత్తాఏహి. జీవావేహి అజ్జఉత్తం.

ముమ్మాటికి నిశ్చయము. ఇట్లింతకాలమునుండియో యీయన విషయమున నీ విధానము ప్రసిద్ధమే గదా.

† సీతా:— యద్భవతు తద్భవతు; యథా భగవతీ భణతి. ( ఇతి ససంభ్రమం నిష్క్రాంతా. )

సీత:— యత్=ఏది, భవతు = కానున్నదో, తత్ = అది, భవతు= కానిమ్ము; యథా=ఎట్లు, భగవతీ = పూజ్యురాలు (నీవు) భణతి = పల్కుచున్నదో (అట్లు చేసెద) (ఇతి=అని, ససంభ్రమం=తొందరతోఁ గూడు నటుల, నిష్క్రాంతా=వెడలెను)

( తతః ప్రవిశతి భూమౌ నిపతితః సాస్రయా సీతయా స్పృశ్యమానః సాహ్లాదోచ్ఛ్వాసో రామభద్రః. )

( తతః=తరువాత, భూమౌ = పుడమిపై, నిపతితః = పడినట్టియు, సాస్రయా=కన్నీటితోఁ గూడిన, సీతయా = సీతాదేవిచే, స్పృశ్యమానః= తాఁకఁబడుచున్నట్టియు, స—ఆహ్లాద—ఉచ్ఛ్వాసః=ఆనందము — ఉజ్జీవనములతోఁ గూడినవాఁడగు, రామభద్రః = రామభద్రుఁడు, ప్రవిశతి = ప్రవేశించుచున్నాఁడు.

‡ సీతా:— ( కించిత్సహర్షం స్వగతం ) జానే పునరపి ప్రత్యాగతమివ జీవితం త్రైలోక్యస్య.

సీత:— ( కించిత్=కొంచెము, సహర్షం = ఆనందముతోఁ గూడు నటుల, స్వగతం=తనలో ) త్రైలోక్యస్య=మూఁడులోకములకు, పునః+ అపి=వెండియు, జీవితం = ప్రాణము, ప్రత్యాగతం+ఇవ = మరలివచ్చినటుల, జానే=తెలిసికొనుచున్నాను.

---

† జం హోదు తం హోదు జహా భఅవదీ భణది.

‡ జాణే పుణోవి పచ్చాఅదం విఅ జీవిదం తేల్లోక్కస్స.

రామః:— హంత భోః కిమేతత్ !

శ్లో॥ ప్రిశ్చ్యోతనం ను హరిచందనపల్లవానాం
నిష్పీడితేందుకరకందలజో ను సేకః
ఆతప్తజీవితతరోః పరితర్పణో మే
సంజీవనౌషధిరసో ను హృది ప్రసిక్తః ॥ ౧౧

రాముఁడు:— హంత=ఔరా, భోః=ఓహో, కిం+ఏతత్=ఏమిది !

అర్థః:— మే=నాయొక్క, హృది = హృదయమందు, హరిచందన= మంచిగంధముయొక్క + పల్లవానాం = చిగురుటాకులయొక్క, ప్రశ్చ్యో తనం + ను=రసస్రావముగావింపఁబడినదా ? నిష్పీడిత = పిండఁబడిన + ఇందు-కర=చంద్రకిరణములయొక్క + కందల=అంకురములనుండి + జః = కల్గినరసముయొక్క, సేకః + ను=ప్రోక్షణముగావింపఁబడినదా? ఆతప్త= (దుఃఖముచే ) కాల్చఁబడిన, జీవిత=బ్రతుకనెడి + తరోః=వృక్షమునకు, పరితర్పణః=వికాసముఁజెందఁజేయునట్టి, సంజీవన = ప్రాణమొసంగెడి + ఓషధి=మూలికయొక్క + రసః=రసము, ప్రసిక్తః + ను=చల్లఁబడినదా.

తా॥ ఆహా ! ఏమి యీవింత ! నాహృదయగోళంబు హరిచందన వృక్షపల్లవంబుల రసధారలచే తింపఁబడినదా ? లేక, చంద్రకిరణాంకురం బులనుండి పిండిన రసంబుచే నామేను దడపఁబడినదా? లేక, దుఃఖాగ్నులచే దగ్ధప్రాయమగు నాజీవితవృక్షంబును మరల వికసింపఁజేయునట్టి యేసంజీవ నౌషధి రసంబైనను నాపైఁ జల్లఁబడినదా ? లేనిచోఁ బ్రాణములుపోయిన ట్లనియేతలంచు నాకు మగుడఁబ్రాణంబులు వచ్చుటెట్లు ?

రామః:— శ్లో॥ స్పర్శః పురా పరిచితో నియతం స ఏష
సంజీవనశ్చ మనసః పరిమోహనశ్చ

సంతాపజాం సపది యః ప్రతిహృత్య మూర్ఛా
మానందనేన జడతాం పున రాతనోతి ॥

అర్థ:- యః=ఏస్పర్శము, సపది=వెను వెంటనె; సంతాప=దుఃఖము వలన + జాం=పుట్టిన, మూర్ఛామ్=మూర్ఛను, ప్రతిహృత్య=పోఁగొట్టి, ఆనందనేన=సంతసము గల్గించుటచే, పునః = మరల, జడతాం = జడత్వమును, ఆతనోతి=కల్గించుచున్నదో, మనసః=మనస్సునకు, సంజీవనః + చ=జీవనము నాపాదించునట్టియు, పరిమోహనః + చ=ఆనందపారవశ్యమును గలిగించునట్టియు, సః + ఏవః=ఆతఁ, స్పర్శః=తాఁకుడు, పురా=మున్ను, నియతం= నియతముగా, పరిచితః=గుర్తెఱుంగఁబడినదియే;

తా॥ నెమ్మనంబునకు జీవనమును సమకూర్చి పరమాహ్లాదమొసంగి కాపాడిన యీకరస్పర్శ మెవ్వరిదోగాని మున్నెడపక బాగుగ ననుభవింపఁ బడినదియే; ఈస్పర్శము, సంతాపజనితంబగు నామూర్ఛను దొలఁగించి మగుడ నానందపూర్ణంబగు జడభావంబును నాకుఁ గల్గించుచున్నది.

• సీతా:-( ససాధ్వసకరుణం కించి దపసృత్య ) ఏతావదేవ ఇదానీం మే బహుమతం.

సీత:- ( ససాధ్వసకరుణం = భయవిచారంబులు కల్గునట్లు, కిం+ చిత్=కొంచెము, అపసృత్య=తొలఁగి ) మే=నాకు, ఇదానీం=ఇపుడు, ఏతావత్ + ఏవ=ఇంతమాత్రపుసంగతియే, బహుమతం=ఇష్టతరము.

రామః:- ( ఉపవిశ్య ) న ఖలు వత్సలయా సీతాదేవ్యా అభ్యుపపన్నోఽస్మి.

రా:- ( ఉపవిశ్య=కూరుచుండి ) వత్సలయా=అనురాగవతియగు, సీతాదేవ్యా = సీతాదేవిచే, అభ్యుపపన్నః + అస్మి + న + ఖలు = అనుగ్రహీతుఁడను కాలేదుగదా ?

---

• ఏత్తిఅం ఏవ్వ దాణిం మె బహుదరం.

* సీతా:- హా ధిక్ హా ధిక్ ! కిమితి మా మార్యపుత్రో మార్గిష్యతి.

సీత:- హా + ధిక్=అయ్యో ! ఛీ 2, ఆర్యపుత్రః=ఆర్యపుత్రుఁడు, మాం=నన్ను, కిం + ఇతి + మార్గిష్యతి=ఏమని వెదకఁగలఁడు.

రామః:- భవతు పశ్యామి.

రా:- భవతు=కానిమ్ము, పశ్యామి=పరికించెదను.

† సీతా:- భగవతి ! తమసే! అపసరావ, యది తావత్ మాం ప్రేక్షిష్యతే తతః అనభ్యనుజ్ఞాతసన్నిధానేన అధికతరం మహారాజః కోపిష్యతి.

సీత:- భగవతి=పూజ్యురాలా, తమసే=తమసా, తావత్=ఇపుడు, మహారాజః=మహారాజుగారు, మాం=నన్ను, ప్రేక్షిష్యతే+యది=చూడఁగల్గినయెడల, తతః = అపతకుములో, అనభ్యనుజ్ఞాత = ఆమోదింపఁబడని + సన్నిధానేన = సమీపాగమనంబుచే, కోపిష్యతి = కోపింపఁగలఁడు, అపసరావ=తొలఁగుదము.

తమసా:- అయి ! వత్సే ! భాగీరథీవరప్రసాదాత్ వనదేవతానామ ప్యదృశ్యా సంవృత్తాసి.

తమస:- అయి+వత్సే=ఓసి బిడ్డా; భాగీరథీ=గంగయొక్క + వర=వరముయొక్క + ప్రసాదాత్=అనుగ్రహమువలన, వనదేవతానాం+అపి=వనదేవతలకుఁగూడ, అదృశ్యా=కనఁబడనిదానవై, సంవృత్తా + అసి = ప్రవర్తించుదానవగుచున్నావు.

---

* సీతా:- హద్ధీ హద్ధీ కిం త్తి మం అజ్జఉత్తో మగ్గిస్సది.

† భఅవది తమసే ఓసరంహ జఇ దావ మం పేక్ఖిస్సది తదో అణబ్భణుణ్ణాదేణ సణ్ణిహాణేణ అహిఅదరం మమ మహారాఓ కుప్పిస్సది.

సీతా:- ఆం అస్త్యేతత్.

సీత:- ఆం=అ, ఏతత్ + అస్తి = ఇది ఉన్నది.

రామః:- హా ప్రియే ! జానకి !

రా:- హా=అయ్యో; ప్రియే=ప్రియురాలా ! జానకి=సీతా !

సీతా:- (సమన్యుగద్గదం) ఆర్యపుత్ర ! అసదృశం ఖలు ఏత ద్వచనం అస్య వృత్తాంతస్య. (సాస్రం) అథవా కిమితి వజ్రమయీ జన్మాంతరేష్వపి పున రసంభావితదుర్లభ దర్శనస్య మామేవ మందభాగినీ ముద్దిశ్య వత్సలస్య ఏవం వాదిన ఆర్యపుత్రస్య ఉపరి నిరనుక్రోశా భవిష్యామి. అహమే వైతస్య హృదయం జానామి. మమ ఏష ఇతి.

సీతా:- (సమన్యు-గద్గదం = కోపము-గద్గదికతోఁ గూడునటుల) ఆర్యపుత్ర = ఓ ఆర్యపుత్రా ! ఏతత్ = (ప్రియురాలా యనెడి) ఈ, వచనం = మాట, అస్య = (పరిత్యాగరూపమగు) ఈ, వృత్తాంతస్య = వృత్తాంతమునకు, అసదృశం + ఖలు = తగనిదికదా. (సాస్రం = కన్నీరు గ్రుక్కినట్లు) అథవా=కానిచో, వజ్రమయీ = వజ్రకఠినురాలనై, జన్మ + అంతరేషు + అపి = జన్మాంతరములయందుఁ గూడను, పునః = మగుడ, అసంభావిత=ఊహింపనలవికానట్టియు + దుర్లభ=పొందనలవి కానట్టియు + దర్శనస్య = చూపుకలట్టియు, మందభాగినీం = దురదృష్టవంతురాలనగు,

---

అజ్జఉత్త అసరిసం క్ఖు ఏదం వఅణం ఇమస్స వుత్తాంతస్స. అహవా కిం త్తి వజ్జమఈ జమ్మంతరేసు వి పుణో అసంభావిదదుల్లహదరిసణస్స మం ఏవ్వ మందభాఇణిం ఉద్దిశిఅ వచ్ఛలస్స ఏవంవాదిణో అజ్జఉత్తస్స ఉవరి ణిరణుక్కోసా భవిస్సం. అహం ఏవ్వ ఏదస్స హిఅఅం అణామి మమ ఏసో త్తి.

మాం=నన్ను, ఉద్దిశ్య+ఏవ=ఉద్దేశించియే, వత్సలస్య=ప్రేమమయుఁడై, ఏవం+వాదినః=ఈరీతిగ భాషించుచున్నట్టి, ఆర్యపుత్రస్య+ఉపరి= ఆర్యపుత్రునిపై, నిరనుక్రోశా = దయమాలినదానను, కిం+ఇతి+భవిష్యామి= ఏవిధినగుదును ? అహం+ఏవ=నేనుమాత్రమే, ఏతస్య=ఈయనయొక్క, హృదయం = మనస్సును, జానామి = ఎఱుఁగుదును; ఏషః = ఈతఁడు, మమ=నాయొక్క, ( హృదయం జానాతి. )

రామః:- ( సర్వతో విలోక్య సనిర్వేదం ) హా ! కథం ! అత్ర న కశ్చిదపి !

రాముఁడు:- ( సర్వతః=అన్నివైపుల, విలోక్య=చూచి, సనిర్వేదం=దైన్యముతోఁ గూడునటుల ) హా = అయ్యో ! కథం = ఎట్లూ ? ( ఏమాశ్చర్యము ) అత్ర=ఇచట, న+కః-చిత్+అపి=ఒక్కఁడును లేఁడే.

‡ సీతా:- భగవతి ! తమసే తథా నిష్కారణపరిత్యాగినోఽపి ఏతస్య ఏవంవిధేన దర్శనేన కీదృశ ఇవ మే హృదయానుబంధ ఇతి న జానామి.

సీత:- భగవతి=పూజ్యురాలా ! తమసే=తమసా ! తథా=అటుల, నిష్కారణ=కారణములేక + పరిత్యాగినః+అపి = వదలిపెట్టినవాఁడైనను, ఏతస్య=వీనియొక్క, ఏవంవిధేన=ఈవిధమగు, దర్శనేన=చూపుచే, మే=నాయొక్క, హృదయ = హృదయముయొక్క+అనుబంధః = అనుబంధము ( హృదయావస్థ. ) కీదృశః+ఇవ = ఎట్టిదిగా ( ఉన్నది ) ఇతి = అనువిషయమును, న+జానామి=ఎఱుఁగను.

తమసా:- జానామి వత్సే ! జానామి.

---

‡ భఅవది తమసే తహా ణిక్కారణపరిచ్చాయిణోవి ఏదస్స ఏవంవిహేణ దరిసణేణ కేరిసో విఅ మే హిఅఆణువన్ధో త్తి ణ ఆణామి.

శ్లో॥ తటస్థం నైరాశ్యా దపి చ కలుషం విప్రియవశా
ద్వియోగే దీర్ఘేఽస్మిన్ ఝటితి ఘటనాత్ స్తంభితమివ
ప్రసన్నం సౌజన్యా ద్దయితకరుణై ర్గాఢకరుణం
ద్రవీభూతం ప్రేమ్ణా తవ హృదయ మస్మిన్ క్షణ ఇవ॥

తమసః— జానామి = తెలియుచున్నాను, వత్సే = బిడ్డా! జానామి = తెలియుచున్నాను.

అర్థః— తవ = నీయొక్క, హృదయం=మనస్సు, అస్మిన్ + క్షణే= ఈ క్షణమునందు, నైరాశ్యాత్=నిరాశచెందినదగుటవలన, తటస్థం=ఉదాసీనమైయున్నది; అపి + చ=మఱియు, విప్రియవశాత్=నిష్కారణపరిత్యాగసంబంధమగు ఖేదమువలన, కలుషం=ప్రసన్నతావిహీనమైనది; దీర్ఘే=గొప్పదగు, అస్మిన్=ఈ, వియోగే=విరహమందు, ఝటితి=శీఘ్రముగ (చింతచేయకయే) + ఘటనాత్ = (సమ్ముఖ) స్థితియేర్పడుటవలన, స్తంభితం+ ఇవ = జడీభూతమైనదివలెనున్నది, సౌజన్యాత్ = ( స్వభావసిద్ధమగు ) మంచితనమువలన, ప్రసన్నం = నిర్మలమైయున్నది; దయిత = ప్రియునియొక్క + కరుణైః=దుఃఖాత్మకావస్థావిశేషములచే, గాఢ=అధికమగు + కరుణం = శోకమయమైనది; ప్రేమ్ణా= ( భర్తయెడల ) ప్రణయముచే, ద్రవీభూతం + ఇవ=రసమయమైనదివలె నున్నది.

తా॥ ఈ జన్మమున కిఁక సాంసారికసుఖము గలుగఁబోదను నిరాశచే ఖేదమోదము లెఱుంగక, కారణమైనఁ దెలుపక నట్టడవులపాలుచేసినందునఁ గల్గిన యహితముచేఁ బ్రసన్నతాశూన్యమై, యీ చిరవియోగానుభవసమయమున హఠాత్తుగా సమక్షప్రాప్తి యేర్పడుటచే జడత్వముగొని, సహజమగు మంచితనమువలనఁ బ్రసన్నమై, కాంతుని దీనావస్థలను గనులారఁ గాంచుచుంటచే నపరిమితదుఃఖాత్మకమై, దాంపత్యానురాగబంధముచేఁ

గఱఁగిపోయినదియునై (యితమిత్థమని నిర్ణయింపరాని యవస్థయందున్నదై) యిప్పుడు నీ హృదయ మున్నట్లున్నది.

రామః:— దేవి!

శ్లో॥ ప్రసాద ఇవ మూర్త స్తే స్పర్శః స్నేహార్ద్రశీతలః
అద్యా ప్యానందయతి మాం త్వం పునః క్వాసి నందిని! ॥

రా:— దేవి = ఓ దేవీ

అర్థ:— స్నేహ=ప్రీతిచే + ఆర్ద్ర=సరసమైనట్టియు + శీతలః = చల్లనైనట్టియు, తే = నీయొక్క, స్పర్శః = స్పర్శము, మూర్తః = మూర్తీభవించిన, ప్రసాదః + ఇవ=అనుగ్రహమువలెనే, అద్య + అపి = ఇప్పటికిని, మాం=నన్ను, ఆనందయతి = సంతోషపెట్టుచున్నది; నందిని = (ఈవిధముగ) ఆనందముఁగూర్చుదానా! త్వం + పునః=నీవైతే, క్వ + అసి = ఎందున్నావు?

తా॥ ఓ దేవీ! ప్రేమార్ద్రశీతలంబగు నీ హస్తస్పర్శము, మూర్తీభవించిన యనుగ్రహమువలెనే యీ క్షణమువఱకుఁగూడ నన్నానందసాగరంబున ముంచి లేవనెత్తుచునే యున్నదిగాని, కనులార ని న్నొకమారు చూచుభాగ్యము మాత్రము లేకున్నదిగదా!

¹ సీతా:—ఏ తే ఖలు తే అగాధదర్శిత స్నేహసంభారా ఆనందనిష్యందినః సుధామయా ఆర్యపుత్రస్య ఉల్లాపాః యేషాం ప్రత్యయేన నిష్కారణపరిత్యాగశల్యితాఽపి బహుమతో మే జన్మలాభః.

---

¹ ఏదే క్ఖు దే అగాధదరిసిదసిణేహసంభారా ఆణందణిస్సందిణో సుహామఆ అజ్జఉత్తస్స ఉల్లావా జాణం పచ్చఏణ నిక్కారణపరిచ్చాఅసల్లిదో వి వహుమదో మే జణ్మలాహో.

టీక:- ఏతే=ఇవి; అగాధ=గంభీరమైనట్టియు+దర్శిత = ప్రకటిత మైనట్టియు + స్నేహ=స్నేహముయొక్క + సంభారాః= సంభారములుగలవి గనుకనే, ఆనంద=ఆనందమును + నిష్యందినః=స్రవిమ్మరించుచున్నట్టియు, సుధామయాః=అమృతమయములైనట్టియు, ఆర్యపుత్రస్య = ఆర్యపుత్రుని యొక్క, తే=ఆ, ఉల్లాపాః+ఖలు = విలాపవచనములుగదా; యేషాం = వేనియొక్క, ప్రత్యయేన=విశ్వాసముచే, నిష్కారణ = కారణములేని+పరిత్యాగ—శల్యితః+అపి=పరిత్యాగరూపమగు కొఱుతను వేయఁబడియున్నను, మే=నాయొక్క, జన్మ—లాభః=పుట్టుకవలనిప్రయోజనము, బహుమతః = ధన్యతగాంచినది.

రామః:- అథవా కుతః ప్రియతమా ? నూనం సంకల్పాభ్యాసపాటవోత్పాద ఏష రామభద్రస్య భ్రమః.

రా:- అథవా=అట్లుకాకున్నచో, ప్రియతమా = ప్రియతమయగు సీత, కుతః=ఎందుండి ( వచ్చును ) నూనం = నిశ్చయముగా, ఏషః = ఇది, రామభద్రస్య = రామభద్రునకు, సంకల్ప = చింతించుటయొక్క + అభ్యాస=ఆవృత్తియొక్క + పాటవ = పాటవమువలన + ఉత్పాదః = పుట్టుకగల, భ్రమః=భ్రమము ( పలుమారులు ‘ సీతాసమాగమమగుఁగాక ’ అను సంకల్పముచేఁ బుట్టిన భ్రమమేగాని, ఇది నిశ్చయమైనది కాదు. )

( నేపథ్యే ) ప్రమాదః ప్రమాదః ! “ సీతాదేవ్యా స్వకరకలితైః ” ఇత్యర్ధం పఠ్యతే.

( తెరలో ) ప్రమాదః + ప్రమాదః = ప్రమాదము ప్రమాదము. “ సీతాదేవ్యా స్వకరకలితైః ” ఇతి = అని, అర్ధం = సగము, పఠ్యతే = చదువఁబడుచున్నది.

రామః:- ( సకరుణౌత్సుక్యం ) కిం తస్య ?

రా:— ( సకరుణౌత్సుక్యం = దుఃఖము—ఆతురపాటులతోఁ గూడునట్లుగా ) తస్య=దానికి, కిం=ఏమి ( తటస్థించె )

( నేపథ్యే ) " వధ్వా సార్థం " ఇత్యుత్తరార్థం పఠ్యతే.

( తెరలో ) " వధ్వా సార్థం " ఇతి = అని, ఉత్తర—అర్ధం = పైనఁగలసగము, పఠ్యతే=చదువఁబడుచున్నది.

♦ సీతా:— క ఇదానీం అభియోత్స్యతే.

సీత:—కః=ఎవ్వఁడు, ఇదానీం=ఇపుడు, అభియోత్స్యతే=మార్కొనఁగలఁడు ?

రామః:— క్వాసౌ క్వాసౌ దురాత్మా, యః ప్రియాయాః పుత్రకం వధూద్వితీయ మభిభవతి ? ( ఇత్యుత్తిష్ఠతి )

రా:—యః=ఎవఁడైతే, వధూ—ద్వితీయః=భార్యాద్వితీయుఁడైన, (నిజభార్యతోఁ గూడుకొన్నట్టి,) ప్రియాయాః=(నా) ప్రియురాలియొక్క, పుత్రకం = ముద్దుబిడ్డను, అభిభవతి = ఎదుర్కొనుచున్నాఁడో, అసౌ = ఈ, దురాత్మా = దుర్మార్గుఁడు, క్వ = ఎక్కడ ! అసౌ + క్వ = వాఁ డెక్కడ. ( ఇతి=అని, ఉత్తిష్ఠతి=లేచుచున్నాఁడు. )

( ప్రవిశ్య సంభ్రాన్తా )

వాసన్తీ:— కథం దేవో రఘునందనః !

( ప్రవిశ్య=ప్రవేశించి, సంభ్రాంతా=తొందరపాటుతోఁగూడినదై ) కథం=ఎట్లూ ! దేవః=ప్రభువగు; రఘునందనః=రామచంద్రుఁడా !

‡ సీతా:— కథం ! పి్రియసఖీ మే వాసంతీ !

సీత:-పి్రియ-సఖీ=పి్రియసఖియగు, వాసన్తీ=వాసన్తియా! కథం=ఎట్లూ.

వాసన్తీ:— జయతి జయతి దేవః.

---

♦ కోదాణిం అహిఉజ్జిస్సది.　　‡ కహం పిఅసహీ వాసన్తీ.

వాసన్తి:— దేవః = ప్రభువు, జయతి+జయతి = జయశీలుఁడగు చున్నాఁడు; జయశీలుఁడగుచున్నాఁడు.

రామః:— కథం దేవ్యాః ప్రియసఖీ వాసన్తీ!

రా:— కథం=ఎట్లూ, దేవ్యాః = సీతాదేవియొక్క, ప్రియ-సఖీ= ప్రియసఖియగు, వాసన్తీ=వాసన్తియా.

వాసన్తీ:— దేవ! త్వర్యతాం త్వర్యతాం; ఇతో జటాయు గిరి శిఖరస్య దక్షిణేన సీతాతీర్థేన గోదావరీ మవతీర్య సంభావ యతు దేవ్యాః పుత్రకం దేవః.

వాసన్తి:— దేవ=ప్రభూ! త్వర్యతాం+త్వర్యతాం = తొందర చేయఁబడుఁగాక; తొందరచేయఁబడుఁగాక, ఇతః=ఇటు, జటాయు-గిరి= జటాయుపర్వతముయొక్క+శిఖరస్య= శిఖరమునకు, దక్షిణేన = దక్షిణపు దిక్కుగా, సీతా-తీర్థేన=సీతాతీర్థముమీఁదుగా, గోదావరీం = గోదావరీ నదిని, అవతీర్య=దిగి, దేవః=ప్రభువులవారు, దేవ్యాః=సీతాదేవియొక్క, పుత్రకం=పుత్రకుని, సంభావయతు=మన్ననసేతురుగాక.

‡ సీతా:— హా తాత! జటాయో, అద్య శూన్యం త్వయా వినా జనస్థానం.

సీత:— హా=అయ్యో! తాత=తండ్రీ! జటాయో = జటాయూ! అద్య = నేఁడు, త్వయా+వినా = నీవులేక, జనస్థానం = జనస్థానము, శూన్యం=శూన్యముగా ( దృశ్యతే. )

రామః:— అహహ హృదయమర్మచ్ఛిదః ఖల్వమీ కథో ద్ఘాతాః.

---

‡ హా తాద! జటాఓ! అజ్జ సుణ్ణం తుఏ వినా జణట్ఠాణం.

రా:- అహహ=హాహా, అమీ = ఈ, కథా + ఉద్ఘాతాః = కథాప్రసంగములు, హృదయ=హృదయమందలి + మర్మ = మర్మస్థానములను + భిదః-ఖలు=భేదించునవికదా.

వాసంతీ:- ఇత ఇతో దేవః.

వాసంతి:- దేవః=దేవరవారు, ఇతః+ఇతః = ఇటువైపు ఇటువైపు (వత్తురుగాక )

‡ సీతా:- భగవతి ! సత్యమేవ వనదేవతాపి మాం న ప్రేక్షతే.

సీత:- భగవతి=పూజ్యురాలా ! వనదేవతా+అపి = వనదేవతయు, మాం = నన్ను, సత్యం = నిశ్చయముగా, న+ప్రేక్షతే = చూడఁబోకున్నదికదా.

తమసా:- అయి ! వత్సే ! సర్వదేవతాభ్యః ప్రకృష్టమైశ్వర్యం భాగీరథీదేవ్యాః; తత్కిమిత్యాశంకసే ?

తమస:- అయి=ఓసీ ! వత్సే=బిడ్డా, భాగీరథ్యాః=గంగయొక్క, ఐశ్వర్యం=ప్రభావము, సర్వ-దేవతాభ్యః=అఖిలదేవతలకన్నను, ప్రకృష్టం=గొప్పదైనది; తత్=అందుచే, కిం + ఇతి+ఆశంకసే = ఏటికని యనుమానపడెదవు.

† సీతా:- తతః అనుసరావః ( ఇతి పరిక్రామతః )

సీత:- తతః=అట్లైన; అనుసరావః = అనుసరింతము ( ఇతి = అని, పరిక్రామతః=చనెదరు )

రామః:- ( పరిక్రమ్య ) భగవతి ! గోదావరి ! నమస్తే.

---

‡ భఅవది సచ్చఅం ఏబ్బ వణదేవతా వి మం ణ పేక్ఖది.

† తదో అణుసరంహా.

రాముఁడు:— ( పరిక్రమ్య = నడచి ) భగవతి = పూజ్యురాలా! గోదావరి=గోదావరీ, తే=నీకొఱకు, నమః=నమస్కారము.

వాసంతీ:— ( నిరూప్య ) దేవ ! దేవ ! మోదస్వ విజయినా వధూద్వితీయేన దేవ్యాః పుత్రకేణ.

వాసన్తి:— ( నిరూపించి ) దేవ + దేవ = స్వామీ ! ప్రభువా, వధూద్వితీయేన = భార్యాద్వితీయుఁడై నట్టియు, విజయినా = విజయము గలట్టియు, దేవ్యాః = సీతాదేవియొక్క, పుత్రకేణ = ముద్దులబిడ్డనిచే ( పెంపుడుగున్న యేనుఁగుచే ) మోదస్వ=ఆనందమొందుమా.

రామః:— విజయతా మాయుష్మాన్.

రాముఁడు:— ఆయుష్మాన్ = చిరంజీవి, విజయతాం = జయశీలుఁడగుఁగాక.

† సీతా:— అహో ఈదృశ ఏవ స సంవృత్తః.

సీత:— అహో = ఔరా ! సః + ఏవః = ఆ యీయేనుఁగుబిడ్డ, ఈదృశః = ఇంతది, సంవృత్తః=ఐనదో.

రామః:— దిష్ట్యా వర్ధసే దేవి !

శ్లో॥ యేనోద్గచ్ఛద్బిసకిసలయస్నిగ్ధదంతాంకురేణ
వ్యాకృష్ట స్తే సుతను ! లవలీపల్లవః కర్ణమూలాత్
సోఽయం పుత్ర స్తవ మదముచాం వారణానాం విజేతా
య త్కల్యాణం వయసి తరుణే భాజనం తస్య జాతః ॥

రాముఁడు:— దేవి=దేవీ, దిష్ట్యా = అదృష్టవశముచే, వర్ధసే = వృద్ధినొందుచున్నావు !

---

† అమ్మహే ఏరిసో ఏవ సో సంవుత్తో.

అర్థః:— హేసుతను = ఓమృదువగు దేహముకలదానా, యేన = ఎవ్వనిచే (ఏనీపుత్రకునిచే) ఉద్గచ్ఛత్ = మొలకెత్తుచున్న + బిస—కిసలయ = తామరచిగురువలెనే + స్నిగ్ధ = కోమలమైన + దంత—అంకురేణ = దంతపు మొలకచే, తే = నీయొక్క, కర్ణ—మూలాత్ = చెవి మొదటినుండి, లవలీ—పల్లవః = (సొమ్ముగాధరించిన) లవంగపుచిగురాకు, వ్యాకృష్టః = లాగఁబడినదో, సః = ఆ, అయం = ఈ, తవ = నీయొక్క, పుత్రః = బిడ్డఁడు, మద—ముచాం = మదమును—స్రవించెడి, ( గొప్పవగు ) వారణానాం = ఏనుఁగులయొక్క, విజేతా (సన్) = జయించువాఁడగుచు, తరుణే + వయసి = యౌవనమందు, యత్ + కల్యాణం = ఏదిమంగళప్రదమో, తస్య = దానికి, భాజనం = స్థానము, జాతః = ఆయెను.

తా॥ ఓ కోమలాంగీ! మున్ను పసితనంబున బిడ్డగాఁ బెంచినయేనుఁగు గున్న మొలకలెత్తెడు తామరచిగుళ్ళవలె నందమైన తన దంతాంకురంబుల నీవు కర్ణభూషణంబుగాఁ దాల్చిన లవంగపుఁ జిగుళ్ళను లాగివేయుచుండెడిది. అట్టిది యిపుడు మత్తగజంబులనేని తృణప్రాయంబుగఁ బారఁదోలెడు శక్తిగలిగి, యౌవనదశామంగళంబుల నెల్ల నందుటకుఁ దగియున్నది.

♦ సీతా:— అవియుక్త ఇదానీ మయం దీర్ఘాయు రనయా సౌమ్యదర్శనయా సమం భవతు !

సీత:— ఇదానీం = ఇపుడు, అయం = ఈ, దీర్ఘ—ఆయుః = దీర్ఘాయుష్మంతుఁడు, సౌమ్య—దర్శనయా = మంచి—దర్శనముగల, అనయా + సమం = దీనితోఁగూడ, అవియుక్తః + భవతు = వియోగముపొందింపకుండనిమ్ము.

రామః— సఖి! వాసన్తి! పశ్య పశ్య; కాంతానువృత్తి చాతుర్యమపి శిక్షితం వత్సేన.

---

♦ అవిఉత్తో దాణిం అఅం దీహాఉ ఇమాఏ సోమ్మదరిసణాఏ సమం హోదు.

రా:- సఖి = చెలీ, వాసన్తి = వాసంతీ, పశ్య + పశ్య = చూడు చూడు; కాంతా = ప్రియురాలికి + అనువృత్తి = కూడి మెలఁగిసంతోషపెట్టుట యందలి + చాతుర్యం + అపి = నేర్పుకూడ, వత్సేన = ( మన ) బిడ్డచే, శిక్షితం = నేర్చుకొనఁబడినది.

శ్లో॥ లీలోత్ఖాతమృణాలకాండకవలచ్ఛేదేషు సంపాదితాః
పుష్యత్ పుష్కరవాసితస్య పయసో గండూషసంక్రాంతయః
సేకః శీకరిణా కరేణ విహితః కామం విరామే పునః
యత్స్నేహాదనరాలనాలనలినీపత్రాతపత్రం ధృతం ॥

అర్థః- యత్ = ఎందువలనననిన, స్నేహాత్ = ప్రేమవలన, లీల = విలాసముచే + ఉత్ఖాత = పెల్లగింపఁబడిన + మృణాల = తామరల యొక్క + కాండ = కాడలనెడి + కవల = గ్రాసములయొక్క + ఛేదేషు = విరామములయందు, ( మధ్య మధ్య ) పుష్యత్ = వికసించుచున్న + పుష్కర = పద్మములచే + వాసితస్య = పరిమళించెడి, పయసః = నీటి యొక్క, గండూష-సంక్రాంతయః = గండూషదానంబులు ( పుక్కిటఁ బట్టిననీటికిగండూషమని పేరు) సంపాదితాః = సమకూర్పఁబడినవి; శీకరిణా = నీటితుంపురులచే నిండిన, కరేణ = తొండముచే, కామం = ఇష్టమువచ్చినట్లు, సేకః = తడుపుట, విహితః = చేయఁబడినది. విరామే + పునః = (తడుపుటకు) అవసానమందైతే, అనరాల = వంకరకాని + నాల = కాడకల + నలినీ - పత్ర = తామరాకురూపమగు + ఆతపత్రం = గొడుగు, ధృతం = పట్టుకొనఁ బడినది.

తా॥ ఈ గజరాజంబు, నిజాంగనయందలి మక్కువచే, నొకతఱి నిజహస్తంబుచే లేఁతతామరతూండ్లఁ బెల్లగించి, తత్కబళంబులఁ బ్రేయసీ వదనంబున నిడుచు, నడుమ నడుమఁ బద్మసుగంధవాసితంబులగు నిజగం

డూవ. జలంబుల నామె కందిచ్చుచుండె; కొండొకమారు నిజతుండంబున జలంబుఁ బట్టి యథేష్టంబుగఁగాంతయొక్క శరీరంబుపైఁ జల్లఁజొచ్చె; పిదప, పద్మాతపత్రంబును బట్టఁదొడంగె.

‡ సీతా:- భగవతి! తమసే! అయం తావ దీదృశో జాతః; తౌ పున ర్న జానామి కుశలవౌ ఏతావతా కాలేన కీదృశా వివ భవతః.

సీత:- భగవతి = పూజ్యురాలా! తమసే = తమసా; అయం = ఇది, తావత్=ఇపుడు, ఈదృశః=ఇట్టిది, జాతః=ఐనది; తౌ + కుశలవౌ + పునః=ఆకుశలవులైతే, ఏతావతా + కాలేన=ఇంతకాలమునకు, కీదృశౌ + ఇవ + భవతః=ఎట్టివారైరో; న + జానామి=తెలియకున్నాను.

తమసా:- యాదృశోఽయం తాదృశౌ తావపి.

తమస:- అయం = వీఁడు, యాదృశః = ఎట్టివాఁడో, ( ఆయెనో ) తౌ + అపి=వారిరువురును, తాదృశౌ=అట్టిరులే ( అయియుందురు. )

† సీతా:-ఈదృశ్యహం మందభాగినీ యస్యా న కేవలం నిరంతర మార్యపుత్రవిరహః పుత్రవిరహోఽపి.

సీత:- యస్యాః=ఎవ్వతెకు ( యేనాకు ) నిరంతరం = ఎల్లపుడును, న + కేవలం + ఆర్యపుత్ర-విరహః=ప్రాణేశ్వరునివలని యెడబాటుమాత్రమే కాదు. ( ...కాక ) పుత్ర=కొడుకులవలని + విరహః + అపి = ఎడబాటు గూడఁగలదో, అహం = నేను, ఈదృశీ = ఇట్టి, మందభాగినీ = దురదృష్ట వంతురాలను.

---

‡ భఅవది తమసే అఅం దావ ఏరిసో జాదో దే ఉణ ణ ఆణామి, కుసలవా ఏత్తిఏణ కాలేన కీదిసా విఅ హోంతి.

† ఏరిసో అహాం మందభాఇణీ జాఏ ణ కేఅలం ణిరంతరం అజ్జఉత్త విరహో పుత్తవిరహోవి

తమసా:- భవితవ్యతేయ మీదృశీ.

తమసా:- ఇయం = ఈ, ( నీసంబంధమగు ) భవితవ్యతా=నియతి, ఈదృశీ=ఇట్టిది ( నీగతి యీవిధినున్నది. )

( సీతా:- కిం వా మయా ప్రసూతయా యేన తాదృశయో ర్మమపుత్రికయో రీషద్విరలకోమలధవళదశనోజ్జ్వల కపోల మనుబద్ధముగ్ధకాకలీవిహసితం నిబద్ధకాకశిఖండక మమలముఖపుండరీకయుగలం న పరిచుంబిత మార్యపుత్రేణ.

సీత:- కిం + వా + మయా + ప్రసూతయా = నేనుగన్నలాభమేమి ? యేన=ఏకారణముచేత, తాదృశయోః=అట్టి, మమ=నాయొక్క, పుత్రికయోః = పసిపాపలయొక్క, ఈషత్ = కొంచెము + విరల = పలచగనున్నట్టియు + కోమల = సుకుమారములైనట్టియు + ధవళ=తెల్లనైనట్టియు + దశన=పండ్లచేత + ఉజ్జ్వల=ప్రకాశించుచున్న + కపోలం = గండస్థలములుగల్గినట్టియు, అనుబద్ధ=ఉత్పన్నమైన + కాకలీ = అవ్యక్తధ్వనితోఁగూడుకొనిన + విహసితం = నవ్వుగల్గినట్టియు, నిబద్ధ = కట్టఁబడిన + కాక - శిఖండకం=జునుపాలుగలట్టియు, అమల = నిర్మలమగు + ముఖ-పుండరీక= ముఖపద్మములయొక్క + యుగళం=జంట, ఆర్యపుత్రేణ=ఆర్యపుత్రునిచే, న + పరిచుంబితం=ముద్దుపెట్టుకొనఁబడలేదో.

తమసా:- అస్తు దేవతాప్రసాదాత్ !

తమస:- దేవతా=దేవతలయొక్క + ప్రసాదాత్ = అనుగ్రహము వలన, అస్తు = ( ఆముద్దుగొనుట ) ఒనగూడుఁగాక.

---

( కిం వా మఏ పసూదాఏ జేణ తారిసాణం మమ పుత్తఆణం ఈసివిరలకోమలధఅలదసణుజ్జలకవోలం అణువద్ధముద్ధకాఅలీవిహసిఅం,ణిబద్ధకాఅశిఖండకం అమలముహాపుండరీఅజుఅలం ణపరిచుంబిఅం అజ్జఉత్తేణ.

♦ సీతా:- భగవతి ! తమసే ! ఏతేన అపత్యసంస్మరణేన ఉచ్ఛ్వసితప్రస్నుతస్తనీ తయోశ్చ పితుః సన్నిధానేన క్షణమాత్రం సంసారిణీ అస్మి సంవృత్తా.

సీత:— భగవతి=పూజ్యురాలా ! తమసే = తమసా, ఏతేన = ఈ, అపత్య = సంతానముయొక్క + సంస్మరణేన = తలఁచుటచే, ఉచ్ఛ్వసిత= కంపించుచున్నట్టియు + ప్రస్నుత=చేపుచున్నట్టియు+ స్తనీ = పాలిండ్లుగల దానను; తయోః=వారిర్వురియొక్క, పితుః=తండ్రియొక్క, సన్నిధానేన= సమీపమందుండుటచే, క్షణమాత్రం=క్షణకాలము, సంసారిణీ+చ=కాఁపురముచేయుచున్నదానను, సంవృత్తా+అస్మి=ఐతిని.

తమసా:- కిమ త్రోచ్యతే. ప్రసవః ఖలు ప్రకర్షపర్యంతః స్నేహస్య. పరమం చైత దన్యోన్యసంశ్లేషణం పిత్రోః.

శ్లో॥ అంతఃకరణతత్త్వస్య దంపత్యోః స్నేహసంశ్రయాత్
ఆనందగ్రంథి రేకో౽య మపత్య మితి పఠ్యతే ॥ ౧౭

తమస:— అత్ర = ఈవిషయమున, కిం + ఉచ్యతే = ఏమిచెప్పఁబడును ( చెప్పనదేమి; నీవు చెప్పినవిషయము లోకసహజమైనదే ) ప్రసవః = అపత్యము, స్నేహస్య = ప్రేమయొక్క, ప్రకర్ష = ఆధిక్యము + పర్యంతః + ఖలు = అవధిగాఁగలదిగదా; ఏతత్ = ఈసంతానరూపమగు వస్తువు, పిత్రోః = తల్లిదండ్రులవిషయమున, పరమం = ఎక్కువగా, అన్యోన్య = ఒండొరులయొక్క + సంశ్లేషణం+చ = జతగూర్చునదియు (అగును )

♦ భఅవది తమసే ఏదిణా అవచ్చసంసుమరణేణ ఉస్ససిదపహ్ను దత్థణో తాణం చ పిదుణో సంణిహాణేణ ఖణమేత్తం సంసారిణీంహి సంవుత్తా.

అర్థః:— దంపత్యోః=భార్యాభర్తలయొక్క, అంతఃకరణ—తత్త్వస్య=హృదయరూపమగు నభేదవస్తువునకు, స్నేహ=ప్రేమయొక్క + సంశ్రయాత్ =సమాశ్రయణమువలన, ఏకః=(అనిర్వచనీయమగు) ముఖ్యాతిముఖ్యమగు, అయం=ఈ, ఆనంద — గ్రంథిః = ఆనందమయమగులంకె, అపత్యం+ఇతి=సంతాన—మని, పఠ్యతే=పరిభాషింపఁబడుచున్నది.

తా॥ దంపతులయొక్క మనస్తత్త్వమునకుఁ బ్రేమసమాశ్రయణము వలనఁ నేర్పడు సర్వప్రధానమును, ఆనందమయమునగు ముడియే సంతానమని పెద్దలు చెప్పుదురు గదా.

వాసంతీ:— ఇతో౾పి దేవః పశ్యతు.

శ్లో॥ అనుదివస మవర్ధయ త్ప్రియా తే
యమచిరనిర్గతముగ్ధలోలబర్హం
మణిముకుట ఇవోచ్ఛిఖః కదంబే
నదతి స ఏష వధూసఖ శ్శిఖండీ ॥ ౧౮

వా:— దేవః = దేవరవారు, ఇతః+అపి = ఇటువైపునకుఁగూడ, పశ్యతు=కనుగొందురుగాత.

అర్థః:— అచిర=కొద్దికాలముక్రిందటనే+నిర్గత=బయలువెడలిన+ముగ్ధ = సుందరమైన+లోల = చంచలమైన+బర్హం = పింఛముగలట్టి, యం = ఏనెమలిని, తే = నీయొక్క, ప్రియా = ప్రియురాలగుసీత, అనుదివసం=రోజురోజు, అవర్ధయత్ = పెంచెనో, సః+ఏషః+శిఖండీ= ఆయీనెమలి, వధూ—సఖః = ప్రియురాలు తోడుగాఁగలదై, కదంబే = కడిమిచెట్టుపై, మణి—ముకుటః+ఇవ=రత్నములు చెక్కఁబడిన కిరీటమువలె, ఉత్ శిఖః=పింఛముపైకెఁగలదై, నదతి=కేకవేయుచున్నది.

తా॥ రామచంద్రా! అదిగో యటుకనుగొనుము. తొల్లి సీత యేమరక ప్రతిదివసమును బెంచిన యీముద్దులనెమలి, యౌవనముగలదగుటచేఁ

వెంటితోఁగూడి యిప్పు డాకడిమిచెట్టుపైఁజేరి రత్నకిరీటమువలె నొప్పుతన పెద్దపింఛమును విప్పి, పైకెత్తి విలాసముగఁ బాడుచున్నది.

‡ సీతా:— ( సకౌతుకాస్రం. ) ఏష సః.

సీత:— ( సకౌతుక—అస్రం= కుతూహలము—బాష్పములతోఁగూడు నట్లుగా ) ఏషః=ఇది, ( ఈనెమిలి ) సః = అదియా ( నేనలనాఁడు పెంచినదియా. )

రామః:— మోదస్వ వత్స ! మోదస్వ.

రాముఁడు:— వత్స = కుమారా, మోదస్వ + మోదస్వ = ఆనందింపుము; ఆనందింపుము.

† సీతా:— ఏవం భవతు.

సీత:— ఏవం=ఇట్లు, భవతు=కానిమ్ము.

రామః:—శ్లో॥ భ్రమిషు కృతపుటాంతర్మండలావృత్తిచక్షుః
ప్రచలితచతురభ్రూతాండవై ర్మండయంత్యా
కరకిసలయతాలై ర్ముగ్ధయా నర్త్యమానం
సుతమివ మనసా త్వాం వత్సలేన స్మరామి ॥

రాముఁడు:— అర్థ:— భ్రమిషు = నాట్యభ్రమణములయందు, ( నీవు, మండలాకారంబునఁదిరుగువేళ ) కృత = చేయఁబడిన + పుట—అంతః=కన్నురెప్పలలోన + మండల—ఆవృత్తి=గుండ్రముగాఁ దిరుగుటలు గల్గిన,చక్షుః=కన్నులుగల,పరిచలిత=కదల్పఁబడినట్టియు + చతుర=సుందరము లైనట్టియు + భ్రూ = కనుబొమ్మలయొక్క + తాండవైః = విలాసగతివిశేషములచేతను, కర—కిసలయ = చిగురుటాకులనుబోలుచేతులయొక్క +

‡ ఏసో సో.　　† ఏవ్వం హోదు.

తాళైః=తాళములచేతను, మండయంత్యా=శోభనుగూర్చుచున్న,ముగ్ధయా= అమాయకురాలగు ప్రియురాలిచే ( సీతచే ) నర్త్యమానం = ఆడింపఁజే యఁబడుచున్న ,త్వాం=నిన్ను,వత్సలేన=సస్నేహమైన,మనసా=మనసుచేత, సుతం+ఇవ=కన్నకుమారునివలె, స్మరామి=తలపోయుచున్నాను.

తా॥ ఓ మయూరపోతమా ! ముగుదయగు నా ప్రియురాలు తనకను పాపలను, గనుబొమలను జిత్రవిచిత్రముగఁ ద్రిప్పుటలచే నీవు గుండ్రముగాఁ దిరుగుచుఁజేయు నాట్యవిలాసముల కొకనూత్న శోభను గూర్చుచుఁ గరపల్లవములచేఁ దాళము వేయుచు నిన్నాడించుచుండెడిది. అట్టి నిన్నిప్పు డిటుఁ జూడఁగల్గుటచే నెన్నడో పోయినకుమారుని నదృష్టవశమునఁ గాంచినట్లు నా కనురాగము గలుగుచున్నది.

రామః:— హన్త తిర్యంచోఽపి పరిచయ మనురుధ్యన్తే.

శ్లో॥ కతిపయకుసుమోద్గమః కదంబః
ప్రియతమయా పరివర్ధితో య ఆసీత్ —

రాముఁడు:— హన్త=ఏమిఆశ్చర్యము ! తిర్యంచః+అపి=తిర్యగ్జంతువులుగూడ, పరిచయం=పరిచయమును, అనురుధ్యన్తే=అనుసరించుచున్నవి.

అర్థ:— యః=ఏకడిమిచెట్టు, ప్రియతమయా=నాప్రియురాలిచే, పరివర్ధితః+ఆసీత్+పెంచఁబడెనో, ( సః=ఆ ) కదంబః=కడిమిచెట్టు, కతిపయ=కొలఁదిి+కుసుమ=పుష్పములయొక్క+ఉద్గమః=మొగ్గలుకలదియై యున్నది.

తా॥ మున్ను నాప్రేయసి నీళ్ళుపోసి పెంచిన కడిమిచెట్టిపుడు కొలఁదిగాఁ బుష్పములుగల్గి కానవచ్చుచున్నది.

* సీతా:— ( నిరూప్య, సాస్రం ) సుష్ఠు ప్రత్యభిజ్ఞాత మార్యపుత్రేణ.

---

* సుట్ఠు పచ్చహిఆణిదం అజ్జఉత్తేణ.

సీత:- ( నిరూప్య=నిరూపించి, సాస్రం=కన్నీటితోఁగూడునట్లు ) ఆర్యపుత్రేణ=నాథునిచే, సుష్ఠు = బాగుగా, ప్రత్యభిజ్ఞాతం = ఆనవాలు పట్టఁబడినది.

రామః—శ్లో॥ స్మరతి గిరిమయూర ఏష దేవ్యాః
స్వజన ఇవాత్ర యతః ప్రమోద మేతి॥ ౨౦

రాముఁడు:- దేవ్యాః = సీతాదేవియొక్క, ఏషః = ఈ, గిరి-మయూరః=పర్వతమయూరము, స్మరతి = గుర్తెఱుంగుచున్నది; యతః = ఏందువలననని, స్వజనే+ఇవ = స్వజనమునందువలె ( తనచుట్టముల మీఁది నానంద మొందినటుల ) అత్ర=ఈకదంబవృక్షమున, ప్రమోదం= ఆనందమును, ఏతి=పొందుచున్నది.

తా॥ సీతాదేవి పెంచిన యీ నెమిలి పూర్వపరిచయంబున బాగుగ గుర్తెఱింగి, ఈకడిమిచెట్టునఁజేరి, యిం దాత్మబంధువులఁ గూడిననాఁటి యానందానుభవంబు నొందుచున్నది.

వాసన్తీ:—అత్ర తావ దాసనపరిగ్రహం కరోతు దేవః
శ్లో॥ ఏత త్తదేవ కదళీవనమధ్యవర్తి
కాన్తాసఖస్య శయనీయశిలాతలం తే
అత్ర స్థితా తృణ మదా ద్బహుశో య దేభ్యః
సీతా తతో హరిణకైర్న విముచ్యతే స్మ॥ ౨౧

వాసంతి:—అత్ర+తావత్ = ఇందుల, దేవః = స్వామి, ఆసన= పీఠముయొక్క+ పరిగ్రహం=అవలంబమును, కరోతు=చేయుఁగాక.

అర్థః:— కాంతా - సఖస్య = భార్యాద్వితీయుఁడవగు, తే= నీకు కదళీ-వన = అరఁటితోఁటయొక్క+మధ్య = అంతర్భాగమునందు+వర్తి= ఉండెడి, ఏతత్ =ఈ, (ఈయెదుటఁగానఁబడెడు) శయనీయ=పరుండుటకు

దగియుండిన + శిలా—తలం= శిలాప్రదేశము, తత్ + ఏవ=అదియే; యత్ =ఎందువలన, సీతా=సీతాదేవి, బహుశః = పలుమారు, అత్ర = ఈస్థానమున, స్థితా= ఉన్నదై, ఏభ్యః = ఈ లేడికూనలకొఱకు, తృణం = గడ్డిని, ఆదాత్=ఒసంగెనో, తతః = ఆకారణమువలన, హరిణకైః = లేడిపిల్లలచే, న+విముచ్యతే+స్మ= (ఈస్థానము) విడువఁబడుటలేదు సుమా.

తా॥ శ్రీరామా! తొల్లి నీప్రియురాలును నీవును సుఖముగాఁ బరుండుట కుపయోగించుకొనినది యీయరటితోట నడుమనున్న యాపెద్దబండయేగదా! మఱియు నాజానకి మీఁదగూర్చుండియే సీత లేడిపిల్లలకు లేఁత పచ్చిక నోటనిడుచుంటచే మచ్చికపడి యవి యీనాఁటికిని నీప్రదేశంబును విడువఁజాలకున్నవి.

రామః:—ఇదం తావ దశక్యమేవ ద్రష్టుం (ఇ త్యన్యతో రుద న్నుపవిశతి.

రాముడు:—ఇదం + తావత్=ఇదన్ననో, ద్రష్టుం = చూచుటకు, అశక్యం=వీలులేనిది (ఇతి=అని), అన్యతః = మఱొకవైపున, రుదక్= ఏడ్చుచు, ఉపవిశతి= కూర్చుండుచున్నాఁడు.

† సీతా:—సఖి! వాసన్తి! కిం త్వయా కృత మార్య పుత్రస్య మమ చ ఏతద్దర్శయంత్యా? హా ధిక్; హా ధిక్; స ఏవ ఆర్యపుత్రః; తదేవ పంచవటీవనం; సా ఏవ ప్రియ సఖీ వాసన్తీ; తే ఏవ వివిధవిస్రంభసాక్షిణో గోదావరీకాననోద్దేశాః; తే ఏవ జాతనిర్విశేషా మృగపక్షిపాదపాః; సా ఏవ చాహం; మమ పున ర్మందభాగిన్యాః దృశ్యమానమపి సర్వ మే వైత న్నాస్తీతి; ఈదృశో జీవలోకస్య పరివర్తస్సంవృత్తః.

---

† సహి వాసంది కిం తుఏ కిదం అజ్జఉత్తస్స మహ అ ఏదం దంస అంతీఏ? హద్ధీ హద్ధీ సో ఏబ్బ అజ్జఉత్తో తం ఏబ్బ పంచవడీవణం సా ఎబ్బ

సీత:—చెలీ ! వాసన్తీ ! ఏతత్=దీనిని, దర్శయంత్యా = చూపెడి, త్వయా=నీచే, ఆర్యపుత్రస్య=ఆర్యపుత్రునకు, మమ+చ=నాకును, కిం+కృతం=ఏమిచేయఁబడినది? హా=అయ్యో ! ధిక్=ఛీ, ఆర్యపుత్రః=ఆర్యపుత్రుఁడు, సః+ఏవ=అతఁడె; పంచవటీ-వనం=పంచవటీకాననము, తత్+ఏవ=అదియె; ప్రియసఖీ=ప్రియసఖియగు, వాసన్తీ=వాసన్తి, సా+ఏవ= ఆమెయే; వివిధ=పలువిధములగు+విస్రంభ=నమ్మికలకు+సాక్షిణః=సాక్షీభూతములైన, గోదావరీ=గోదావరీప్రాంతమందలి+కానన=అడవులయొక్క +ఉద్దేశాః=ప్రదేశములు, తే+ఏవ=అవియే; జాత=సంతానముతో+నిర్విశేషాః=సమానములగు (స్వసంతానంబువలె సాకఁబడిన) మృగ—పక్షి—పాదపాః=లేళ్లు పక్షులు వృక్షములు; తే+ఏవ=అవియే; అహం+చ=నేనును, సా+ఏవ=ఆమెనే; మందభాగిన్యాః=దురదృష్టురాలనగు, మమ+పునః= నాకైతే, సర్వం=అంతయు, దృశ్యమానం+అపి=కనఁబడుచున్నను, తత్= అది, న+అస్తి+ఇతి+ఏవ = లేనట్టిదియే. జీవలోకస్య = ప్రాణిలోకము యొక్క, పరివర్తః=మార్పు, ఈదృశః=ఇట్టిదియై, సంవృత్తః=ఏర్పడినది.

వాసన్తీ:—సఖి ! సీతే ! కథం న పశ్యసి రామస్యావస్థాం ?

శ్లో॥ కువలయదలస్నిగ్ధై రంగై ర్దదౌ నయనోత్సవం
సతతమపి తే స్వేచ్ఛాదృశ్యో నవం నవ మేవ యః
వికలకరణః పాండుః సోఽయం శుచా పరిదుర్బలః
కథమపి స ఇత్యున్నేతవ్య స్తథాపి దృశాం ప్రియః॥

---

పిఅసహీ వాసన్తీ తే ఏవ్వ వివిహవీస్సంభసాక్షిణో గోదావరీకాణణుద్దేసా; తే ఏవ్వ జాదనిబ్బిసేసా మఅపక్ఖిపాదపా; సా ఏవ్వ చాహం మమ ఉణ మందభాఇణీఏ దీసమాణం వి సవ్వం ఏవ్వ ఏదం ణత్థిత్తి తా ఏరిసో జీఅలోఅస్స పరివుత్తో సంవుత్తో.

వాసన్తి:—సఖి=చెలీ, సీతే = సీతా, రామస్య = రామచంద్రుని యొక్క, అవస్థాం = అవస్థను, న + పశ్యసి+కథం=ఎట్లు చూడకున్నావు?

అర్థః—సతతం=ఎల్లప్పుడు, స్వేచ్ఛా=స్వేచ్ఛగా+దృశ్యః + అపి= చూడఁదగినవాఁడైనను, యః=ఏరాముఁడు, కువలయ—దల=నల్లకలువ రేకుల వలె+స్నిగ్ధైః=కోమలములగు, అంగైః=అవయవములచే, నవం+నవం+ఏవ= క్రొత్తక్రొత్తగానే, తే=నీకు, నయన=నేత్రములకు + ఉత్సవం=ఆనంద మును, దదౌ=(మున్ను) ఒసంగెనో, సః + అయం=అట్టియాతఁడు, శుచా= దుఃఖముచే, వికల—కరణః = నిశ్చేష్టములగు — అవయవములుగలవాఁడును, పాండుః=తెల్లఁబారినవాఁడును,పరిదుర్బలః=మిక్కిలిబలహీనుఁడునై,కథం+ అపి=అతికష్టముమీఁద, సః+ఇతి=ఆరాముఁడేయని, ఉన్నేతవ్యః = అన వాలుపట్టఁదగియున్నాఁడు. తథా + అపి= అట్లయ్యును, దృశాం=నేత్రము లకు, ప్రియః=ఇష్టమైనవాఁడుగనేయున్నాఁడు.

తా॥ ఈ రామచంద్రుఁడు మున్ను నిరంతరము యథేష్టముగఁజూడఁ బడుచుండియుఁ గువలయదళములవలె మిసిమిమీఱిన తన యవయవములచే నెప్పటి కప్పుడే యొకనూత్నసౌందర్యము హెచ్చ మరలమరలఁజూడఁదగి యుండెడివాఁడు. అట్టివాఁ డిప్పు డీప్రియావియోగదుఃఖముచే నంగముల బిగివిచెడి, మిక్కిలి చిక్కిపోయి, వెలవెలఁబోవుచుఁ దుదకు బహుకష్టము మీఁద 'నాఁటిరాముఁ డీతఁడే' యని గుర్తింపఁదగియున్నాఁడు;గాని యిట్ల య్యును దనసహజసౌందర్యముచే దర్శనీయుఁడుగనే యున్నాఁడుగదా!

* సీతా:- ప్రేక్షే సఖి ప్రేక్షే.

సీత:— సఖి = చెలీ! ప్రేక్షే, చూచుచున్నాను, ప్రేక్షే = చూచుచున్నాను.

---

* పేక్ఖామి సహి పేక్ఖామి.

తమసా:– పశ్యన్తి ప్రియం భూయాః.

తమస:– ప్రియం = ప్రియుని, పశ్యన్తీ + భూయాః = చూచు చుందువు గాక.

१ సీతా:– హా దైవ! ఏష మయా వినా అహ మేతేన వినేతి కేన సంభావిత మాసీత్. తన్ముహూర్తకమపి జన్మాంత రాదివ లబ్ధదర్శనం బాష్పసలిలాంతరేషు ప్రేక్షే తావ ద్వత్సల మార్యపుత్రం ( ఇతి సతృష్ణం పశ్యతి. )

సీత:— దైవ=ఓవిధీ! మయా + వినా– నేను లేకుండ, ఏషః = ఈతఁడును, ఏతేన + వినా= ఈతఁడు లేక, అహం= నేనును(ఉండవలసినకాలమువచ్చునని) ఇతి=అని, కేన=ఎవనిచే, సంభావితం + ఆసీత్=ఊహింపఁబడినది? తత్ =అందువలన, జన్మ–అంతరాత్ + ఇవ=మఱొకజన్మమునెత్తినదానివలననోయన్నట్లు, లబ్ధ=పొందఁబడిన+దర్శనం=దర్శనముగల, వత్సలం=ప్రేమాస్పదుఁడగు, ఆర్యపుత్రం=ఆర్యపుత్రుని, తావత్= ఇపుడు, బాష్ప–సలిల= కన్నీటియొక్క– (కన్నీరుకార్చెడివేళ) + అంతరేషు= మధ్యలయందు (నడుమ నడుమ)ముహూర్తకం + అపి=క్షణమెయైనను, ప్రేక్ష్యే=చూచెద(ఇతి=అని సతృష్ణం= దగతోఁగూడునట్లు, పశ్యతి=చూచుచున్నది.

తమసా:—(సస్నేహాసం పరిష్వజ్య)

శ్లో॥ విలులిత మతిపూరై ర్బాష్ప మానందశోక
ప్రభవ మవసృజన్తి తృష్ణ యోత్తానదీర్ఘా

---

१ హా దేవ్వ ఏసో మఏ విణా అహం ఏదేణ విణాత్తి కేణ సంభావిదం ఆసీ. తా ముహుత్తఅం వి జమ్మంతరాదో విఅ లద్ధదరిసణం వాహసలిలన్తరేసు పేక్ఖామి దావచ్ఛలం అజ్జఉత్తం.

స్నపయతి హృదయేశం స్నేహనిష్యన్దినీ తే
ధవలబహులముగ్ధా దుగ్ధకుల్యేవ దృష్టిః॥ 23

తమస.—(సస్నేహ—అస్రం = ప్రేమబాష్పయుక్తముగా, పరిష్వజ్య=కౌఁగిలించి,)

అర్థః—అతిపూర్తైః=గొప్పప్రవాహములచే, (లుగా) విలులితం=జారిన, ఆనంద=(భర్తృసందర్శనమువలని) ఆనందమువలనను + శోక=దుఃఖమువలనను + ప్రభవం=పుటుకగల, బాష్పం=కన్నీరు, అవసృజన్తీ = విడుచుచు, తృష్ణయా=ఆశచే, ఉత్తాన= విపులమును + దీర్ఘా=పొడవైనట్టియు, ధవల—బహుల= మిక్కిలితెల్లనిదియు + ముగ్ధా=మనోహరమైనదియుఁగనుకనే, దుగ్ధ—కుల్యా + ఇవ=పాలయొక్క కాల్వవలె, తే=నీయొక్క, దృష్టిః=చక్షువు, స్నేహ = ప్రేమను + నిష్యందినీ=కురియుచున్నదై, హృదయ—ఈశం=మనోనాథుని, స్నపయతి=స్నానముచేయించుచున్నది.

తా॥ చెలీ! ఆనందముచేతను, శోకముచేతను బ్రవాహములుగఁబొంగి పొరలు నశ్రువులఁ గార్చుచు, నేదోయాశచే నెత్తఁబడి దీర్ఘమై, తెల్లఁ బారియు బహుమనోహరమై, ప్రేమను గ్రుమ్మరించు నీదృష్టి యమృత స్రవంతివలె నీహృదయేశుని ముంచివేయుచున్నది సుమా.

వాసంతీ:—

శ్లో॥ దదతు తరవః పుష్పై రర్ఘ్యం ఫలైశ్చ మధుశ్చ్యుతః
స్ఫుటితకమలామోదప్రాయాః ప్రవాన్తు వనానిలాః
కల మవిరలం రజ్యత్కంఠాః క్వణంతు శకుంతయః
పున రిద మయం దేవో రామః స్వయం వన మాగతః॥

వాసన్తి:—అయం=ఈ, రామః + దేవః=రామదేవుఁడు, స్వయం= తనకైతానె, ఇదం=ఈ, వనం=అడవిఁగూర్చి, పునః=మగుడ, ఆగతః=

వచ్చియున్నాఁడు (కాన) మధు—శ్చ్యుతః=తేనె — కుటిపించు, తరవః= వృక్షములు, పుష్పైః=పువ్వులచేతను, ఫలైః + చ=పండ్లచేతను, అర్ఘ్యం= అర్ఘ్యమును, దదతు=ఇచ్చుఁగాక; స్ఫుటిత=వికసించిన + కమల=కమల ములయొక్క + ఆమోద — ప్రాయాః = సువాసనచేఁబూర్ణములైన, వన— అనిలాః = వనసంబంధములగు — వాయువులు, ప్రవాన్తు = వీచునుగాక; రజ్యత్=రంజనగూర్చు + కంఠాః=కంఠములుగల, శకుంతయః = పక్షులు, అవిరళం=ఎడతెగక, కలం = మధురముగా, క్వణంతు = ధ్వనిచేయుఁగాక (పాడునుగాక;)

తా॥ రామచంద్రమూర్తి తనకై తానే యీవనంబునకు వచ్చియున్న వాఁడుగాన, ఓ తేనెలగుటిపించు తరురాజంబులారా ! మీరు ఫలపుష్పంబు లచే నా మహానుభావున కర్ఘ్యంబొసంగుఁడు; ఓ వనవాతంబులారా ! మీరు కమలగంధసువాసితంబులగు వాయువుల వీఁచుఁడు; ఓ శకుంతంబులారా ! మీరుగూడ నవిచ్ఛిన్నంబుగ మీయవ్యక్తమధురకంఠంబులగానంబొనర్పుఁడు.

రామః:— ఏహి సఖి ! వాసన్తి ! నన్వితః స్థీయతాం.

రాముఁడు:— సఖి=చెలి, వాసన్తి=వాసన్తీ, ఏహి=రమ్ము; ఇతః= ఈవైపున, స్థీయతాం + నను=కూర్చుండుమా.

వాసన్తీ:— ( ఉపవిశ్య సాస్రం ) అపి కుశలం కుమార లక్ష్మణస్య ?

వాసన్తి:— ( ఉపవిశ్య=కూర్చుండి, స—అస్రం = కన్నీటితోఁగూడు నట్లు ) కుమార—లక్ష్మణస్య = లక్ష్మణకుమారునకు, అపి + కుశలం = క్షేమ మేనా ?

రామః—( ఆకర్ణితి మభినీయ )

శ్లో॥ కరకమలవితీర్ణై రంబునీవారశష్పై
స్తరుశకునికురంగాన్ మైథిలీ యా నపుష్యత్

భవతి మమ వికార స్తేషు దృష్టేషు కో౽పి
ద్రవ ఇవ హృదయస్య ప్రస్తరోద్భేదయోగ్యః॥

రాముఁడు:—(అశ్రుతిం=వినమిని, అభినీయ=నటించి)

అర్థ:—యాన్=ఏ, తరు—శకుని—కురంగాన్=చెట్లను — పక్షులను—లేళ్ళను, మైథిలీ=సీత, కర—కమల=పద్మహస్తములచే + వితీర్ణైః=పంచియీయఁబడిన, అంబు—నీవార—శష్పైః=నీటిచేతను-నివ్వరిధాన్యముచేతను—లేఁతపచ్చికలచేతను, అపుష్యత్ = పోషించెనో, తేషు=అవి, దృష్టేషు=చూడఁబడఁగా, మమ = నాకు, ప్రస్తర = ఱాలయొక్క + ఉద్భేద = బ్రద్దలుచేయుటయందు + యోగ్యః = సమర్థమగు, ద్రవః + ఇవ = ద్రవమువలె కః + అపి = ఏదోయొక (అనిర్వాచ్యమగు,) వికారః = మార్పు, మమ = నాయొక్క, హృదయస్య = మనస్సునకు, భవతి=కలుగుచున్నది.

తా॥ సీత, ప్రేమాతిశయంబునఁ దన హస్తపద్మములచే నీళ్లుపోసి పెంచిన యీవృక్షములును; నీళ్లు,నివ్వరిధాన్యములొసఁగి సాకిన యీశకుంతంబులును; నీళ్ళు,నివ్వరిధాన్యము,లేఁబచ్చికయునొసంగిపోషించినయీలేళ్ళును నాకంటఁబడుటచే నేమోగాని గండశిలలనైన బ్రద్దలుగావింపఁగల ద్రవమువలెఁ జెప్పరాని వికారమేదోయొకటి నాగుండెలఁబగులఁ గొట్టుచున్నది.

వాసన్తీ:—మహారాజ ! నను పృచ్ఛామి—అపి కుశలం కుమారలక్ష్మణస్య ?

వాసన్తి:—మహారాజ=ఓమహారాజా,నను + పృచ్ఛామి=మంచిది—అడుగుచున్నాను; కుమారలక్ష్మణస్య=లక్ష్మణకుమారునకు, అపి + కుశలం=సేమమేనా ?

రామః:—(స్వగతం) అయే ! మహారాజేతి నిష్ప్రణయమామంత్రణపదం; సౌమిత్రిమాత్రే చ బాష్పస్ఖలితాక్షరః

కుశలప్రశ్నః, తథా మన్యే విదితసీతావృత్తాం తేయమితి (ప్రకాశం) ఆః—కుశలం కుమారస్య (ఇతి రోదితి).

రాముఁడు:—(స్వగతం=తనలో) అయే=హాయేమి; మహా—రాజ+ఇతి='మహారాజ' అను(స్నేహభావబద్ధులఁ బిలిచెడిరీతి వదలి, రాజభావోద్ధతులఁ బిలుచురీతి) నిష్ప్రణయం=ప్రేమరహితమైన, ఆమంత్రణ—పదం=సంబోధనపదమున్ను, సౌమిత్రిమాత్రే= (సీతనువిడిచి)ఒక్కలక్ష్మణుని విషయమునన్నే, బాష్ప=కన్నీటిచే+స్ఖలిత=తొట్రిలిన+అక్షరః=అక్షరములుగల, కుశల—ప్రశ్నః+చ=కుశలప్రశ్నమున్ను (కావింపఁబడినవి) ఇయం = ఈమె, విదిత=తెలియఁబడిన+సీతా=సీతయొక్క+ వృత్తాంతా = వార్తకలది; ఇతి=అని, తథా=పైవిధమున, మన్యే=తలంచుచున్నాఁడ. (ప్రకాశం=ప్రకాశముగా) ఆః=ఆ, కుమారస్య=కుమారలక్ష్మణునకు, కుశలం=సేమము (ఇతి=అని, రోదితి=ఏడ్చుచున్నాఁడు)

వాసంతీ:— అయి దేవ ! కిమితి దారుణః ఖల్వసి.

వాసంతి:—అయి = ఓయీ, దేవ = దేవా ! కిం+ఇతి = ఏమని, దారుణః = కఠినుఁడవు, అసి+ఖలు = అయితివోగదా.

* సీతా:—సఖి ! వాసంతి ! కిం త్వ మసి ఏవం వాదినీ? ప్రియార్హాః ఖలు సర్వస్య ఆర్యపుత్రో; విశేషతో మమ ప్రియసఖ్యాః

సీత:—సఖి=చెలీ ! వాసంతి = వాసంతీ, త్వం = నీవు, ఏవం + వాదినీ=ఇట్లుపల్కుదానవు, అసి+కిం=అగుచున్నావేమి ? ఆర్యపుత్రః = ఆర్యపుత్రుఁడు, సర్వస్య=అందఱకును, ప్రియ=ప్రియభావములచే+అర్హాః =

* సహి వాసంతి కిం తుమం సి ఎవ్వంవాదిణీ ? పిఆరుహాక్ఖ సవ్వస్స అజ్జఉత్తో విసేసదో మమ పిఅసహీ ఏ.

పూజ్యుఁడు; విశేషతః=ఎక్కువగా, మమ=నాయొక్క, ప్రియ-సఖ్యాః= ప్రియసఖికి; (సీకుఁబ్రియార్హుఁడు.)

వాసంతీ:—

" శ్లో॥ త్వం జీవితం త్వ మసి మే హృదయం ద్వితీయం
త్వం కౌముదీ నయనయో రమృతం త్వ మంగే "
ఇత్యాదిభిః ప్రియశతై రనురుధ్య ముగ్ధాం
తా మేవ-శాంత మథవా కిమి హోత్తరేణ॥ ౨౬

(ఇతి మూర్ఛతి)

వాసంతీ:—అర్థః—త్వం=నీవు, జీవితం = ప్రాణము, అసి = అగుచున్నావు; త్వం=నీవు, మే=నాకు, ద్వితీయం=రెండవ, హృదయం—అసి= హృదయమగుచున్నావు; త్వం=నీవు, నయనయోః=నేత్రములకు, కౌముదీ+ అసి=వెన్నెలవగుచున్నావు; త్వం=నీవు, అంగే=శరీరమున, అమృతం+ అసి=అమృతమగుచున్నావు; ఇతి + ఆదిభిః—ఈ మొదలైన, ప్రియశతైః= మూఁడుకోట్లఁది యిచ్చకములచే, తాం=ఆ, ముగ్ధాం=అమాయకురాలగు సీతను, అనురుధ్య=లాలనచేసి లోఁబఱచుకొని తెచ్చి, తాం+ఏవ=అట్టివేలనే... (వంచించినాఁడవు); శాంతమ్=పాపము శాంతించునుగాక; అథవా=అట్లు కాకున్నను, ఇహ=ఈవిషయమున, ఉత్తరేణ=జవాబుచే, కిం=ఏమిప్రయోజనము (ఇతి=అని, మూర్ఛతి=మూర్ఛపోవుచున్నది)

తా॥ ఓయీ ! రామా ! నీవు, అమాయకురాలగుసీతతో "ఓప్రియురాలా! నీవే నాజీవితమవు; నీవే నామానసంబవు; నీవే మదీయనయనచంద్రికవు; నీవే నాయంగంబుల కమృతరసంబుమాడ్కి జీవనం బొసంగుదానవు" అని యిట్లేమేమో యిచ్చకంపుమాటల నమ్మఁబల్కి తుద కట్టిముగ్ధరాలినే వంచించితివే; కానిమ్ము. సరిలే—ఒకవేళనీవుచేసినపనికి జవాబేమైనను

జెప్పదమనియనుకొనినను, ఇందుజవాబు చెప్పుటకుమాత్రి మేముందును ? దానఁబ్రియోజనముమాత్రి మేమిగల్గును ?

రా. స్. తమసా:- స్థానే ఖలు, వాక్యనివృత్తి ర్మోహశ్చ.

తమసః:- వాక్య = పల్కులయొక్క + నివృత్తిః=ఆగిపోవుటయు, మోహః + చ=మూర్ఛఁజెందుటయు, స్థానే + ఖలు=యుక్తమేగదా.

రామః:- సఖి ! సమాశ్వసిహి సమాశ్వసిహి.

రాముఁడు:- సఖి=సఖీ ! సమాశ్వసిహి (౨) = ఊఱడిలుము (౨).

వాసంతీ:- ( సమాశ్వస్య ) తత్ కిమిద మకార్య మనుష్ఠితం దేవేన.

వాసంతి:- ( సమాశ్వస్య=ఊఱడిల్లి ) దేవేన=దేవరవారిచే, ఇదం= ఈ, అకార్యం=చేయరానిపని, అనుష్ఠితం + తత్ + కిం=చేయఁబడినదదేమి?

♦ సీతా:- సఖి ! వాసన్తి ! విరమ, విరమ.

సీత:- సఖి=చెలీ ! వాసంతి=వాసంతీ ! విరమ + విరమ=ఊరకుండుము, ఊరకుండుము.

రామః:- లోకో న మృష్యతీతి.

రాముఁడు:- లోకః=ప్రపంచము, న + మృష్యతి = ( సీతనింటియందుంచుకొనుటను ) సహింపఁజాలకున్నది, ఇతి=అని.

వాసంతీ:- తత్ కస్య హేతోః ?

వాసంతి:- తత్ = అది, కస్య = దేనియొక్క, హేతోః = కారణమువలన.

రామః:- స ఏవ జానాతి కిమపి.

రాముఁడు:- సః + ఏవ= ఆలోకమే, కిం + అపి = ( కారణము ) ఏమైనది, జానాతి=ఎఱుఁగును.

---

♦ సహి వాసంది విరమ విరమ.

తమసా:– ఉచిత స్తదుపాలంభః.

తమసః– తత్ = అందువలన, ఉపాలంభః = నిందావాక్యము, ఉచితః = తగినదె.

వాసంతీ:– శ్లో॥ అయి కఠోర ! యశః కిల తే ప్రియం
కి మయశో నను ఘోర మతఃపరమ్
కి మభవ ద్విపినే హరిణీదృశః
కథయ నాథ! కథం బత మన్యసే॥ ౨౭

వాసంతి:– అర్థ:–అయి=ఓయీ, కఠోర=కఠినుఁడా ! తే = నీకు, యశః + కిల + ప్రియం=కీర్తియిష్టమైనదఁటే ? నను=మంచిది, అతః + పరం=ఇంతకన్నను ( పూర్ణగర్భయగుసీత నడవులపాలు సేయుటకన్నను ) ఘోరం = ఘోరమగు, అయశః=అపకీర్తి, కిం=ఏమి ? ( ఉండును ) నాథ= ప్రభూ! విపినే=అడవియందు, హరిణీదృశః=లేడిచూపులవంటిచూపులుగల సీతకు, కిం=ఏమి, అభవత్=ఆయెనో, ( తటస్థించెనో అనువిషయమున ) బత=అయ్యో, కథం + మన్యసే=ఎట్లుతలంచెదో; కథయ=చెప్పుమా.

తా॥ ఓకఠినహృదయుఁడా ! నీకుఁ బ్రియమైనదొకకీర్తియేనా ? నిర్దయుఁడవై సీతామతల్లిని గానలపాలుచేయుట నీకిదియొక కీర్తిహేతువా ? ఇంతకన్నను ఘోరాపకీర్తి ప్రపంచమున మఱొండుండునే ? కావలసినట్లు చేసితివిసరే; ఆమె కం దేమితటస్థించియుండునని నీవూహించెదవో యించుక తెలియపఱచుమా.

* సీతా:—త్వమేవ సఖి వాసంతి! దారుణా కఠోరాచ; యా ఏవ మార్యపుత్రం ప్రదీప్తం ప్రదీపయసి.

---

* తుమం ఏవ్వ సహి వాసంతి దారుణా కఠోరా అ జా ఏవ్వం అజ్జ ఉత్తం పదీత్తం పదీవేసి॥

సీత:—సఖి=చెలీ ! వాసంతి=వాసంతీ ! యా=ఏనీవు, ఏవం=ఇట్లు, ప్రదీప్తం=పరితప్తుఁడైన, ఆర్యపుత్రం=ఆర్యపుత్రుని, ప్రదీపయసి=మిగులఁ బరితపింపఁజేసెదవో, సా=అట్టి, త్వం+ఏవ=నీవే, దారుణా =గడుసుదానవును, కఠోరా+చ=కఠినురాలవును, అసి=అగుచున్నావు.

తమసా:—ప్రణయ ఏవం వ్యాహరతి శోకశ్చ.

తమస:—ప్రణయః = అనురాగమును, శోకః+చ = దుఃఖమును, ఏవం=ఇట్లు, వ్యాహరతి=నుడివెడిని.

రామః:—సఖి ! కిమత్ర మంతవ్యం ?

శ్లో॥ త్రస్తైకహాయనకురంగవిలోలదృష్టే
స్తస్యాః పరిస్ఫురితగర్భభరాలసాయాః
జ్యోత్స్నామయీవ మృదుబాలమృణాలకల్పా
క్రవ్యాద్భి రంగలతికా నియతం విలుప్తా॥ 20

రా:—సఖి=చెలీ, అత్ర=ఈవిషయమున, కిం+మంతవ్యం=తలఁపఁదగినదేమి ?

అర్థ:—నియతం=నిశ్చయముగా, పరిస్ఫురిత=అదరుచున్న + గర్భ= చూలుయొక్క + భర=భారముచే + అలసాయాః = మందమైనట్టియు, త్రస్త=జంకిన+ఏక—హాయన=ఒక్క—వత్సరమీడుగల + కురంగ = లేడి యొక్క(వలె)+విలోల=సంచలించెడి+దృష్టేః=చూపుగలట్టియు, తస్యాః= ఆసీతయొక్క, మృదు=సుతిమెత్తనైన + బాల—మృణాలకల్పా=లేతతామర తూండ్లతోసమానమైనట్టియు, జ్యోత్స్నామయీ + ఇవ = చంద్రికాపూర్ణ మగు దానివలెనున్న, అంగ—లతికా = తీగెవంటిశరీరము, క్రవ్య—అద్భిః= మాంసము మెక్కెడిమృగములచే, (సింహశార్దూలాదులచే) విలుప్తా=నాశన మొందింపఁబడియె.

తా॥ వాసంతీ; కానలడింపఁబడిన సీతావిషయమున, నే నేమితలంచు చున్నవాఁడనని చెప్పుదు; — 'నే నెప్పు డామె నడవులపాలుచేయించితి నోయపుడే యామె యేకాకిని యగుటచే, సింహాదిమృగంబులవలన భీతిచెంది యుండు; భయమువలన నిటునటుఁబారఁ బ్రియత్నించియుండు; నిండుచూ లాలగుటచే గర్భభారంబున మందతమగమనయైయుండు; ఆయాసంబున నడువలేక భయమొందుచు నొక్కవత్సరమీడుగల లేడిపిల్లవలె బిత్తిరి చూపులుచూచుచుండు; అట్టిచో ననాయాసంబునఁ జేఁజిక్కఁగదాయని ఘాతుకమృగంబులు లేఁతతామరతూండ్లవలె మిక్కిలికోమలములైన యవ యవములుగల్గి చంద్రికిరణంబులచేఁ గూర్పఁబడినదా యేమనునట్లు గన్పట్టు నామెదేహలతికనుబట్టి యానందంబున భక్షించియుండు' నని యెంచెద,

* సీతా:—ఆర్యపుత్ర ! ధ్రియే; ఏషా ధ్రియే,

సీత:—ఆర్యపుత్రి=ఆర్యపుత్రుఁడా, ధ్రియే — బ్రతికియున్నాను, ఏషా=ఈ నేను, ధ్రియే=బ్రతికియున్నాను.

రా:—హాప్రియే; జానకి ! క్వాసి ?

రా:—హా=అయ్యో, ప్రియే=ప్రియురాలా, జానకి=జనకరాజపుత్రీ, క్వ+అసి=ఎందున్నావు ?

† సీతా:—హా ధిక్ హాధిక్ ; ఆర్యపుత్రో౾పి, ప్రముక్త కంఠం రుదితః.

సీత:—హా+ధిక్=అయ్యోఛీ; ఆర్యపుత్రః+అపి=నాథుఁడుకూడ ప్రముక్త-కంఠం=విడువఁబడిన కంఠముకలుగునట్లు(ఎలుగెత్తి) రుదితః=ఏడ్చెడి

తమసా:— వత్సే ! సాంప్రతికమే వైతత్. కర్తవ్యాః దుఃఖితై ర్దుఃఖనిర్వాపణాని యతః; —

---

* అజ్జఉత్త ధరిఏ; ఏసా ధరిఏ.

† హద్ధీ, హద్ధీ, అజ్జఉత్తోవి పముక్కకంఠం రుణ్ణో.

శ్లో॥ పూరోత్పీడే తటాకస్య పరీవాహః ప్రతిక్రియా
శోకక్షోభే చ హృదయం ప్రలాపైరేవ ధార్యతే ॥ ౨౯

తమసః—వత్సే=బిడ్డా! ఏతత్=ఇది, సాంప్రతికం+ఏవ=తగినదే; దుఃఖితైః=దుఃఖించినవారిచే, దుఃఖ-నిర్వాపణాని=దుఃఖముయొక్క-తొలఁగించుటలు, కర్తవ్యాని = చేయఁదగినవి. (కడుపులోని దుఃఖమును వెడలఁగ్రక్క-వలయుఁగదా) — యతః=ఏలయనిన.

అర్థః— తటాకస్య = చెరువునకు, పూర = ప్రవాహమువలని + ఉత్పీడే = ఒఱయికకల్గునెడ (చెరువులో నీరు మిక్కుటమగుచుండునెడ) పరీవాహః=తూమే, ప్రతిక్రియా = ప్రతీకారము (విమోచనోపాయము) (తథా=అట్లే) శోక=దుఃఖమువలని + క్షోభే=బాధకల్గునెడ, హృదయం + చ=హృదయమున్ను, ప్రలాపైః + ఏవ = రోదనలచేతనే, ధార్యతే= ధరింపఁబడును.

తా॥ చెఱువునందలినీరు పైకెగఁబ్రాకి కట్ట వోఱయునపుడు దానిని గాపాడుటకుఁ దూము తెఱచుట యొక్క-టియే గతి; లేనిచోఁ గట్ట తెగి ప్రమాదముగూర్చును; అవిధముగానే హృదయతటాకంబున దుఃఖజలంబు మిక్కుటమగునెడఁ దద్రక్షణంబున శోకక్రోదనమే శరణ్యము; లేనిచోఁ బ్రమాదము ఘటిల్లు.

తమసా:— విశేషతో బహుతరప్రకారకష్టో రామభద్రస్య జీవలోకః.

శ్లో॥ ఇదం విశ్వం పాల్యం విధివదభియుక్తేన మనసా ।
ప్రియాశోకో జీవం కుసుమమివ ఘర్మో గ్లపయతి ।
స్వయం కృత్వా త్యాగం విలపనవినోదో ప్యసులభ-
స్తదద్యాప్యుచ్ఛ్వాసో భవతి నను లాభో హి రుదితం॥

తమసా:- విశేషతః=ఎక్కువగా, రామభద్రస్య=రామభద్రునకు, జీవలోకః=సంసారము, బహుతర=పలువిధములగు + ప్రకార=భేదములు గల + కష్టః=కష్టములుకలది.

అర్థః:- అభియుక్తేన = ఏమరపాటులేని, మనసా = మనస్సుచే, ఇదం=ఈ, విశ్వం=ప్రపంచము, విధివత్ = శాస్త్రప్రకారము, పాల్యం= పాలింపఁదగినది; ప్రియాశోకః=ప్రియురాలివలని దుఃఖము, ఘర్మః=ఎండ, కుసుమం+ఇవ=పుష్పమునువలె, జీవం=ప్రాణమును, గ్లపయతి=ఎండించు చున్నది; స్వయం=స్వయముగానే, త్యాగం- విడుచుటను, కృత్వా=చేసి, (తనకైతానే చేతులార సీతను గానల విడిపింపఁబుచ్చిన యీరామునకు) విలపన=విలాపరూపమగు + వినోదః + అపి=వినోదమైనను (విలపించినఁ గొంతశాంతిగలుగునన్నను, దనకై తాఁజేసిన యకార్యంబునకు వగచిన లోకము హాసించు) అసులభః = సులభమైనదికాదు; తత్ = అందువలన, అద్య + అపి=ఇప్పటికిని, ఉచ్ఛ్వాసః=ప్రాణధారణము,భవతి=కల్గుచున్నది; నను = నిశ్చయమునకు, రుదితం=విలపించుట, లాభః=లాభమైనదియేకదా.

తా॥ ఈప్రపంచమంతయు మనరామభద్రుఁడు చిత్తమున నేమర పాటించుకంతయేనిలేక పాలింపవలె; ఒకవైపున నాతని హృదయ కుసు మంబును, జానకీవియోగశోకాతపంబు నిర్జీవంబుగఁ జేయుచున్నది; పోనిమ్ము లోనమండి కుములఁజేయువియోగదుఃఖ మొకమారు పెద్దపెట్టున నేడ్చిన యెడల శాంతించుననుకొనినచోఁ దననుజూచి పలువురు— “ఈరాముని దనభార్య నడవులపాలుచేయుమన్నవా రెవరు? అందులకు విలపించు మన్నవారెవరు? స్వయముగాఁ జేసినదాని కింతవంతయేల” యనుచు నిందిం తురేమో? అని, బిగ్గరగ నేడ్చుటకు నింకొకవైపున నభిమానముబాధించు చున్నది; పైయనుమితులు సత్యంబులని వాక్రుచ్చుట కిప్పటికిని గననగు సీతనియుచ్ఛ్వాసవైఖరులే సాక్ష్యంబులు; కానింబట్టి రాముఁడిట్లు విలపించు టయు లాభకారియే యనితోఁచెడి.

రామః:—కష్టం భోః కష్టం.

శ్లో॥ దలతి హృదయం గాఢోద్వేగం ద్విధా తు న భిద్యతే.
వహతి వికలః కాయో మోహం న ముంచతి చేతనాం
జ్వలయతి తనూ మంతర్దాహః కరోతి న భస్మసాత్
ప్రహరతి విధి ర్మర్మచ్ఛేదీ న కృంతతి జీవితం॥ ౩౧

రా:—భోః=హా, కష్టం+కష్టం=కష్టముకష్టము.

అర్థ:—గాఢ=ప్రబలమగు+ఉద్వేగం=ఎత్తిపోతగల, హృదయం=మనస్సు, దలతి=పెట్లుచున్నది;తు=కాని, ద్విధా=రెండుగా, న+భిద్యతే=వ్రక్కలై పోవుటలేదు; వికలః=సారహీనమైన,కాయః=శరీరము, మోహం=మూర్ఛను, వహతి = పొందుచున్నది; (కాని) చేతనాం = చైతన్యమును, న+ముంచతి = విడుచుటలేదు; అంతః = లోపలి+దాహః = తాపము, తనూం=దేహమును, జ్వలయతి=కాల్చుచున్నది; (కాని) భస్మసాత్=భస్మమైనదానినిగా, న+కరోతి=చేయుటలేదు; విధిః=దైవము, మర్మ=ఆయువుపట్లను+ఛేదీ=నఱకువాఁడగుచు, ప్రహరతి = కొట్టుచున్నాఁడు; (కాని) జీవితం=ప్రాణమును, న+కృంతతి=ఛేదించుటలేదు.

తా॥ హృదయము పరితాపముచేఁ బొడియగుచున్నది కాని రెండుగాఁ బగిలిన బాగగునన్నఁ బగులుటలేదు; సారహీనమగు నీకాయంబు పలుమారు మూర్ఛఁజెందుచున్నది కాని, చైతన్యహీనమైనఁ దీరిపోయెడిది; అంతస్తాపము దేహంబును గాల్చివేయుచున్నది కాని యొక్కమారుగా బూదిచేసినమేలగునన్న నట్లుపొనర్పకున్నది; దైవము తిన్నతిన్నగ నోర్వరానిబాధ నాయువుపట్లఁగూర్చుచున్నాఁడు కాని, యొక్కమారుగ నసువుల దేహమునుండి లాగివైచిన శాంతి చేకూరునన్న నమ్మాడ్కి సలుపకున్నాఁడు.

‡ సీతా:— ఏవ మేతత్. (‡ ఏవ్యస్మేదం.)

సీత:— ఏతత్ = ఇది, ఏవం = ఇట్లే.

రామః:- హే భగవన్తః పౌరజానపదాః.

శ్లో॥ న కిల భవతాం స్థానం దేవ్యా గృహేఽభిమతం తత
స్తృణమివ వనే శూన్యే త్యక్తా న చాప్యనుశోచితా.
చిరపరిచితా స్తే తే భావాః పరిభ్రమయంతి మా
మిద మశరణై రద్యాస్మాభిః ప్రసీదత రుద్యతే ॥ 32

రాముఁడు:- హే=ఓ, భగవంతః = మహాత్ములారా ! పౌర-జానపదాః=పట్టణములయందును బల్లెలయందును నివసించుజనులారా !

అర్థ:- దేవ్యాః=సీతాదేవియొక్క, గృహే=ఇంటియందు, స్థానం=ఉనికి, భవతాం=మీకు, అభిమతం + న + కిల=ఇష్టమైనదికాదు కదా, తతః=అందువలన, తృణం + ఇవ=గడ్డిపోఁచవలెనే, శూన్యే= జనవిహీనమగు, వనే=అడవియందు, ( ఆమె ) త్యక్తా=విడువఁబడినది; న + చ + అనుశోచితా + అపి=అనుశోచింపఁబడనైనలేదు; చిర=చాలకాలమునుండి + పరిచితాః=పరిచితములైన, తే + తే + భావాః = ఆయా, పదార్థములు, మాం = నన్ను, పరిభ్రమయన్తి = చలింపఁజేయుచున్నవి; ఇదం = దీనినంతయు నుద్దేశించి ( ప్రియాశోకవికలచిత్తతవలన ) అశరణైః=దిక్కుమాలియున్న, అస్మాభిః= మాచే, ( నాచే ) రుద్యతే=దుఃఖింపఁబడుచున్నది; ప్రసీదత = ( తాము ) అనుగ్రహింపుఁడు.

తా॥ పట్టమహిషియగు సీత యింటనుండి కాఁపురముచేయుట మీ కిష్టములేకున్నది; అందుచేతనే యామె గడ్డిపరకవలె నరణ్యమునఁ ద్రోయఁబడియును, జచ్చెనా బ్రతికెనా యనియైన విచారింపఁబడదయ్యె. కానిండు, ఎట్లయ్యును బాల్యప్రభృతి పరిచితములగు నాయా భావములు నన్నెంతయో కలఁతపెట్టుచున్నవి. అన్నివిధముల దిక్కుమాలియున్న నాకు నోరు

దెఱచి ఘోరుదుఃఖించుటకన్న గతి యేమున్నది ? కాని తాము మాత్రము నాకైఁగోపింపక యనుగ్రహించుఁడు.

తమసా:— అతిగంభీర మవఘూరణం శోకసాగరస్య.

తమసః:—శోక—సాగరస్య = శోకసముద్రమునకు, అతి—గంభీరం = మిక్కిలిలోతగు, అవఘూరణం=సుడిగుండము.

వాసంతి:—దేవ! అతిక్రాంతే ధైర్య మవలంబ్యతాం దేవేన.

వాసంతి:—దేవ=స్వామీ ! అతిక్రాంతే=గడచిపోయినదానివిషయమున, దేవేన=దేవరవారిచే, ధైర్యం=ధైర్యము, అవలంబ్యతాం = పూనఁబడుఁగాక.

రామః:—సఖి కి మ త్రోచ్యతే ధైర్యమితి ?

రా:—సఖి=చెలీ, అత్ర+కిం=ఈవిషయముననా ? ధైర్యం+ఇతి= ధైర్యమని, ఉచ్యతే=(నీచే)చెప్పఁబడుచున్నది ?

రామః—శ్లో॥ దేవ్యా శూన్యస్య జగతో ద్వాదశః పరివత్సరః
లుప్తం సీతేతి నామాపి న చ రామో న జీవతి॥

రా:—అర్థ—దేవ్యా=సీతాదేవిచే, శూన్యస్య=శూన్యమైన, జగతః= లోకమునకు, ద్వాదశః=పండ్రెండవ,పరివత్సరః=సంవత్సరము, (పండ్రెండు సంవత్సరములు గడచెడి); సీతా+ఇతి=సీతయను, నామ+అపి = పేరు కూడను, లుప్తం=లోపించిపోయినది; (కాని) రామః+న+చ+న+ జీవతి=రాముఁడు జీవించియుండలే దనుమాటలేదు.

తా॥ జానకి యీలోకంబునుబాసి చని పండ్రెండువత్సరంబులు గడచినవి. ఈసరికి సీతయను పేరుగూడ మాసిపోయినది; కాని 'రాముఁడు లేఁ'డను మాటమాత్రము రాకున్నదిగదా !

¹ సీతా:—మోహితాస్మి ఏతై రార్యపుత్రవచనైః.

¹ మోహిఆఅమ్హి ఏదేహిం అజ్జఉత్తవఅణేహిం.

సీత:—ఏభిః - ఈ, ఆర్యపుత్ర = నాథునియొక్క + వచనైః=పల్కులచే, మోహితా + అస్మి=మూర్ఛఁజెందుదాననగుచున్నాను.

తమసా:—ఏవం వత్సే !

శ్లో॥ నైతాః ప్రియతమా వాచ స్స్నేహార్ద్రా శ్శోకదారుణాః
ఏతా స్తా మధునో ధారా శ్చ్యోతంతి సవిషా స్త్వయి॥

తమస:—వత్సే=బిడ్డా, ఏవం=ఇట్లు;—

అర్థ:—స్నేహ—స్నేహముచే + ఆర్ద్రాః=తడిసినట్టియు, శోక = దుఃఖముచే + దారుణాః=కఠినములైనట్టియు;ఏతాః=ఈ,వాచః=పల్కులు,ప్రియతమాః=ఆనందదాయకంబులు, న=కావు; తాః - ఆ, ఏతాః=ఈపల్కులు, సవిషాః=విషముతోఁగూడిన, మధునః=తేనెయొక్క, ధారాః = ధారలు, త్వయి = నీయందు, శ్చ్యోతంతి = కురియుచున్నవి.

తా॥ ప్రేమరసార్ద్రంబులును, దుఃఖావేగదారుణంబులునగు నీ రామునిపల్కులు నీకానందదాయకంబులని యెంచుచుంటివేమో అట్టింత మాత్రము దలంపకుము; అవి పయోముఖవిషకుంభములట్లు విషమిశ్రితంబులుగా నీపైఁగురిపించు మధుప్రవాహములు సుమా !

రామః:— అయి వాసన్తి ! మయా ఖలు,

శ్లో॥ యథా తిరశ్చీన మలాతశల్యం
ప్రత్యుప్త మంతః, సవిషశ్చ దంశః
తథైవ తీవ్రో హృది శోకశంకు
ర్మర్మాణి కృన్తన్నపి కిం న సోఢః ॥ 3౧

రాముఁడు:— అయి = ఓసి ! వాసన్తి=వాసన్తీ, మయా + ఖలు= నాచేతనైతే:—

అర్థః:— అన్తః=లోన, పరిత్యుప్తం=గుచ్చబడినట్టియు, తిరశ్చీనం= అడ్డముతిరిగినట్టి, అలాత—శల్యం = మండెడు నినుపమేకు, యథా=ఎట్లో; సవిషః = విషముతోఁగూడుకొనిన, దంశః+చ = (పాము) కాటున్ను, యథా=ఎట్లో; తథా+ఏవ=ఆవిధంబుగానే, మర్మాణి=ఆయువుపట్లను, కృంతన్+అపి = ఛేదించుచున్నను, తీవ్రః = తీవ్రమగు, శోక—శంకుః = దుఃఖరూపమగుకీలము, సోఢః+న+కిం=సహింపఁబడినది కాదా ?

తా॥ అడ్డము తిరిగిపోవునట్లు గట్టిగా గుచ్చఁబడిన మండెడునినుపమేకు వలెను, విషముతోఁ గూడినపాముకాటువలెను మిగుల తీవ్రమై మర్మస్థానములను ఛేదించుచున్న యీ దుఃఖాత్మకమగు కొయ్య నాహృదయమును భిన్నభిన్నములు గావించుచున్నను సహించుచున్నానా, లేదా?

* సీతా:— ఏవ మస్మి మందభాగినీ పునరపి ఆయాసకారిణీ ఆర్యపుత్రస్య.

సీత:— ఏవం = ఈతీరున, పునః+అపి = మరల, మందభాగినీ = దురదృష్టవంతురాలనగు నేను, ఆర్యపుత్రస్య=ఆర్యపుత్రునకు, ఆయాస—కారిణీ=ఆయాసము—కూర్చుదానను, అస్మి=అగుచున్నాను.

రామః:— ఏవ మతినిష్కంప స్తంభితాంతఃకరణస్యాపి మమ సంస్తుతత్తత్ప్రియవస్తుదర్శనాత్ ఉద్దామోఽయ మావేగః. తథాహి

శ్లో॥ లోలల్లోలక్షుభితకరుణోజ్జృంభణ స్తంభనార్థం
యో యో యత్నః కథమపి మయాధీయతే తం త మన్తః

---

* ఏవ్వ మ్హి మందభాఇణీ పుణో వి ఆఆసఆరిణీ అజ్జఉత్తస్స.

భిత్త్వా భిత్త్వా ప్రసరతి బలాత్ కో౽పి చేతోవికార
స్తోయస్యేవాప్రతిహతరయః సైకతం సేతుమోఘః ॥

రాముఁడు:— అతి—నిష్కంప = ఎంతమాత్రమును గదలకుండఁగా + స్తంభిత = స్థిరముగానుంచఁబడిన + అంతః—కరణస్య + అపి = మనస్సుకల వాఁడనైనను, మమ = నాకు, సంస్తుత = మిక్కిలిపరిచయముగల + తత్—తత్ = ఆయా + ప్రియ = ప్రియముగు + వస్తు = వస్తువులయొక్క + దర్శనాత్ = చూచుటవలన, అయం = ఈ, ఆవేగః = కలవరము, ఉద్దామః = ఎక్కువయైయున్నది; తథా + హి = అట్లేగదా;

అర్థః:— లోల = సంచలించెడి + ఉల్లోల = గొప్పతరంగమువలె + క్షుభిత = సంక్షోభముకల + కరుణ = శోకముయొక్క + ఉజ్జృంభణ = పొంగుటయొక్క + స్తంభన + అర్థం = ఆపుటకొఱకు, మయా = నాచే, యః + యః + యత్నః = ఏయే,ప్రయత్నము, కథం + అపి = అతికష్టముపై, ఆధీయతే = అవలంబింపఁబడుచున్నదో, తం + తం ( + యత్నం ) = ఆయా ( ప్రయత్నమును, ) అప్రతిహత = అడ్డుపాటులేని + రయః = వేగముగల, తోయస్య = నీటియొక్క, ఓఘః = ప్రవాహము, సైకతం = ఇసుక పట్టియేయగు, సేతుం + ఇవ = కట్టనువలెనే, కః + అపి = అనిర్వాచ్యమగు నొకానొక, చేతస్—వికారః = మనోవికారము, అంతః = మనస్సును, బలాత్ = బలవంతముగా, భిత్త్వా + భిత్త్వా = ఛేదించి ఛేదించి, ప్రసరతి = ప్రవర్తించుచున్నది.

తా॥ నా హృదయాంతరంబున శోకతరంగంబు లనుక్షణంబునను బొంగుచుఁ బైకిఁగూడఁ బొరలనుంకించుచుండెడిని; అట్టియెడ నధికప్రయాసంబున నావీచీవిక్షోభము నెదుర్కొనుచున్నాఁడను; ఎంతయత్నంబొనర్చినను—వేగవంతమగు జలప్రవాహ మిసుకకట్టను బలవంతముగఁ గోసివేసెడు చందమున—అనిర్వాచ్యమగు నొక మనోవికారప్రవాహము నాయందు దుర్భ

వించి, దుఃఖనిరోధయత్న సేతుస్థానంబును దెగనఱకుచు నన్ను విఫలీకృత ప్రయత్నునిగాఁ జేయుచున్నది.

* సీతా:—ఏతేన ఆర్యపుత్రస్య దుర్వారదారుణారంభేణ దుఃఖసంక్షోభేణ పరిస్ఫురితనిజదుఃఖ మివ ఆకంపితం మే హృదయం.

సీత:—ఏతేన=ఈ, ఆర్యపుత్రస్య=ఆర్యపుత్రునియొక్క, దుర్వారః=ఆపుటకు వీలుకానట్టియు + దారుణ = ఘోరమైనట్టియు + ఆరంభేణ = ఆరంభముకల, దుఃఖ=దుఃఖముయొక్క + సంక్షోభేణ=సంక్షోభముచే, పరిస్ఫురిత = ఆవిర్భవించిన + నిజ=స్వీయమగు + దుఃఖం + ఇవ = దుఃఖముకల్గినటుల, మే=నాయొక్క,హృదయం=మనస్సు, ఆకంపితం = కదల్పఁబడినది.

వాసంతి:—(స్వగతం) కష్ట మభ్యాపన్నో దేవః, తదన్యతః క్షిపామి తావత్ (ప్రకాశం) చిరపరిచితానా మిదానీం జనస్థానభాగానా మవలోకనే నాత్మాన మానందయతు దేవః

వాసంతి:—(స్వగతం=తనలో) దేవః=ప్రభువగురాముఁడు, కష్టం=కష్టమును, అభ్యాపన్నః = పొందియున్నాఁడు; తత్ = అందువలన, తావత్=ఇపుడు, అన్యతః=మఱొక వైపునకు, క్షిపామి = కొనిపోయెదః (మఱొకవిషయంబునకు మరలించెద) (ప్రకాశం=ప్రకాశముగా) దేవః= ప్రభువులవారు, ఇదానీం = ఇపుడు, చిరపరిచితానాం = చాలకాలము మండియు—పరిచితములైన, జనస్థాన = జనస్థానసంబంధములగు + భాగానాం=ప్రదేశములయొక్క, అవలోకనేన=చూచుటచే,ఆత్మానం=ఆత్మను, ఆనందయతు = సంతోషపెట్టుఁగాక.

---

* ఏదిణా అజ్జఉత్తస్స దుర్వారదారుణారంభేణ దుక్ఖసంక్షోహేణ పప్ఫురిదణిఅదుక్ఖం వి అ ఆకంపిదం మే హిఅఅం.

రామః—ఏవ మస్తు (ఇత్యుత్థాయ పరిక్రామతి)

రా:—ఏవం + అస్తు=ఇటులగుఁగాక (ఇతి=అని, ఉత్థాయ = లేచి, పరిక్రామతి = ఇటునటు దిరుగుచున్నాఁడు)

† సీతా:—ఏతాని సందీపనాన్యేవ దుఃఖస్య ప్రియసఖీ వినోదనోపాయ ఇతి మన్యతే.

సీత:—దుఃఖస్య=(ఆర్యపుత్రుని) శోకమునకు, సందీపనాని=ప్రజ్వలింపఁ జేయునట్టి, ఏతాని + ఏవ = (జనస్థానప్రదేశావలోకనరూపమగు) వీనినే, ప్రియ—సఖీ=ప్రియసఖియగువాసంతి, వినోదన=(నాథుని) వినోదపఱచుటకు + ఉపాయః + ఇతి=ఉపాయమని, మన్యతే=తలఁచుచున్నది.

వాసంతి:—దేవ దేవ !

శ్లో॥ అస్మిన్నేవ లతాగృహే త్వ మభవ స్తన్మార్గదత్తేక్షణః
సా హంసైః కృతకౌతుకా చిర మభూ ద్గోదావరీసైకతే
ఆయాన్త్యా పరిదుర్మనాయిత మివ త్వాం వీక్ష్య బద్ధ స్తయా
కాతర్యా దరవిందకుట్మలనిభో ముగ్ధః ప్రణామాంజలిః॥

వాసంతి:—దేవ=స్వామీ (౨),

అర్థ:—అస్మిన్=ఈ, లతా—గృహే + ఏవ=పొదరింటియందే,త్వం= నీవు, తత్ = ఆసీతాదేవియొక్క + మార్గ = మార్గమున + దత్త=ఉంచఁబడిన + ఈక్షణః = కన్నులుగలవాఁడవు, అభవః = ఐతివి; సా = ఆసీత, హంసైః = హంసలతో, కృత = ఒనర్పఁబడిన + కౌతుకా = (ఆటలవలని) కుతూహలముకలదై, గోదావరీ=గోదావరీనదియొక్క + సైకతే = ఇసుక

† ఏదాఇం సందీవణాఇం ఎవ్వ దుక్ఖస్స పిఅసహీ విణోదణోవాయో త్తి మంతేది.

తిన్నెయందు, చిరం=చాలకాలము, అభూత్ = ఉండెను; ఆయాన్త్యా=(అటుసైమరలి) వచ్చుచున్న, తయా=ఆసీతచే, త్వాం=నిన్ను, పరిదుర్మనాయితం + ఇవ = ప్రసన్నహృదయములేనివానివలె; వీక్ష్య = చూచి కాతర్యాత్ = భయమువలన, అరవింద—కుట్మల—నిభః=పద్మకోశంబుతో సమానమగునట్టియు, ముగ్ధః=మనోహరమైనట్టియు, ప్రణామ-అంజలిః=నమస్కారసూచకమగుదోసిలి, బద్ధః=కట్టఁబడెను.

తా॥ రామా ! మున్ను నీవీలతాగృహంబుననుండుసెడ సీత యొక మారు గోదావరికి నీరు కొనివచ్చుటకు వెళ్లియుండుట తటస్థించె; సీత మరలి వచ్చుట కించుక జాగౌటచే నీవామెవచ్చుమార్గంబునందునసే దృష్టినిగిడ్చి చూచుచుంటివి; సీతయు గోదావరీపులినంబుల విహరించు హంసరాజంబులతోఁ గొంతతడవు క్రీడించి మగిడివచ్చువేళ నీముఖమై ఖరినిబట్టి నీ వప్రసన్నహృదయుఁడవై యున్నటులఁ గనుగొని దుఃఖభయంబులు మనంబునఁ బెనంగొన నీ కోపముదీర్చుటకు, దూరమునుండియే మనోహరముగఁ బద్మకోశరమణీయమగు నంజలి ఘటించెఁగదా !

1 సీతా:—దారుణాసి సఖి ! వాసంతి ! దారుణాసి; యా ఏ తైః హృదయమర్మగూఢశల్యఘట్టనైః పునః పున ర్మాం మందభాగినీం ఆర్యపుత్రం చ సంతాపయసి.

సీత:—దారుణా + అసి = కఠినురాలవగుచున్నావు; సఖి = చెలీ, వాసన్తి = వాసంతీ, దారుణా + అసి = భయంకరురాలవగుచున్నావు; యా = ఏనీవు, ఏతైః = ఈ, హృదయ=హృదయమందలి + మర్మ = ఆయువుపట్లు యందు + గూఢ = డాగియున్న + శల్య = శల్యముయొక్క— +

1 దారుణాసి సహి వాసంతి దారుణాసి జా ఏదేహిం హిఅఅమమ్మగూఢసల్లఘట్టణే హిం పుణో పుణో మందభాఇణిం అజ్జఉత్తం అ సందావేసి.

ఘట్టనైః=అటునిటు గదలించుటలచేత, పునః + పునః = మరలమరల, మందభాగినీం=దురదృష్టవంతురాలనగు, మాం = నన్నును, ఆర్యపుత్రం + చ=ఆర్యపుత్రుని, సంతాపయసి=క్షోభ పెట్టుచున్నావో.

రామః.—చండి ! ఇత స్తతో దృశ్యసే ఇవ; న చానుకంపసే

శ్లో॥ హా హా దేవి ! స్ఫుటతి హృదయం ధ్వంసతే దేహబంధః
శూన్యం మన్యే జగ దవిరతజ్వాల మంత ర్జ్వలామి
సీద న్నంధే తమసి విధురో మజ్జతీ వాంతరాత్మా
విష్వఙ్మోహః స్థగయతి కథం మందభాగ్యః కరోమి॥
(ఇతి మూర్ఛతి)

రాముఁడు:—చండి=కఠినురాలా, జానకి = జనకతనయా, ఇతః + తతః = ఇటువైపునను, అటువైపునను, దృశ్యసే + ఇవ=కానఁబడుచున్నట్లున్నావు; చ=కాని, న + అనుకంపసే=దయఁజూపవు.

అర్థః:— హా + హా = అకటకటా ! దేవి = జానకి, హృదయం = హృదయము, స్ఫుటతి = (దుఃఖముచే) బ్రద్దలగుచున్నది; దేహ = శరీర సంబంధమగు + బంధః=కూర్పు, ధ్వంసతే=శిథిలమగుచున్నది; జగత్ = ప్రపంచమును, శూన్యం=శూన్యమగుదానిగా, మన్యే=తలంచుచున్నాఁడ; అంతః=లోన, అవిరత=ఎడతెగని + జ్వాలం=మంటకల్గునట్లుగా, జ్వలామి= మండిపోవుచున్నాను; సీదన్ = నలిగిపోవుచున్నట్టియు, విధురః=జ్ఞానాది శూన్యమైనట్టి, అంతర్—ఆత్మా = అంతరాత్మయు, అంధే+తమసి=కటిక చీకటియందు, మజ్జతి = మునుంగుచున్నది. మోహః = మూర్ఛ, విష్వక్ = అన్నివైపులను, స్థగయతి = క్రమ్ముచున్నది. మంద—భాగ్యః= దురదృష్ట వంతుఁడనగు నేను, కథం = ఎట్లు, కరోమి = చేయఁగలను ?

తా॥ ప్రేయసీ! జానకీ! ఎన్నరానిదుఃఖావేగంబున నా హృదయము బ్రద్దలగుచున్నది; దేహంబున సంధిబంధంబులు సడలుచున్నవి; ప్రపంచమంతయు శూన్యంబై కన్నులకుఁ గానవచ్చుచున్నది; లోనఁదీవ్రాగ్నిహోత్రింబునఁ గుమిలిపోవుచున్నాను; అధికసంక్షోభముచే నాయంతరాత్మయుఁ గటికచీకటిలో మునిఁగి పరంబేమియుఁ గానకున్నది; మూర్ఛ నన్నన్నివైపులఁ గ్రమ్మివేయుచున్నది; దురదృష్టవంతుఁడనగు నేనేమి ప్రతీకారము చేయఁగలను?

(ఇతి - ఇట్లని, మూర్ఛతి=మూర్ఛఁజెందుచున్నాఁడు.)

† సీతా:—హా ధిక్ హా ధిక్ పునరపి ప్రమూఢ ఆర్యపుత్రః.

సీత:— హా + ధిక్ = అయ్యో ఛీ, ఆర్యపుత్రః = ఆర్యపుత్రుఁడు, పునః + అపి=మగుడ, ప్రమూఢః=మూర్ఛఁజెందినాఁడు.

వాసంతీ:—దేవ! సమాశ్వసిహి సమాశ్వసిహి.

వాసంతి:—దేవ=స్వామీ, సమాశ్వసిహి=సమాశ్వసిహి=ఊఱడిల్లుము ఊఱడిల్లుము.

♦ సీతా:—హా ఆర్యపుత్ర! మాం మందభాగినీ ముద్దిశ్య సకలజీవలోక మంగళాధారస్య తే వారం వారం సంశయితజీవితదారుణో దశాపరిణామః హా హతాస్మి [ఇతి మూర్ఛతి]

సీత:—హా=అయ్యో, ఆర్యపుత్ర=ఆర్యపుత్రుఁడా, మంద-భాగినీం=దురదృష్టవంతురాలనగు, మాం + ఉద్దిశ్య=నన్నుద్దేశించి, సకల = సమస్తమగు + జీవ-లోక=ప్రాణికోటియొక్క + మంగళ= శుభమునకు + ఆధారస్య= ఆధారుఁడవగు, తే=నీకు, వారం + వారం=మాటిమాటికి, సంశయిత = అను

---

† హద్ధీ హద్ధీ పుణో వి పమ్ముఢో అజ్జఉత్తో.

♦ హా అజ్జఉత్త మం మందభాఇణీం ఉద్దిసిఅ సిఅలజీఅ లోఅ మంగళాధారస్స దే వారం వారం సంసయిదజీవిదదారుణో దసాపరిణామో హా హదంహి.

మానింపఁబడిన + జీవిత = ప్రాణములుగలదిగనుకనే + దారుణః = భయంకర మగు, దశా—పరిణామః = అవస్థయొక్క—మార్పు; హా = అక్కటా ! హతా + అస్మి = చచ్చిపోతిఁగదా (ఇతి = అని, మూర్ఛతి = మూర్ఛఁజెందుచున్నది)

తమసా:—వత్సే సమాశ్వసిహి సమాశ్వసిహి పున స్త్వత్పాణిస్పర్శ ఏవ జీవనోపాయః రామభద్రస్య.

తమసః—వత్సే = బిడ్డా, సమాశ్వసిహి = ఊఱడిలుము. పునః = మరల, త్వత్ = నీ + పాణి = హస్తముయొక్క + స్పర్శః + ఏవ = తాకుడే, రామభద్రస్య = రామభద్రునకు, జీవన = బ్రతుకునకు + ఉపాయః = ఉపాయము.

వాసంతీ:— కథమద్యాపి నోచ్ఛ్వసితి హా ప్రియసఖి సీతే క్వాసి ? సంభావయ ఆత్మనో జీవితేశ్వరం.

వాసంతి:— కథం = ఎట్లు ! అద్య + అపి = ఇప్పటికి, న + ఉచ్ఛ్వసితి = ఊర్చుటలేదు; హా = అయ్యో, ప్రియ—సఖి = ప్రియసఖీ, సీతే = సీతా, క్వ + అసి = ఎచ్చటనున్నావు. ఆత్మనః = నీయొక్క, జీవిత—ఈశ్వరం = ప్రాణేశుని, సంభావయ = సమ్మానింపుము.

సీతా:— (ససంభ్రమ ముపసృత్య హృది లలాటే చ స్పృశతి.)

సీత:—( ససంభ్రమం = తొందరపాటుతోఁగూడునటుల, ఉపసృత్య = సమీపించి, హృది = హృదయమునను, లలాటే + చ = నొసటను, స్పృశతి = తాకుచున్నది.

వాసంతీ:— దిష్ట్యా ప్రత్యాపన్నచేతనో రామభద్రః.

వాసంతి:— దిష్ట్యా = అదృష్టవశమున, రామభద్రః = రామభద్రుఁడు, ప్రత్యాపన్న = మగుడవచ్చిన + చేతనః = చైతన్యముకలవాఁడు;

రామః:—శ్లో॥ ఆలింప న్నమృతమయై రివ ప్రలేపై
రంతర్వా బహిరపి వా శరీరధాతూన్
సంస్పర్శః పునరపి జీవయ న్నకస్మా
దానందా దపరమి వాదధాతి మోహం ॥

రాముఁడు:—అర్థ:—అకస్మాత్=అకస్మాత్తుగా, పునః+అపి=మరల (పూర్వపరిచితమగు) సంస్పర్శః =(సీతాహస్తము యొక్క) తాకుడు,అంతః +వా=లోపలను, బహిః+అపి+వా=బైటను, శరీర=దేహసంబంధమగు+ ధాతూన్ = మాంసాదిధాతువులను, అమృతమయైః= సుధామయములగు, ప్రలేపైః=పూతలచే, ఆలింపన్+ఇవ=మర్దించుచుండు పగిది, జీవయన్= బ్రతికించుచు, ఆనందాత్ = ఆనందమునకన్నను (మున్ననుభవించిన మోహమునకన్నను)అపరం+ఇవ=నూతనమైనదానివలెనున్న, మోహం = మోహమును, ఆదధాతి = కల్గించుచున్నది.

తా॥ బాహ్యమున శరీరమును, లోపల నాళ్ళను సుధారస చర్చల ముంచి తేల్చుచున్నట్లున్న యీ హస్తాత్సంస్పర్శ మెచటిదోగాని పోయిన ప్రాణములను మరల నుజ్జీవింపఁజేయుచు న న్నానందమునకంటె విలక్షణ మగు సమ్మోహమునఁ బడఁద్రోయుచున్నది.

రామః:— (ఆనందనిమీలితాక్ష ఏవ) సఖి వాసంతి! దిష్ట్యా వర్ధసే.

రాముఁడు:— (ఆనంద = ఆనందముచే + నిమీలిత =మూసుకొనఁ బడిన + అక్షః + ఏవ = కన్నులుకలవాఁడగుచునే ) సఖి = చెలీ! వాసంతి=వాసంతి! దిష్ట్యా=దైవవశమున, వర్ధసే=మేలొందుచున్నావు.

వాసంతీ:— దేవ ! కథమివ ?

వాసంతి:— దేవ = ప్రభూ, కథం+ఇవ = ఎటువలె ?

రామః:— సఖి ! కిమన్యత్ ? పునః ప్రాప్తా జానకీ.

రా:— సఖి=చెలీ, అన్యత్ + కిం = వేఱేమున్నది; పునః=మరల, జానకీ = సీత, ప్రాప్తా = పొందఁబడినది.

వాసంతి:— అయి దేవ ! క్వ సా ?

వాసంతి:— అయి = ఓయీ! దేవ-స్వామీ; సా=ఆమె, క్వ= ఎక్కడ.

రామః:—(స్పర్శసుఖమభినీయ) పశ్య నన్వియం పురత ఏవ.

రా:—(స్పర్శ=స్పర్శమువలని + సుఖం=సౌఖ్యమును, అభినీయ= అభినయించి) నను + పశ్య = ఇదిగో చూడు, ఇయం = ఈమె, పురతః + ఏవ = ఎదుటనే (ఉన్నది)

వాసంతీ:— అయి కిమితి మర్మచ్ఛేదదారుణై రేభిః ప్రలాపైః ప్రియసఖీదుఃఖదగ్ధామపి పునర్మందభాగినీం మాం దహసి?

వాసంతి:— అయి=ఓయీ, మర్మ = ఆయువుపట్లయొక్క + ఛేద= త్రుంపువలె + దారుణైః = భయంకరములగు, ఏభిః = ఈ, ప్రలాపైః = అసంబంధవాక్యములచే, కిం + ఇతి = ఏమిప్రయోజనమని ? ప్రియ—సఖీ = ప్రియసఖివలని + దుఃఖ=శోకముచే + దగ్ధాం=కాల్పఁబడిన,మందభాగినీం= దురదృష్టవంతురాలనగు, మాం=నన్ను, పునః = మరల, అపి + దహసి = కాల్చుచున్నావా ?

‡ సీతా:—అపసర్తుమిచ్ఛామి; ఏష పునశ్చిరసద్భావసౌమ్యశీతలేన ఆర్యపుత్రస్పర్శేన దీర్ఘదారుణమపి సంతాపం ఝటితి

‡ ఓసరిదుం ఇచ్ఛామి ఏసో ఉణ చిరసబ్భావసోమ్మసీఅలేన అజ్జఉత్తప్ఫంసేణ దీహదారుణం వి సందావం ఝత్తి హారంతేణ వజ్జలేవోవణద్ధో విఅ సిజ్జం ణిస్సహా విపర్యత్థో వేవది అవసో విఅ మే హత్థో.

హరతా వజ్రలేపోపనద్ధ ఇవ స్విద్యన్నిస్సహావిపర్యస్తో వేపతే అవశః ఇవ మే హస్తః.

సీత:— అపసర్తుం=తొలఁగిపోవుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను, ఏషః=ఈ, మే=నాయొక్క, హస్తః + పునః=చెయ్యియైతే, చిర—సద్భావ=చాలకాలమునుండి గలసద్భావయముచే + సౌమ్య—శీతలేన = మృదువగునదియుఁ జల్లనగునదియునై వర్తిలునట్టియు, —దీర్ఘ = దీర్ఘమైనదియు + దారుణం + అపి=భయప్రదపగునదియునైనను, సంతాపం = (నా) దుఃఖమును,— ఝటితి=శీఘ్రకాలముననే, హరతా=పోఁగొట్టునట్టియు,ఆర్యపుత్ర=ఆర్యపుత్రునియొక్క + స్పర్శేన=తాకుడుచే, వజ్ర—లేప = వజ్రబంధనముచే + ఉపనద్ధః + ఇవ=అంటింపఁబడినదివలె, స్విద్యన్ = చెమర్చుచు, నిస్సహా = వికలమైనదియు + విపర్యస్తః = వెలికిలఁబడియున్నదియునై, అవశః + ఇవ=స్వాధీనమున లేనిదానివలె, వేపతే=వణఁకుచున్నది.

రామః— సఖి! కుతః ప్రలాపః ?

శ్లో॥ గృహీతో యః పూర్వం పరిణయవిధౌ కంకణధర
శ్చిరం స్వైచ్ఛాస్పర్శై రమృతశిశిరై ర్యః పరిచితః;—

రా:—సఖి=చెలీ! ప్రలాపః=అసంబంధవాక్యము, కుతః=ఎందుచేత.

అర్థ:—పూర్వం=మునుపు, పరిణయ=పెండిలియొక్క + విధౌ=అనుష్ఠానమందు, కంకణ = వివాహసూత్రమును + ధరః = ధరించియుండిన, యః=ఏహస్తము, గృహీతః = పట్టుకొనఁబడినదియో; ( మఱియునాపై ) అమృత = అమృతమువలె + శిశిరైః = చల్లనైనట్టి, స్వైచ్ఛా = స్వచ్ఛందములగు + స్పర్శైః = స్పర్శలచే, యః=ఏహస్తము, చిరం=చాలకాలము, పరిచితః=అలవాటుపడినదియో;

§ సీతా:- ఆర్యపుత్ర స్స ఏవాసి త్వం.

సీత:- త్వం = నీవు, సః + ఏవ + ఆర్యపుత్రః = (పూర్వశ్లోకార్థ వాచ్యుఁడవగు) ఆ యార్యపుత్రుఁడవే, అసి=అగుచున్నావు.

రామః:- స ఏవాయం తస్యా స్తుహినశికరౌపమ్యసుభగో
మయా లబ్ధః పాణి ర్లలితలవలీకందలనిభః ॥ ౪౦

(ఇతి గృహ్ణాతి)

రా:- అర్థః- తుహిన=మంచుయొక్క+నికర=సమూహముయొక్క+ఔపమ్య = సామ్యముచే+సుభగః = ఆనందమొసఁగునదియు, లలిత=సుతిమెత్తనగు+లవలీ=లవలీలతయొక్క+కందల-నిభః = అంకురముతో సాటియగు, తస్యాః = ఆమెయొక్క, సః+ఏవ+అయం + పాణిః = ఆయీ హస్తమే, మయా=నాచే, లబ్ధః = పొందఁబడినది.

(ఇతి = అని, గృహ్ణాతి = పట్టుకొనుచున్నాఁడు.)

తా॥ పూర్వము వివాహసమయమునఁ గంకణముతోఁగూడిన యే హస్తమును నేను నాచేతఁబట్టుకొంటినో, అమృతమువలె చల్లనైన యతేచ్ఛాదీర్ఘస్పర్శలకు నేచేయి యలవాటుపడియుండెనో, తుహినరాశివలె మనోజ్ఞమై, మృదువగు లవలీ లతాంకురమువలెనున్న యానాప్రియురాలిహస్తమే యిపుడు నాచేఁ జిక్కినది.

* సీతా:- హా ధిక్ ! హా ధిక్ ! ఆర్యపుత్రస్పర్శమోహితాయాః ప్రమాదః ఖలు మే సంవృత్తః.

సీత:-హా+ధిక్ = అయ్యోఛీ, ఆర్యపుత్ర = ఆర్యపుత్రునియొక్క+స్పర్శ = తాకుడుచే + మోహితాయాః = మోహమొందిన, మే = నాకు, ప్రమాదః=ప్రమాదము, సంవృత్తః+ఖలు = తటస్థించినదిగదా.

---

§ అజ్జఉత్తసో ఏవ్వ అసి తుమం. * హద్ధీ హద్ధీ. అజ్జఉత్తప్పరిసమోహిదాఏ పమాదోక్షు మే సంవుత్తో.

రామః:– సఖి వాసంతి ! ఆనందనిమీలితేంద్రియః సాధ్వసేన పరవానస్మి తత్ త్వమపి తావ దేనాం ధారయ.

రాముఁడు:– సఖి=చెలీ, వాసంతి = వాసంతీ ! ఆనంద=ఆనందముచే + నిమీలిత=కొఁటుపాటిన+ఇంద్రియః = ఇంద్రియములుగలవాఁడనై, సాధ్వసేన=భయముచే, పరవాన్=పరతంత్రుఁడను, అస్మి = అగుచున్నాను, తత్=అందువలన, త్వం+అపి=నీవుకూడ, ఏనాం = ఈమెను, ధారయ + తావత్ =కొంచెము పట్టుకొనుము.

వాసంతీ.– కష్టం – ఉన్మాద ఏవ.

వా:– కష్టం = అయ్యోకష్టము,ఉన్మాదః + ఏవ=ఒడలెఱుఁగమియే.

సీతా:– ( ససంభ్రమం హస్తం ఆక్షిప్య అపసర్పతి )

సీత:– ( ససంభ్రమం = తొట్రుపాటుతోఁ గూడునట్లు, హస్తం=చేతిని, ఆక్షిప్య=లాగికొని, అపసర్పతి=తొలఁగిపోవుచున్నది )

రామః:– హా ధిక్ ప్రమాదః.

రాముఁడు:– హా + ధిక్ = అయ్యో చీఛీ, ప్రమాదః=ప్రమాదము గల్గినది.

రా:– శ్లో॥ కరపల్లవ స్స తస్యా స్సహసైవ జడో జడాత్ పరిభ్రష్టః
పరికంపినః ప్రకంపీ కరా న్మమ స్విద్యతః స్విద్యన్॥

రాముఁడు:– అర్థః– స్విద్యన్ = చెమర్చుచున్నట్టియు, ప్రకంపీ = వణకుచున్నట్టియు, జడః=చైతన్యముదక్కినట్టియు, సః = ఆ (నేను బట్టుకొనిన ) తస్యాః=ఆమెయొక్క, కర–పల్లవః = చిగురుటాకువంటి చెయ్యి, స్విద్యతః=చెమర్చుచున్నట్టియు, పరికంపినః=వణకుచున్నట్టియు, జడాత్=

అవశమైనట్టియు, మమ=నాయొక్క, కరాత్=హస్తమునుండి, సహసా = వేగముగా, పరిభ్రష్టః+ఏవ=జారిపోనే పోయినదే?

తా॥ చెమర్చుచున్నట్టియు, వణకుచున్నట్టియు, అవశమైనట్టియు, నేను బట్టుకొనిన యీ సుదతియొక్క పల్లవహస్తము తాదృశసర్వలక్షణములతోఁగూడిన నాచేతినుండి, యిట్టె జారిపోనే పోయినది.

§ సీతా:— హా ధిక్ హా ధిక్ అద్యాపి అనవస్థితస్తిమిత ముగ్ధఘూర్ణన్నయనో న పర్యవస్థాపయ త్యాత్మానం.

సీత:— హా+ధిక్ = అయ్యో! ఛీ, అద్య+అపి = ఇప్పటికిని, అనవస్థిత = (ఒకపుడు) అస్థిరములైనట్టియు+(వేఱొకతఱి) స్తిమిత=నిశ్చలములైనట్టియు + (ఒకమారు) ముగ్ధ = మొద్దువారినట్టియు + (వేఱొకతఱి) ఘూర్ణత్=గుండ్రముగఁ దిరుగునట్టియు నగు+నయనః=కన్నులుకలవాఁడై, ఆత్మానం = తనను, న + పర్యవస్థాపయతి = యథాస్థితియందుంచుకొనఁజాలకున్నాఁడు.

తమసా:— (సస్నేహహాసకౌతుకం నిర్వర్ణ్య)

శ్లో॥ సస్వేదరోమాంచితకంపితాంగీ
జాతా ప్రియస్పర్శసుఖేన వత్సా
మరున్నవాంభఃప్రవిధూతసిక్తా
కదంబయష్టిః స్ఫుటకోరకేవ॥ ౪౨

‡ తమసః— (సస్నేహ-హాస-కౌతుకం = ప్రేమ-నవ్వు-కుతూహలములతోఁగూడునటుల, నిర్వర్ణ్య=తిలకించి)

---

§ హద్ధీ హద్ధీ అజ్జ వి అణవట్ఠిదత్థిమిదముద్ధఘుణ్ణన్తణఅణో ణ పజ్జవతావేది అత్తాణ అం.

అర్థః:— ప్రియ=పెనిమిటియొక్క + స్పర్శ=తాకుటవలని + సుఖేన= సుఖముచే, వత్సా = వత్సయగుసీత, మరుత్=గాలిచేతను + నవ—అంభః= క్రొత్త ( వాన ) నీటిచేతను + ప్రవిధూత = కదల్చఁబడినట్టియు + సిక్తా= తడుపఁబడినట్టియు, స్ఫుట = స్పష్టములగు + కోరకా = మొగ్గలుగలట్టి, కదంబ—యష్టిః + ఇవ = కడిమిచెట్టుయొక్క శాఖవలెనే, సస్వేద = చెమటతోఁ గూడినట్టియు + రోమ—అంచిత=గగుర్పాటుతోఁగూడినట్టియు + కంపిత=వణకునట్టియు + అంగీ=శరీరముగలదై, జాతా=అయినది.

తా॥ భర్తయొక్క హస్తస్పర్శచేఁగల్గిన సుఖమువలన నీమె తనూలత చెమర్చినదై, గగుర్పాటు, వణకు వీనితోఁగూడి గాలిచేఁ గదలుచుఁ దొలకరి వానచేఁ దడిసి మొగ్గదొడిగిన కదంబశాఖవలెఁ గనులకుఁ గానవచ్చుచున్నది.

♦ సీతా:— ( స్వగతం ) అహో ! అవశేన ఏతేన ఆత్మనా లజ్జాపితాస్మి భగవత్యా స్తమసాయాః కిమితి కిల ఏషా మంస్యతే ఏష పరిత్యాగః ఏష చ హృదయాసంగ ఇతి.

సీత:— ( స్వగతం=తనలో ) అహో = అకటా, అవశేన = వశము తప్పిన, ఏతేన= ఈ, ఆత్మనా = ఆత్మచే, అహం = నేను, భగవత్యాః = పూజ్యురాలగు, తమసాయాః=తమసయెదుట, లజ్జాపితా + అస్మి = సిగ్గు గూర్చఁబడినదాననైతి. ఏషః=ఇదే, పరిత్యాగః=విడిచివేయుట, ఏషః= ఇదే, హృదయ=మనస్సుయొక్క + ఆసంగః=ఆసక్తి; ఇతి= అను విషయమున, ఏషా = ఈమె, కిం+ఇతి + మంస్యతే + కిల = ఏమని తలపోయనున్నదో కదా —

---

♦ అమ్మహే అవసేణ ఏదేణ అత్తణా లజ్జావిదంహి భఅవదీఏ తమసా ఏ కిం త్తి కిల ఏసా మణిస్సది ఏసోపరిచ్చాఓ ఏసో అ హిఅఅసంగో.

రామః:- (సర్వతో౽వలోక్య) హా కథం నాస్త్యేవ. నన్వకరుణే! వైదేహి!

రాముడు:- (సర్వతః=అంతట,అవలోక్య=చూచి) హా=అయ్యో, కథం=ఎట్లూ! న+అస్తి+ఏవ=లేనే లేదు. నను=ఓసీ, అకరుణే=నిర్దయురాలా! వైదేహి=జానకి!

‡ సీతా:- సత్య మకరుణాస్మి యా ఏవంవిధం త్వాం ప్రేక్షమాణా నను ధరామ్యేవ జీవితం.

సీత:-యా=ఏ నేను, ఏవం+విధం=ఈవిధముననున్న, త్వాం=నిన్ను, ప్రేక్షమాణా=చూచుచున్న దాననై, జీవితం = ప్రాణమును, ధరామి+ఏవ=ధరించుచునే యున్నదాననో, (సా=అట్టి, అహం=నేను) సత్యం=నిశ్చయముగా, అకరుణా+అస్మి=దయలేనిదాన నగుచున్నాను.

రామః:- క్వాసి దేవి! ప్రసీద. న మా మేవంవిధం పరిత్యక్తు మర్హసి.

రాముడు:- దేవి = దేవీ, క్వ+అసి = ఎందున్నావు? ప్రసీద = అనుగ్రహింపుము; ఏవంవిధం=ఇట్టి, మాం=నన్ను, పరిత్యక్తుం=విడుచుటకు, న+అర్హసి=తగవు.

§ సీతా:- అయి! ఆర్యపుత్ర! విపరీతమి వైతత్.

సీత:- అయి=ఓయి! ఆర్యపుత్ర = ఆర్యపుత్రుడా! ఏతత్=ఇది, విపరీతం+ఇవ-విపరీతమైనదివలె (నున్నది)

---

‡ సచ్చ. అకరుణం హి జా ఏవంవిధం తుమం పేక్ఖన్తీ ణం ధరామి ఏవ్వం జీవిదం. § అయి! అజ్జఉత్త విపరీదం విఅఏదం.

వాసంతీ:- దేవ ప్రసీద ప్రసీద; స్వేనైవ లోకోత్తరేణ ధైర్యేణ సంస్తంభయ అతిభూమింగతవిప్రలంభం ఆత్మానం; కుతోఽత్ర మే ప్రియసఖీ.

వాసంతి:- దేవ=స్వామీ, ప్రసీద=అనుగ్రహింపుము (2); స్వేన=స్వీయమగు, లోక-ఉత్తరేణ=ప్రపంచాతిశయమైన, ధైర్యేణ=ధైర్యముచే, అతి-భూమిం-గత =హద్దుమీఱిన+విప్రలంభం = వియోగదుఃఖముగల, ఆత్మానం=నిన్ను, సంస్తంభయ=నిల్కడపఱచుకొనుము; మే=నాయొక్క, ప్రియ-సఖీ=ప్రియసఖి, అత్ర=ఇక్కడ, కుత్ర=ఎచ్చట (ఉన్నది)

రామః :- వ్యక్తం నాస్త్యేవ. కథ మన్యథా వాసన్త్యపి తాం న పశ్యేత్! అపి ఖలు స్వప్న ఏషః? న చాస్మి సుప్తః; కుతో వా రామస్య నిద్రా? సర్వథా స ఏవ భగవాన్ అనేకవారపరికల్పనానిర్మితో విప్రలంభః పునః పున రనుబధ్నాతి మాం.

రాముఁడు:- వ్యక్తం స్పష్టము; న+అస్తి+ఏవ = (సీత ఇచట) లేనేలేదు ; అన్యథా=అట్లుకానిచో, వాసంతీ + అపి = వాసంతికూడ, తాం=ఆమెను, కథం+న+పశ్యేత్=ఎట్లుచూడలేకుండును ? ఏషః = ఇది; స్వప్నః+అపి+ఖలు = కలయేమోగదా ? సుప్తః+న+చ+అస్మి= నిద్రఁజెందినవాఁడనుగూడఁగాను ? రామభద్రస్య=రామభద్రునకు, నిద్రా= నిద్ర, కుతః=ఎందుండివచ్చును ? సర్వథా=అన్ని విధముల, భగవాన్= అవిలంఘనీయ ప్రభావముగల, అనేక-వార=పలుమారులు+పరికల్పనా= సంకల్పించుటచే+నిర్మితః=నిర్మింపఁబడిన, విప్రలంభః = భ్రమ; పునః + పునః=మరల మరల, మాం=నన్ను, అనుబధ్నాతి=కూడివచ్చుచున్నది.

* సీతా:- మయా ఏవ దారుణయా విప్రలబ్ధః ఆర్యపుత్రః

సీత:- దారుణయా=దుర్మార్గురాలనగు, మయా + ఏవ = నా చేతనే, ఆర్యపుత్రః=ఆర్యపుత్రుఁడు, విప్రలబ్ధః=వంచింపఁబడినాఁడు.

వాసంతీ:- దేవ! పశ్య పశ్య.

శ్లో॥ పౌలస్త్యస్య జటాయుషా విఘటితః కార్ష్ణాయసోఽయం రథః
పశ్యైతే పురతః పిశాచవదనాః కంకాలశేషాః ఖరాః.
ఖడ్గచ్ఛిన్నజటాయుపక్షతి రితః సీతాం జ్వలంతీం వహ
న్నంతర్వ్యాకులవిద్యుదంబుద ఇవ ద్యా మభ్యుదస్థా దరిః॥

వాసంతి:- దేవ=స్వామీ, పశ్య + పశ్య=చూడుము చూడుము.

అర్థ:- అయం=ఇదిగో, జటాయుషా = జటాయువుచే, విఘటితః = విఱుగఁగొట్టఁబడిన, పౌలస్త్యస్య=రావణునియొక్క, కార్ష్ణాయసః= ఉక్కుతోఁ జేయఁబడిన, రథః=రథము; పురతః=ఎదుట, ఏతే=ఇవిగో, కంకాల = ఎముకలగూడే + శేషాః=మిగులుటగల (ఎముకలగూడుమాత్రమే మిగిలిన) పిశాచ-వదనాః = రాక్షసముఖములుగల, ఖరాః = (రథమునకుఁగట్టిన) కంచరగాడిదలు; ఇతః = ఈవైపునుండియే, ఖడ్గ=కత్తిచే + ఛిన్న = నఱుకఁబడిన + జటాయు = జటాయువుయొక్క + పక్షతిః = పక్షమూలములుగలవాఁడై, అరిః=విరోధియగు రావణుఁడు, జ్వలన్తీం=మండిపడుచున్న, సీతాం = సీతను, వహన్=మోయుచు, అంతః=లోపల + వ్యాకుల=చంచలమగు + విద్యుత్=మెఱుపుగల, అంబుదః + ఇవ=మేఘమువలెనే, ద్యాం=ఆకాశమునుగూర్చి, అభి=నూటిగా, ఉదస్థాత్=ఎగిరెను.

---

* మఏ ఏవ్వ దారుణాఏ విప్పలద్ధో అజ్జఉత్తో.

తా॥ రామా ! రావణుఁడు సీతను దొంగిలికొనిపోవువేళ, వాని నడ్డగించిన జటాయువు విఱుగఁగొట్టిన రావణుని యుక్కురథ మిదిగో యీ వైపున నున్నది చూడుము; అవిగో యీ వైపున రావణుని రథంబునకుఁ గట్టఁబడినాఁటి యుద్ధమునఁ జచ్చిన కంచరగాడిదెల యస్థిపంజరములు కానవచ్చుచున్నవి చూడు; ఇదిగో యిచటినుండియే జటాయువు రెక్కలను విఱుగఁగొట్టి, యడలుచున్న జానకినిగొని, మెఱసెడి మెఱపుతోఁగూడిన మేఘమువలె నొప్పెడి యీరావణుఁడు నూటిగా నాకాశముపై కెగిరిపోయెను.

♦ సీతా:— ( సభయం ) ఆర్యపుత్ర ! తాతో వ్యాపాద్యతే అహం చ అపహ్రియే, పరిత్రాయస్వ పరిత్రాయస్వ.

సీత:— ( సభయం=భయముతోఁ గూడునట్లు ) ఆర్యపుత్ర = ఆర్యపుత్రుఁడా ! తాతః=తండ్రి, ( జటాయువు ) వ్యాపాద్యతే = చంపఁబడుచున్నాఁడు, అహం+చ=నేనును, అపహ్రియే = కొనిపోఁబడుచున్నాను, పరిత్రాయస్వ + పరిత్రాయస్వ = రక్షింపుము రక్షింపుము.

రామః :— ( సవేగ ముత్థాయ ) అః పాప ! తాతప్రాణసీతాపహారిన్ ! క్వ యాసి.

రాముఁడు:— ( సవేగం=వేగముతోఁగూడునట్లు, ఉత్థాయ=లేచి ) అః=అరే, పాప = పాపీ, తాత = తండ్రియగు జటాయువుయొక్క+ప్రాణ=ప్రాణములను + సీతా=జానకిని + అపహారిన్=దొంగిలించువాఁడా, క్వ + యాసి=ఎచటికిఁ బోవుచున్నావు.

వాసంతీ :— అయి ! దేవ ! రాక్షసకులప్రలయధూమకేతో ! అద్యాపి తే మన్యువిషయః ?

---

♦ అజ్జఉత్త తాదో వావాదీఅది అహం అ అపహారీఆమి పరిత్తాహి పరిత్తాహి.

వాసంతి:— అయి=ఓయి, దేవ=స్వామీ, రాక్షస = రాక్షసుల యొక్క + కుల = కులముయొక్క + ప్రలయ = గొప్ప నాశనమునకు + ధూమకేతో=తోకచుక్కయైనవాఁడా ? అద్య+అపి = ఇప్పటికిని, తే = నీయొక్క, మన్యు= కోపమునకు+విషయః=విషయమా ( కలదా ? )

* సీతా:— అహో ఉన్మత్తికాస్మి సంవృత్తా.

సీత:— అహో=అయ్యో, ఉన్మత్తికా+సంవృత్తా+అస్మి = పిచ్చియెత్తిన దాన నాచున్నాను.

రామః— అన్య ఏ వాయ మధునా విపర్యాయో వర్తతే.

శ్లో॥ ఉపాయానాం భావా దవిరతవినోదవ్యతికరై
ర్విమర్దై ర్వీరాణాం జగతి జనితాత్యద్భుతరసః
వియోగో ముగ్ధాక్ష్యా స్స ఖలు రిపుఘాతావధి రభూత్
కథం తూష్ణీం సహ్యో నిరవధి రయం త్వప్రతివిధిః॥

రాముఁడు:— అధునా=ఇప్పుడు, అన్యః = వేఱైనట్టి, విపర్యయః + ఏవ=విపర్యాసమే, వర్తతే=దాపరించుచున్నది.

అర్థ:— ఉపాయానాం=ఉపాయములయొక్క, భావాత్ = ఉనికివల్లనున్ను, అవిరత=ఎడతెగని + వినోద= వినోదములయొక్క, వ్యతికరైః=సంబంధములుగల, వీరాణాం = ( ఆంజనేయుఁడు మొదలగు ) వీరులయొక్క, విమర్దైః=ఎదురుతాకిళ్ళచే, జగతి=లోకమునందు, జనిత=యేర్పడిన + అతి– అద్భుత= మిక్కిలియద్భుతమగు + రసః=రసముగల, ముగ్ధ–అక్ష్యాః= సుందరములగు కన్నులు గల సీతయొక్క, సః=ఆ, వియోగః=ఎడబాటు, రిపు= శత్రువగు రావణునియొక్క + ఘాత=కూలిపోవుటయే + అవధిః=హద్దుగాఁ

---

* అహో ఉణ్మత్తి అమ్హి సంవుత్తా.

గలది; తు = (ఇపుడు) ఐతే, అప్రతివిధిః=ప్రతిక్రియచేయుటకు వీలులేనిది గనుక నే, నిరవధిః=అంతములేనట్టి, అయం=ఈ ప్రస్తుతవిరహము, తూష్ణీం= ఊరకయ, కథం + సహ్యః=ఎట్లుసహింపఁదగియుండును ?

తా॥ పూర్వము ప్రియురాలిని రావణుఁడు దొంగిలిననాఁటి విరహ దుఃఖము వేఱు; ఇప్పటివిరహదుఃఖము వేఱు; ఆ నాఁటిదుఃఖము,—బహువిధో పాయంబులఁబన్ని, కపిరాక్షసవీరులు నిజాద్భుతచర్యల లోకంబుల కక్కజంబుగూర్చుచు నాకుఁదోడై చనుదేర—సమరంబున దశకంఠు నేనాఁ డు కూల్చితినో, యానాఁడే—సమసిపోయినది; ప్రస్తుతవియోగదుఃఖంబునకుఁ బ్రతిక్రియనొనర్చి తన్నివృత్తి గాంచుదమన్న నెందును బ్రతిక్రియయే లేకు న్నది; అందుచేతనే యనంతమై యనుక్షణంబునను నన్నీదుఃఖము బాధించు చున్నది; ఇట్టి దురంతదుఃఖ మూరక నెట్లుసహింపవీలగు ?

రామః:— హా ! కష్టం !

శ్లో॥ వ్యర్థం యత్ర కపీంద్రసఖ్యమపి మే వీర్యం హరీణాం వృథా
ప్రజ్ఞా జాంబవతోఽపి యత్ర న గతిః పుత్రస్య వాయోరపి
మార్గం యత్ర న విశ్వకర్మతనయః కర్తుం నలోఽపి క్షమ
స్సౌమిత్రేరపి పత్రిణా మవిషయే తత్ర ప్రియే క్వాసి మే ॥

రాముఁడు:— హా=అయ్యో ! కష్టం=కష్టము.

అర్థ:— ప్రియే = ప్రియురాలా ! యత్ర = ఏప్రదేశమున, మే = నాకు, కపి—ఇంద్ర = సుగ్రీవుని యొక్క + సఖ్యం + అపి = స్నేహమున్ను, వ్యర్థం = వ్యర్థమో; హరీణాం = కోఁతులయొక్క, వీర్యం = పరాక్రమ మున్ను, జాంబవతః = జాంబవంతునియొక్క, ప్రజ్ఞా + అపి = నేర్పరితన మున్ను, వృథా = వ్యర్థమో; యత్ర = ఎచట, వాయోః + పుత్రస్య + అపి = వాయుసుతునకుఁగూడ, గతిః = గమనము, న = లేదో, యత్ర=

ఎచట, విశ్వకర్మ-తనయః = విశ్వకర్మయొక్క పుత్రుఁడైన, నలః + అపి = నలుఁడుగూడ, మార్గం = మార్గమును, కర్తుం = చేయుటకు, న + క్షమః = సమర్థుఁడు కాఁడో, సౌమిత్రేః = లక్ష్మణునియొక్క, పత్రిణాం + అపి = బాణములకుఁగూడ, అవిషయే=విషయము కానట్టి, తత్ర = ఆప్రదేశమున, క్వ + అసి = ఎచ్చట నున్నావు.

తా॥ అయ్యో! ప్రేయసీ! జానకీ! నలసుగ్రీవజాంబవదాంజనేయాది కపీశ్వరుల సర్వశక్తిసామర్థ్యములవలనఁగాని, తుదకుఁ జిరంజీవియగు సౌమిత్రియొక్క తూణీరములవలనఁగాని పొందరాని యేకాననకంతలఁ బడిపోతివో గదా! నిన్నింక నే నెందుఁగాంతును.

♦ బహు మానితాస్మి పూర్వవిరహం.

సీత:- పూర్వ=మునుపటి+విరహం = ఎడబాటుఁగూర్చి, బహు = ఎక్కువగా, మానితా + అస్మి=తలపింపఁబడినదాననైతి.

రామః:- సఖి! వాసన్తి! దుఃఖాయైవేదానీం రామస్య దర్శనం సుహృదాం. కియచ్చిరం త్వాం రోదయిష్యామి? త దనుజానీహి మాం గమనాయ.

రాముఁడు:- సఖి=చెలీ, వాసన్తి=వాసన్తీ! రామస్య = రామునియొక్క, దర్శనం=కాంచుట, ఇదానీం=ఇపుడు, సుహృదాం = స్నేహితులకు, దుఃఖాయ + ఏవ = దుఃఖముకొఱకే (భవతి) కియత్ + చిరం = ఎంతయెక్కువకాలము, త్వాం=నిన్ను, రోదయిష్యామి = ఏడిపింతును, తత్ = అందువలన, మాం=నన్ను, గమనాయ = వెళ్ళుటకొఱకు, అనుజానీహి = అనుమతించుము.

‡ సీతా:- (సోద్వేగమోహం తమసా మవలంబ్య) కథం? భగవతి తమసే! ఆర్యపుత్రో గచ్ఛత్యేవ.

---

♦ బహు మాణిదంహి పువ్వవిరహం.

‡ కథం? భఅవది తమసే అజ్జఉత్తో గచ్ఛది ఏవ్వ.

సీత:– ( స–ఉద్వేగ–మోహం=భయమోహంబులతోఁ గూడునట్లు, తమసాం=తమసను, అవలంబ్య=పట్టుకొని) కథం=ఎట్లు, భగవతి=పూజ్యురాలా, తమసే=తమసా, ఆర్యపుత్రః = ఆర్యపుత్రుఁడు, గచ్ఛతి + ఏవ = పోవుచునే యున్నాఁడు.

తమసా:– వత్సే ! సమాశ్వసిహి సమాశ్వసిహి. నను ఆవామపి ఆయుష్మతోః కుశలవయో ర్వర్ష గ్రంథిమంగళం సంపాదయితుం భాగీరథీపాదాంతికమేవ గచ్ఛావః.

తమస:– వత్సే = బిడ్డా ! సమాశ్వసిహి + సమాశ్వసిహి = ఊరడిల్లుము (౨), ఆవాం + అపి=మన మిర్వురముకూడ, ఆయుష్మతోః = చిరంజీవులగు, కుశ–లవయోః = కుశలవులకు, వర్ష=( నూతన ) సంవత్సర ( ఆరంభ ) మునొక్క ( పుట్టినరోజు పండుగకు సంబంధించిన ), గ్రంథి=బంధనము యొక్క, మంగళం = శుభకర్మమును, సంపాదయితుం=పొనర్చుటకు, భాగీరథీ=భాగీరథియొక్క + పాద = పాదములయొక్క + అంతికం + ఏవ=సమీపమును గూర్చియే, గచ్ఛావః + నను=పోవుదము లెమ్ము.

* సీతా: –భగవతి ప్రసీద; క్షణమాత్రమపి తావత్ దుర్లభం జనం ప్రేక్ష్యే.

సీత:– భగవతి=పూజ్యురాలా, ప్రసీద=అనుగ్రహింపుము; తావత్= ఇపుడు, దుర్లభం = పొందవీలుకాని, జనం = జనమును ( రాముని ) క్షణమాత్రం + అపి = ఒక నిముసమైనను, ప్రేక్ష్యే=చూచెద.

రామః:– అస్తి చేదానీ మశ్వమేధాయ సహధర్మచారిణీ మే;

రాముఁడు:– చ = మఱియు, ఇదానీం=ఇపుడు, అశ్వమేధాయ= అశ్వమేధముకొఱకు, మే = నాకు, సహ–ధర్మ–చారిణీ = ( భార్య ) కూడి ధర్మమొనర్చునాపె, అస్తి = కలదు.

---

* భఅవది పసీద; తుణమేత్తం వి దావ దుల్లహం జణం పేక్ఖామి.

§ సీత:— ( సోత్కంపం ) ఆర్యపుత్ర ! కా సా ?

సీత:— ( స–ఉత్కంపం ) = అదురుతోఁగూడునట్లు ) సా = ఆమె, కా=ఎవతె.

వాసంతీ:— హా పరిణీతమపి ?

వాసంతి:— హా = అయ్యో, అపి + పరిణీతం = ( నీచే ) వివాహము చేసికొనఁబడినదా ?

రామః:— నహి నహి హిరణ్మయీ సీతాప్రతికృతిః.

రాముఁడు:— న + హి + న + హి = లేదు లేదు సుమా, హిర ణ్మయీ=బంగారు వికారమగు, సీతా=సీతయొక్క + ప్రతికృతిః=ప్రతిమ.

* సీతా:— ( సోచ్ఛ్వాసం సాస్రం ) ఆర్యపుత్ర ఇదానీ మసి త్వం. అహో! ఉత్ఖాతం మే ఇదానీం పరిత్యాగ లజ్జాశల్య మార్యపుత్రేణ.

సీత:— ( సోచ్ఛ్వాసం=నిట్టూర్పుతోఁగూడునట్లు; సాస్రం = కన్నీ టితోఁగూడునట్లు ) త్వం=నీవు, ఇదానీం=ఇపుడు, ఆర్యపుత్రః = ఆర్య పుత్రుఁడవు, అసి=అగుచున్నావు. అహో = ఔరా ! ఇదానీం = ఇపుడు, మే = నాయొక్క, పరిత్యాగ = విడిచిపుచ్చుటవలని + లజ్జా=సిగ్గనెడి + శల్యం=శూలము, ఆర్యపుత్రేణ = ఆర్యపుత్రునిచే, ఉత్ఖాతం = పెకలించి వేయఁబడినది.

రామః:— తథాపి తావ ద్బాష్పదిగ్ధం చక్షు ర్వినోద యామి.

---

§ అజ్జఉత్త కా సా. * అజ్జఉత్తో దాణిం సి తుమం. అమ్మహే ఉక్ఖాణిదం మే దాణిం పరిచ్చాఅలజ్జాసల్లం అజ్జఉత్తేణ.

రాముఁడు:— తత్ర+అపి=అచటనైన (ఆ సీతాప్రతిమను జూచి యైన) బాష్ప = కన్నీటిచే+దిగ్ధం = నింపఁబడిన, చక్షుః = నేత్రమును, వినోదయామి + తావత్=ఆనందింపఁజేసెదను.

♦ సీతా:- ధన్యా సా యా ఆర్యపుత్రేణ బహు మన్యతే; యా చ ఆర్యపుత్రం వినోదయన్తీ ఆశానిబంధనం జాతా జీవలోకస్య.

సీత:—యా=ఏయాకృతి, ఆర్యపుత్రేణ=ఆర్యపుత్రునిచే, బహు=ఎక్కువగా, మన్యతే=తలఁపఁబడుచున్నదో, యా=ఏయాకృతి, ఆర్యపుత్రం=ఆర్యపుత్రుని, వినోదయన్తీ = సంతోషపెట్టుచు, జీవలోకస్య = ప్రాణికోటికి, ఆశా=ఆశకు+నిబంధనం+చ=పట్టున్ను, జాతా = అగుచున్నదో; సా = ఆ సువర్ణాకృతి, ధన్యా=ధన్యురాలు.

తమసా:- (సస్మితస్నేహాస్రం పరిష్వజ్య) అయి! వత్సే! ఏవ మాత్మా స్తూయతే.

తమస:— (సస్మిత—స్నేహ—అస్రం) = మందహాసస్నేహబాష్పములతోఁ గూడునట్లుగా, పరిష్వజ్య=కౌఁగిలించి) అయి=ఓసి, వత్సే = బిడ్డా, ఆత్మా = (నీవు) ఆత్మ, ఏవం=ఇట్లు, స్తూయతే = కొనియాడఁబడు (చున్నావు) చున్నది. (నిన్ను నీవే కొనియాడుకొనుచున్నావు)

† సీతా:- (సలజ్జ మథోముఖీ స్వగతం) పరిహాసితాస్మి భగవత్యా.

---

♦ ధణ్ణా సా జా అజ్జఉత్తేణ బహు మణీ అది. జా అ అజ్జఉత్తం వినోదఅన్తీ ఆసాణిబంథణం జాదా జీవలోఅస్స.

† పరిహాసిదంహి భఅవదీఏ.

సీత:— ( సలజ్జం=సిగ్గుతోఁ గూడునట్లు ) అధః = క్రిందికి + ముఖీ= ముఖముకలదై, స్వగతం = తనలో ) భగవత్యా = పూజ్యురాలగు నీచే, పరిహాసితా + అస్మి=ఎగతాళిచేయఁబడితి.

వాసంతీ: — మహా నయం వ్యతికరోఽస్మాకం ప్రసాదః. గమనం ప్రతి పున ర్యథా కార్యహాని ర్న భవతి తథాస్తాం.

వాసంతి:— అయం = ఈ, వ్యతికరః = సమాగమము, అస్మాకం= మాకు, మహాన్ = గొప్ప, ప్రసాదః = అనుగ్రహము, గమనం + ప్రతి + పునః=ప్రయాణమును గూర్చియైతే, యథా = ఎట్లు, కార్యహానిః = కార్యహాని, న + భవతి=కాదో, తథా=అట్లు, ఆస్తాం=అగుఁ గాక.

‡ సీతా:— ప్రతికూ లేదానీం వాసంతీ సంవృత్తా.

సీత:— ( ఇదానీం=ఇపుడు, వాసంతీ=వాసంతి, ప్రతికూలా = అనుకూలురాలు కానిది, సంవృత్తా = ఐనది.

తమసా:— ఏహి వత్సే ! గచ్ఛావః.

తమస:— వత్సే=బిడ్డా, గచ్ఛావః=పోవుదము, ఏహి=రా.

≀ సీతా:— ( సకష్టం ) ఏవం కుర్వః.

సీత:— ( సకష్టం = కష్టముతోఁగూడి ) ఏవం = ఇట్లు, కుర్వః = చేయుదము.

తమసా:— కథం వా గమ్యతే; యస్యా స్తవ,—

శ్లో॥ ప్రత్యుప్తస్యేవ దయితే తృష్ణాదీర్ఘస్య చక్షుషః
మర్మచ్ఛేదోపమై ర్యత్నైః సన్నికర్షో నిరుధ్యతే.

తమస:— కథం + వా + గమ్యతే = ఎట్లుపోవుదానవు యస్యాః + తవ=ఏనీకు, —

‡ పడికూలా దాణిం మే వాసంతీ సంఉత్తా. ≀ ఏవ్వం కరేంహ.

అర్థ:— తృష్ణా=అవలోకనస్పృహచేత + దీర్ఘస్య= విశాలమైనట్టియు, దయితే=ప్రియుఁడగు రామునియందు, ప్రత్యుప్తస్య+ఇవ (+స్థితస్య) = నాటుకొనినట్లున్న, (యస్యాః+తవ=ఏసీయొక్క) చక్షుషః = నేత్రము యొక్క, సన్నికర్షః = (ప్రియునియందలి) సంబంధము, మర్మ=హృదయాది రహస్యప్రదేశములయొక్క + ఛేద — ఉపమైః = కోతలతో సమానములైన, యత్నైః=యత్నములచేత, నిరుధ్యతే= నివర్తింపఁబడుచున్నదో (తథా విధయా త్వయా కథం వా గమ్యతే)

తా॥ హృదయాదిమర్మప్రదేశవిచ్ఛేదము చేయఁజాలినట్లున్న ప్రయత్నములచే నిన్ను నీప్రియుని సమక్షమునుండి తొలఁగింపఁ జూచుచున్నాము గాని నీచూపు తృష్ణాదీర్ఘమై, రామునియందు లగ్నమైపోయినట్లున్నయది; అట్టిచో నీ వెట్లు కదలిరానేర్తువు ?

♦ సీతా:— నమో నమః అపూర్వపుణ్యజనితదర్శనానామార్యపుత్రచరణకమలానాం. (ఇతి మూర్ఛతి)

సీత:— అపూర్వ=నూతనమగు+పుణ్య = పున్నెముచే+జనిత = కూర్చఁబడిన+దర్శనానాం = దర్శనముగల, ఆర్యపుత్ర = ఆర్యపుత్రుని యొక్క+చరణ—కమలానాం=పాదపద్మములకు, నమః = నమస్కారము. నమః=నమస్కారము ( ఇతి=అని, మూర్ఛతి=మూర్ఛఁజెందుచున్నది. )

తమసా:— వత్సే ! సమాశ్వసిహి సమాశ్వసిహి.

తమస:— వత్సే=బిడ్డా, సమాశ్వసిహి=ఊఱడిల్లుము (౨)

‡ సీతా:— (సమాశ్వస్య) కియచ్చిరం వా మేఘాంతరేణ పూర్ణిమాచంద్రస్య దర్శనం.

---

♦ ణమో ణమో అపువ్వపుణ్ణజణిదదరిసణాణం అజ్జఉత్త చరణకమలాణం.

‡ కిఅచ్చిరం వా మేహంతరేణ పుణ్ణిమాచందస్స దరిసణం.

సీత:— (సమాశ్వస్య=ఊఱడిలి) మేఘ = మేఘములయొక్క + అంతరేణ=మధ్యగుండ, పూర్ణిమా—చంద్రస్య = పున్నమనాఁటిచంద్రునియొక్క, దర్శనం=చూపు, చిరం + కియత్ + వా ? = ఎంత పెద్దకాలమువఱకుఁగల్గును ?

తమసా:— అహో సంవిధానకం !

శ్లో॥ ఏకో రసః కరుణ ఏవ నిమిత్తభేదా
ద్భిన్నః పృథక్పృథగి వాశ్రియతే వివర్తాన్
ఆవర్తబుద్బుదతరంగమయాన్ వికారా
నంభో యథా సలిలమేవ తు తత్ సమగ్రం ॥ ४२

తమస:— అహో=ఆహా ! సంవిధానకం=రచన !

అర్థ:— యథా=ఎట్లు, అంభః=నీరు, ఆవర్త (మయ) = సుడిరూపములైనట్టియు + బుద్బుద (మయ) = బుడగరూపములైనట్టియు + తరంగమయాన్ = తరంగరూపములైనట్టియు, వికారాన్ = మార్పులను, సంశ్రియతే=ఆశ్రయించుచున్నదో, తథా=అట్లే, ఏకః + కరుణః + రసః + ఏవ= ఒక్క కరుణరసమే, నిమిత్త = కారణములయందలి + భేదాత్ = భేదమువలన, భిన్నః=భిన్నమై, పృథక్ + పృథక్ + ఇవ = వేఱువేఱుగా నున్నట్లు, వివర్తాన్=పరిణామములను, ఆశ్రియతే=ఆశ్రయించుచున్నది; సమగ్రం + తు = వాస్తవముననైతే, తత్ = పూర్వమందుఁ జెప్పఁబడిన ఆవర్తాదికము, సలిలం + ఏవ=జలమే.

తా॥ ఒక్కజలమే, సుళ్ళుగాను, దరంగములుగాను బుడగలుగాను మారునట్లు, కరుణరసమొక్కటియే, వేఱువేఱుకారణంబులచే వేఱువేఱు విధంబులుగాఁ బరిణామమొందుచుండును గదా !

రామః:— విమానరాజ ! ఇత ఇతః ( ఇతి సర్వే ఉత్తిష్ఠంతి. )

రాముడు:— విమాన–రాజ=విమానశ్రేష్ఠమా, ఇతః + ఇతః=ఇటు వైపునకు, ఇటువైపునకు (ఇతి = అని, సర్వే = అందఱు, ఉత్తిష్ఠంతి = లేచుచున్నారు.)

తమసా–వాసంత్యౌ:– (సీతారామౌ ప్రతి.)

తమసా-వాసంత్యౌ=తమసయు వాసంతియు:— (సీతా–రామౌ + ప్రతి=సీతారాములఁ గూర్చి)

శ్లో॥ అవని రమరసింధు స్సార్థ మస్మద్విధాభి
స్సచ కులపతి రాద్య శ్ఛందసాం యః ప్రయోక్తా
స చ ముని రనుయాతారుంధతీకో వసిష్ఠ
స్త్వయి వితరతు భద్రం భూయసే మంగళాయ ॥ ౪౮

(ఇతి నిష్క్రాంతాః సర్వే)

అర్థ:— అవనిః = భూదేవియు, అస్మత్–విధాభిః = మాబోంట్లతో, సార్థం=కూడా, అమర–సింధుః = దేవనదియగు గంగయు, యః - ఎవఁడైతే, ఛందసాం=ఛందస్సులకు (అనుష్టుప్, ఉపజాతి మొదలగు పద్యలక్షణము లకు) ఆద్యః=మొదటి, ప్రయోక్తా=ప్రయోగించువాఁడును, కులపతిః + చ = కులపతియైన, సః = ఆ వాల్మీకియు, అనుయాత = వెంటనంటెడు + అరుంధతీకః = అరుంధతి కలిగినట్టి, సః = ఆ ప్రసిద్ధుఁడగు, మునిః = ముని యగు, వశిష్ఠః + చ = వశిష్ఠుఁడున్ను, భూయసే = గొప్పదియగు, మంగ ళాయ=శుభముకొఱకు, త్వయి = నీయందు, భద్రం = శ్రేయస్సును, విత రతు - పొనగూర్చు గాక. (కూర్చెదరు గాక)

తా॥ ఓ సీతారాములారా! పూజ్యురాలగు విశ్వంభరాదేవియు, మాబోంట్లతోఁగూడి పరమపావనియగు సురవాహినియు,ఛందోమయముగ రామాయణప్రబంధంబు నిర్మించి, ఆదికవియను ప్రతిష్ఠగడించి, కోట్లకొలఁది శిష్యులకు విద్యాదానమొసంగి కులపతియైయున్నారు వాల్మీకియు, అరుంధతీ సహితుఁడైన మీ కులగురువగు వశిష్ఠమహామునియు, మీకు సర్వవిషయంబుల మంగళంబు లొసఁగి రక్షింతురుగాక!

( ఇతి=అని, సర్వే=అందఱు, నిష్క్రాంతాః=పోవుదురు. )



గుంటూరు: చంద్రికా ముద్రాక్షరశాలయందు ముద్రితము.